# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

విడిప్రతి వెల నాలుగు రూపాయలు!

సంపుటం 82 స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు సంచిక 29

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

(1938-1972 సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్)

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు : 75667, 61247, 61248


## వీక్లీ పోస్ట్

### "కాశ్మీర్ సమస్య"

9-2-90 నాటి పత్రికలో ప్రచురించిన "ప్రపంచం దృష్టిలో కాశ్మీర్ సమస్య" ఎడిటోరియల్ బాగుంది. కాశ్మీర్ భూభాగంలో నలభై సంవత్సరాలుగా జరుగుతున్న అంతర్యుద్ధాన్ని, నలభై ఏళ్ల పరిపాలనా చరిత్రలో ముందు చొరవ తీసుకోని కేంద్ర ప్రభుత్వ ఉదాసీనతని చక్కగా వివరించారు. "అందాల కాశ్మీర్" సమస్య పరిష్కారానికి ప్రస్తుత ప్రభుత్వం ముందు చొరవ తీసుకోగలదని ఆశిద్దాం.

వి. ఎస్. శర్మ,
శంఖవరం.

### చాలాబాగుంటోంది

ఆంధ్ర సచిత్రవారపత్రికలో వీరాజీగారు రాస్తున్న తాజాకాలమ్ నిష్పక్షపాతంగా నిష్కర్షగా వుంటోంది. తాగడానికి నీరులేని జంట నగరాల్లో మురికి నీటి బుద్ధుడి నివాసం నిష్ప్రయోజనమైనది.

పత్రిక చాలా బాగుంటోంది. "లేడీ విత్ ది గోల్డెన్ పెన్" అని ప్రశంసించబడిన అసమాన రచయిత్రి మన్నెం శారదగారి సూపర్ హీరో నిజంగానే సుప్రీంగానే ఉంది. నిఖిలేశ్వరి పాత్ర ఎంతో హుందాగా నడుస్తోంది. శైలిపరంగా ఎంతో హృద్యమంగా వున్న ఈ సీరియల్ కోసం మేము ఎంతగానో ప్రతి వారం ఎదురుచూస్తున్నాం.

కవర్ మీద నిరోష మా హృదయాలకే ఉషార్!

నిఖిల్, అఖిల్, విష్ణుశ్రీ,
శ్రీకాంత్, విజయ్, శాంతి,
అరుణ, కిరణ్, హైమ
నిజామాబాద్.

### బాగుంది

ప్రపంచం దృష్టిలో కాశ్మీర్ సమస్య (సంపాదకీయం) చాల బాగుంది. కథలు అన్ని బాగున్నాయి. సూపర్ హీరో, శత్రు సంహారం, సీరియల్స్ చాలా ఇంట్రెస్టుగా సాగుతున్నాయి. న్యాయ చట్టం, డాక్టర్ నేనేం చెయ్యాలి? ఈ శీర్షికలు చాల ఉపయోగకరంగా వున్నాయి.

– సి. హెచ్. శ్రీనివాసరావు,
గౌరీపట్నం, ప.గో.జిల్లా

(69వ పేజీ చూడండి)




ముఖచిత్రం:
వర్ధమాన తార
రమ్యకృష్ణ
[ఫొటో:- సత్యమూర్తి]

పైవారం:
'టానా' పోటీ కథలు

## పదండి లోపలికి!

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 6H/3

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ | ఎడిటర్: వీరాజీ | ముద్రాపకుడు: ప్రచురణకర్త: శివలెంక నాగేశ్వరరావు

విజయవాడ | 9-3-1990 | శక సం. 1911 ఫాల్గుణమాసం 18వ తేదీ

# గవర్నర్ జగ్‌మోహన్ సాహసచర్య !

కాశ్మీర్ సమస్య భారత్-పాకిస్తాన్‌ల మధ్య ఆరని చిచ్చులా కొనసాగుతున్న సమస్య! కాశ్మీర్ సమస్య భారతదేశంలోని ప్రజలందరినీ కలవరపరుస్తున్న సమస్య!! అంతేగాని గవర్నర్ జగ్‌మోహన్, ఫారుక్ అబ్దుల్లాల మధ్య 'అమీ-తుమీ' తేల్చుకోవలసిన సమస్య కాదు. కాశ్మీర్‌లో ప్రజలు కూడా ప్రపంచ వ్యాప్తంగా ప్రజలందరూ ఇవాళ కోరుకున్నట్లే- ప్రజాస్వామ్య పరిపాలననే అంగీకరిస్తారు కానీ- ఏదో ఒక వ్యక్తి అతను గవర్నరయినా లేదా నిరంకుశ ముఖ్యమంత్రి అయినా అతని దమననీతిని సహించరు. 1984 లో శ్రీ జగ్‌మోహన్ కాశ్మీర్ గవర్నర్‌గా ఉన్నప్పుడు జరిగిన చిత్ర విచిత్ర భావోద్రేక సన్నివేశాలను గుర్తుకు తెచ్చుకోకుండా నేషనల్ కాన్ఫరెన్స్ నాయకుడూ, రాష్ట్ర ముఖ్యమంత్రీ కాశ్మీర్ ముస్లింలలో అత్యధిక సంఖ్యాకుల మన్నన ఆదరణా పొందిన ఫారూక్ అబ్దుల్లా మీదికి శ్రీ జగ్‌మోహన్‌ని దండయాత్రకు పంపించారా? అన్న సందేహాన్ని నాడే ప్రజలూ, పత్రికలూ వెలిబుచ్చాయి. దేశంలోని వామ పక్షాలు కూడా రాజకీయ ప్రయోజనాలను కొంతవరకు పక్కకు నెట్టి- కాశ్మీరు లోయకి శ్రీ జగ్‌మోహన్‌ని పంపడం పట్ల స్పష్టంగానే అయిష్టాన్ని ప్రకటించాయి! కాని శ్రీ వి.పి.సింగ్‌కి ఇప్పుడిప్పుడే కాశ్మీర్‌లో రాజ్యాంగాన్ని అడ్డం పెట్టుకొని శ్రీ జగ్‌మోహన్ తీసుకుంటున్న సాహస చర్యలు అవగతమవుతున్నాయి!

శ్రీ జగ్‌మోహన్- లోయలో అడుగు పెడుతూనే అసెంబ్లీని తాత్కాలికంగా రద్దు చేశారు. అంతటితో ఊరుకోక కేవలం కేంద్రంలో ఉన్న రాజకీయ పక్షాలకి అనుకూలంగా లేని- రాజకీయ పక్షం చేతిలో ఉన్న నేరానికి రాష్ట్ర అసెంబ్లీనే ఒక్క కలం పోటుతో రద్దు చేశారు. దేశ ప్రధానమంత్రి ఈ వార్త విని అవాక్కయిపోయాడూ అంటే- శ్రీ జగ్‌మోహన్‌గారు ఫారూక్ అబ్దుల్లా మీద ఎంత తొందర తొందరగా కక్ష సాధింపు చర్యలు తీసుకుంటున్నాడో అందరికీ అర్థమయిపోయింది.

అదే సమయంలో దేశ హోంశాఖామంత్రి శ్రీ ముఫ్తీ మహమ్మద్ సయీద్ రాజ్యాంగంలోని 370వ ఆర్టికల్ ఎంతమాత్రం రద్దు కాబోదు- అంటూ ప్రకటనలు చేశారు. కాశ్మీర్ ప్రజా నాయకునిగా చెప్పుకుంటున్న శ్రీ ముఫ్తీ- కాశ్మీర్ సమస్య పరిష్కారంలో మరింత కీలక పాత్ర వహించడానికి బదులు-శ్రీ జగ్‌మోహన్ చర్యలని బాహాటంగా- ప్రధానమంత్రికి తలకాయ నొప్పిగా పరిణమించే విధంగా సమర్థిస్తూ రావడం చాలా విడ్డూరంగా ఉంది! దీన్ని బట్టి చూస్తే యిప్పుడు కాశ్మీర్ సామాన్య ప్రజానీకం " అడకత్తెరలో పక్క" లాగా ఒకవైపు పాకిస్తాన్ నుంచి వచ్చిన సాయుధ దుండగుల ఆగడాలను, మరో వైపు మాజీ ప్రధాని- ప్రస్తుత నిరంకుశ గవర్నర్‌ల అధీనంలోఉన్న బలగాల అణచివేత చర్యలను భరించవలసి వస్తోంది.

కాశ్మీర్‌లోకి పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్న 'సోకాల్డ్' అజాద్ కాశ్మీర్ నుంచి ఆయుధాలు,నిధులు,కమెండోలు కూడా ధారాళంగా ప్రవేశిస్తున్నట్లు ఆక్రమిత కాశ్మీర్ అధ్యక్షుడు అబ్దుల్ ఖయూమ్- 'ఎసోసియేటెడ్ ప్రెస్' సంస్థకి యిచ్చిన ఇంటర్వ్యూలో సగర్వంగా చెప్పుకున్నాడు. ఆక్రమిత కాశ్మీర్- ప్రభుత్వ ఆధ్వర్యంలోనే కాశ్మీర్‌లో ఉన్న దుండగీడులకు విరాళాలు వసూలు చేసి పంపిస్తున్నట్లు వార్తలు నిత్యమూ వెలువడుతూనే ఉన్నాయి. ఈ దశలో కాశ్మీర్ రాష్ట్రంలోని ప్రజలు నైతికంగా, భౌతికంగా ఏకోన్ముఖులై స్వాతంత్ర్య పరిరక్షణకి నడుంకట్టే విధంగా- ప్రేరణా, ప్రోత్సాహం అందించాలేకానీ- కేంద్రం నియమించిన గవర్నర్ తీసుకుంటున్న అప్రజా స్వామిక చర్యలను దుయ్యబడుతూ 'ఫారూక్ అబ్దుల్లా జిందాబాద్' జెండాలను పట్టుకొని ఊరేగింపులు నిర్వహించే విధంగా వారిని రెచ్చగొట్టకూడదు. 'రిగ్గింగ్, బెగ్గింగ్, స్టీలింగ్' పద్ధతుల్లో ఎన్నికల్లో అబ్దుల్లా గెలిచిన ఆరోపణలున్నా దానిమీద తీర్పు ఇవ్వడం- శ్రీ జగ్‌మోహన్ తక్షణ కర్తవ్యం కాదు. కాశ్మీర్‌లో పాక్ పన్నాగాలను-పాకిస్తాన్ కబ్జాలో ఉన్న ఆక్రమిత కాశ్మీర్ చేస్తున్న ఆగడాలను తిప్పికొట్టడానికి- రాష్ట్రంలోని అన్ని వర్గాల వారిని కూడగట్టుకొని, దేశ సమగ్రతని, భౌగోళిక సరిహద్దులనీ కాపాడవలసిన బాధ్యత శ్రీ జగ్‌మోహన్, శ్రీ ముఫ్తీ మహమ్మద్, శ్రీ ఫారూక్ అబ్దుల్లా ప్రభృతులందరిమీదా ఉన్నది.

మన హోంమంత్రి శ్రీ ముఫ్తీ దేశంలోని ఎన్నికల సభల వేదిక మీదకాక- కాశ్మీర్ లోయలోని సంక్షుభిత ప్రాంతాల్లోకి పోయి- అక్కడి నుండి పాకిస్తాన్‌కి వినబడే విధంగా 'కయ్యానికి కాలు దువ్వితే డొక్క చీలుస్తాం'- అన్న హెచ్చరికను- చెయ్యడం బాగుంటుందికదా! సహజంగానే వ్యాకులమనస్కుడైన శ్రీ వి.పి.సింగ్ గారు గవర్నర్ శ్రీ జగ్‌మోహన్‌ను ఢిల్లీకి పిలిపించాడు, వారిరువురిమధ్య జరిగే మంతనాలు మా యీ ఆవేదన వెలువడే సమయానికి అందరికీ తెలిసిపోతాయి!

అది వేరే సంగతి. కాశ్మీర్‌లో శాంతి భద్రతల పరిరక్షణకు ఏమి చెయ్యాలి? అన్న ప్రశ్నకు శ్రీ ఫారూక్ అబ్దుల్లా గ్రూపుతో సహా దేశంలోని ప్రతిపక్షాల పెద్ద తలకాయలన్నీ వెంటనే సమావేశమై- సమాధానాన్ని రూపొందించాలి. ఒక చర్య రాజ్యాంగ విహితమా? అహితమా? అన్న ప్రశ్న ప్రధానం కాదు. అసలు సమస్య ముఖ్యం. ఇది ఫ్రంట్ గవర్నమెంటు, దాన్ని సమర్థిస్తున్న పార్టీలు వెంటనే ఆలోచించాల్సిన అత్యవసర చర్య! మరో "ఇండోపాక్ వార్" రాకండా చివరి క్షణాలదాకా- పాటుపడటమే ఉపఖండానికి, భారత ఖండానికి కూడా శ్రేయస్సు!

26-2-'90

# తాజా కాలమ్

ఫిరాజీ

కోటి మీద మరో పదో పది హేను లక్షల మంది జనాభావున్న ఏకైక హిందూ దేశం - ప్రపంచంలో అన్ని దేశాలకన్నా ఎత్తైన ప్రదేశం - అయినా నేపాల్ లో భారతదేశంలోమాదిరి బహుళ పార్టీ ప్రజా స్వామ్య వ్యవస్థ కోసం నేపాల్ కాంగ్రెసు

## నేపాల్ లో డెమోక్రసీ కోసం...

ఆధ్వర్యంలో వామపక్ష ఐక్య ఫ్రంట్ ఫిబ్రవరి 18న ప్రారంభించిన ఉద్యమం రక్త తర్పణలు చేస్తూ, "హరోం హర హరోం హర" అంటూ సాగిపోతున్నది! పంచాయత్ మాదిరి పాలనను ప్రజలు వద్దు అంటున్నారు అనడానికి నిదర్శనగా యీ ఉద్యమంలో ప్రజలు ఉప్పొంగిన కడలిలాగా ప్రాణాలొడ్డి పోరాటం సాగిస్తున్నారు. - కమ్యూనిస్టు దేశాలలోనే - బహుళ పార్టీ పాలనకు "శిధులీ వియూ"తో అంకురార్పణ జరిగినప్పుడు - ఆర్యావర్తనంలో భాగమైన నేపాల్ లో యిప్పటికే ప్రజాస్వామ్యం మూడు పువ్వులు ఆరుకాయలుగా సాగవలసింది - అయితే 1961లో బి పి కొయిరాలా ఆధ్వర్యంలో వున్న ప్రభుత్వాన్ని - తన సింహాసనం వదులుకోడానికి యిష్టపడని రాజు రద్దుచేసినప్పట్నే - యిప్పటి రాజు బీరేంద్రాతో సింహాసనం కోల్పోడానికి చేతులారా పూనుకోలేకనే - ప్రజాస్వామ్యం కోసం జనం పూరించిన సమర శంఖాన్ని తిరుగుబాటు 'ధ్వని'గా భ్రమపడుతున్నారు ఈ వుద్యమంలో ప్రజలు పాల్గొంటున్నారు కనుక దీన్ని నామమాత్రపు సైనిక బలగాలున్న నేపాలీ గవర్నమెంటు - యుద్ధం చేసికూడా గెల్వలేదు - అయితే యీ పోరాటం విషయంలో భారతదేశం ప్రేక్షకపాత్ర వహించాలా వద్దా? అన్నదే మనల్ని వేధిస్తున్న!

శ్రీలంకలో, బంగ్లాదేశ్ లో పీకల మొయ్యా దిగిపోయిన భారత్ నేపాల్ అంతరంగిక వ్యవహారాలలో దిగిపోవాల్సిన అవసరం లేదు - శ్రీలంకలోని ఆ త్యాహంకార రక్తపిపాసకు బలి అయిపోతున్న భారతీయ సంతతివారైన తమిళులకు బాసటగా వెళ్లడం భారత్ కు తప్పనిసరి పైగా అప్పటి గవర్నమెంట్ నోరు విప్పి సహాయం అడిగింది కూడా నేపాల్ సంగతి వేరు వాణిజ్య రవాణారంగంలో ఉభయ దేశాల ఒప్పందాలు గత మార్చి నుంచి స్తంభించి పోయాయి వాటి పునరుద్ధరణకు మార్గం సుగమం చేసుకుంటున్న భారత్ - నేపాల్ లోని రాజకీయ ఉద్యమాల జోలికి పోకపోడం మంచిది అని ప్రధానమంత్రి శ్రీ వి పి సింగ్ తీసుకున్న నిర్ణయం ప్రస్తుత పరిస్థితులలో మంచిదే కాని నేపాల్ లో సంభవిస్తున్న సంఘటనలను శ్రద్ధగా గమనించడం మాత్రం మనం మానకూడదు

## జై లలితకే పునర్జన్మ!

42వ పుట్టినరోజునాడు అభిమానులు ఏర్పాటుచేసిన బ్రహ్మాండమైన అభినందన సభకోసం (ఫిబ్రవరి 24) పాండిచ్చేరి నుంచి పాడావుడిగా వస్తూవున్న అఖిలభారత అన్నా డి ఎమ్ కె 'అధినేత' శ్రీమతి జయలలితకు సంభవించిన కారు ప్రమాదంలో నిజంగా పునర్జన్మ లభించింది మీనంబక్కం రైలు స్టేషన్ సమీపంలో జయలలిత ప్రయాణంచేస్తున్న కారును - డి ఎమ్. కె. జెండా ఎగరేసుకుంటూ వచ్చిన ట్రక్కు వొకటి - ముక్కుకు సూటిగా గుద్దుకుంది! జయలలిత కారు ముందు భాగం నజ్జునజ్జయిపోయింది! "ఎం జి యార్ ఆశీస్సుల బలం" తో జయలలిత స్వల్ప గాయాలతో గండం గట్టెక్కి బయటపడ్డది ఆసుపత్రిలో చేరిన వెంటనే ఏమాత్రం ఆలస్యం చేయకుండా తనను ఘోరంగా చంపాలని"



జయలలితను పరామర్శిస్తున్న మాజీ ప్రధానమంత్రి

# తాజాకాలమ్

డి.ఎమ్.కె. పార్టీ వన్నిన కుట్రంటే యిది అంటూ, స్టేట్ మెంటు యిచ్చేసిందామె!

ఎం.జి.యార్, ఎన్.టి.ఆర్. లాంటి సినిమా స్టార్ పొలిటీషియన్స్ లివింగ్ స్టయిల్ ను అయాచితంగా అందిపుచ్చుకున్న 42 సంవత్సరాల శ్రీమతి జయలలిత వార్తల్లో పడ్డారంటే చాలు బోలెడంత సంచలనం వుంటుంది అందులో! ఐతే ఇంతటి దారుణమైన కారు ప్రమాదం నుంచి బ్రతికి బయటపడ్డ యీమెపట్ల సానుభూతి అందరికీ వుంటుంది. వుండితీరాలి. సినిమాల్లో చూపించే "చీప్" కుట్రలమాదిరి "కుట్ర" డి.ఎమ్.కె. పార్టీ పన్ని - ప్రత్యర్థి నాయ



పచ్చడి అయిపోయిన అన్నా డి.ఎమ్.కె. నాయకురాలి మోటారు శకటం.



మళ్లీ గద్దర్ గజ్జెల ఝుంకారం ప్రజలను విపరీతంగా ఆకర్షిస్తున్నది!

కురాలిని అంతం చేయాలి అని చూసిందీ అంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది - ఈ ప్రమాదం అన్నిరకాల రోడ్డు ప్రమాదాల లాంటిదే అని "బియాండ్ ఏ రీజనబుల్ డవుట్" రుజూ చేయాల్సిన బాధ్యత పావం పోలీసు డిపార్ట్ మెంట్ మీద పడుతుంది! పుట్టినరోజునాడు - యింతటి ప్రమాదం నుంచి తప్పించుకుని - బయటపడ్డ జయలలితకు - ఆమెకు ఆరాధ్య దైవం అయిన ఎం.జి. యార్ లాగే నిండు ఆయుష్షు కలగాలని ఆకాంక్షిస్తున్నాను - దెబ్బలుతిన్న ఆమె ఫోటో పత్రికలకు దొరకలేదు కాని ఆమె కారు బొమ్మను చూస్తే దాని డ్రయివర్ 'అన్నాదురై' ఆయుర్దాయం యెంత గట్టిదో తెలుస్తుంది మనకి. అనారోగ్యంగా వుండి, రకరకాల చికిత్సలు పొందుతున్న జయలలితకి భవుతికంగా తగిలిన గాయాలకన్నా ఈ కారు ప్రమాదం మానసికాందోళనను కలిగించే అవకాశాలు ఎక్కువున్నాయి. అసెంబ్లీలో అవమానం జరిగినప్పటినుంచి శ్రీమతి జయలలిత యింత వరకూ మనస్థిమితాన్ని చిక్కబట్టుకోలేదు. కాంగ్రెస్ (ఐ) పార్టీ అధ్యక్షుడు రాజీవ్ గాంధీ మద్రాసులోని దేవకీ హాస్పటలుకి వెళ్లి శ్రీమతి జయలలితని పరామర్శించిన తరువాతనైనా యితర రాజకీయ పార్టీలకి, డి. ఎమ్.కె. పార్టీకి - తాము కూడా యిటువంటి సామాజిక మర్యాదని పాటించవలసి వుంటుందన్న జ్ఞానం కలిగివుండాలి! ఏమంటారు? ●

సీరియల్

# ద్రౌపది

ప్రయాగ రామకృష్ణ



(గత సంచిక తరువాయి)

అశ్వత్థామ మొహం కఠినంగా మారింది కోపంతో మండిపడుతూ "మా తండ్రి శ్రీ మహావిష్ణువుని ఆరాధించి ఒక దివ్యాస్త్రం పొందాడు ఆది ఆయన నా కిచ్చాడు దాంతో పాండవుల ఆట కట్టిస్తాను చూడు నా కత్తి వ్రేటుకి వాళ్ళ తల లెగిరిపోకపోతే నేను మీ గురు పుత్రుణ్ణే కాదు' అని సవాలు చేశాడు

ఆ మాటలతో దుర్యోధనుడికి ఉత్సాహం వచ్చింది కర్ణుడిని తన సేనకు అధిపతిగా చేసి, అతనికి శల్యుణ్ణి రథసారథిని చేసి మళ్ళీ యుద్ధానికి బయలు దేరాడు

ఇంతలో వాళ్ళకు అభిముఖంగా కృష్ణార్జునుల రథం వచ్చింది. అర్జునుడు కర్ణుణ్ణి చూస్తూనే కంగారు పడ్డాడు. దేవతలకు సాధ్యంకాని వాళ్ళను కూడా జయించాడు తను. దుర్యోధనుడి ఆశలు ఆరిపోయేటట్టు.

భీష్మ, ద్రోణులను నేల కూల్చాడు. సైంధవుణ్ణి హత మార్చాడు. కాని ఎందుకో ఇవేళ కర్ణుడి శౌర్య ధైర్య బాహు పరాక్రమాలకు మాత్రం తను సరిపోయేటట్టు లేదు– అనిపించింది.

కృష్ణుడు గమనించాడది.

"నీకిక్కడ మొగు డెవడూ లేడు. నిన్ను ఆదుకునే వాళ్ళు అంతకంటే లేరు. జూదంలో ఓడి నీ భర్తలయిదుగురూ విడిచేశారు నిన్ను. మాలో నీకు మనసైన మగవాణ్ణి ఏరుకో' అన్నాడు కర్ణుడు ద్రౌపదిని. ఆ మాటలు మరిచి పోయావా? నేను రాయబారానికి వెడితే నన్ను బందించేందుకు ప్రయత్నించిన వాళ్ళలో ఈ ప్రబుద్ధుడూ వున్నాడు ఆ సంగతి నీకు తెలీదా? నీ కొడుకు అభిమన్యుడి విల్లు మోసం చేసి విరిచేశాడు వాడు నీతిమంతుడా? అసలు దుర్యోధనుణ్ణి పాడు చేసిందే కర్ణుడు అలాంటి వాణ్ణి చంపేందుకు ఎందుకు భయపడుతున్నావ్" అని అడిగాడు

అర్జునుడికి రోషం వచ్చింది

గాండీవం అందుకున్నాడు

కర్ణార్జునులు శక్తికి రూపాల్లా చెలరేగారు

ఒక వంక అర్జునుడు కర్ణుడితో యుద్ధం చేస్తుంటే మరోవంక భీముడు దుశ్శాసనుణ్ణి ఎదిరించాడు. కోపంతో వూగిపోతూ గద తీసుకుని దుశ్శాసనుడి రథాన్నీ, గుర్రాన్నీ చావగొట్టాడు. పద మూడేళ్ళ పాటు అడవుల్లో ద్రౌపది పడిన కష్టాలన్నీ ఆ క్షణాన భీముడికి గుర్తుకొచ్చాయి. ఒక్క దెబ్బతో దుశ్శాసనుని తోశాడు. అతను నెత్తురు కక్కుతూ నేల మీద పడ్డాడు.

భీముడు అతని కాళ్ళు పట్టి గిరగిర తిప్పి నేలకేసి కొట్టాడు. అతను ఎంత వేడినా, రొప్పినా, ఏడ్చినా వదిలి పెట్టలేదు.

మోకాళ్ళతో కుమ్మాడు.

కాళ్ళతో తన్నాడు.

ఏదో మాట్లాడబోయి, మాట పెగలక, ఊపిరాడక గింజుకుంటున్న దుశ్శాసనుడి మెడను ఒక కాలితో అదిమి పట్టి "ఏరా! నీళ్ళల్లో తొయ్యడం, విషాన్నం పెట్టడం, పాములతో కరిపించడం, ద్రుపద రాజ పుత్రిని నీ ఇష్టం వచ్చినట్టు ప్రేలడం అన్నీ జ్ఞాపకం వస్తున్నాయా?" అని బాణం మొన తీసి అతని ముఖం మీద సూటిగా గుచ్చాడు.

దుశ్శాసనుడి మొహంలోకి చావుకళ వచ్చింది కళ్ళు తేలేశాడు

నరసింహుడు హిరణ్యకశిపుణ్ణి చీరినట్టు చీరి దుశ్శాసనుడి రక్తం దోసిటబట్టి తాగాడు భీముడు

అతనికి అప్పటికీ తృప్తి కలగలేదు

ఆ నెత్తురు శరీరం నిండా ముఖం నిండా భయంకరంగా చల్లుకున్నాడు.

అతన్ని చూసి భయపడి పోయి కౌరవ సైన్యమంతా చెల్లా చెదురైంది.

రెప్పల మీదగా జారుతున్న నెత్తురును ఒక చేత్తో తుడుచుకుంటూ మరో చేత్తో గద తిప్పుతూ నవ్వుతూ, తుళ్ళుతూ, కేరింతలు కొడుతూ ద్రౌపదీ దేవి మందిరం వైపు వెళ్ళాడు భీముడు.

అతన్ని చూసి చేష్టలు దక్కి నిలబడింది ద్రౌపది. వచ్చింది మనిషో రాక్షసుడో తెలీలేదు.

"నువ్వు కూడా నన్ను చూసి భయపడిపోతే ఎలా? ఆనాడు నిండుసభలో నీకు భర్తలు లేరని హేళన చేసిన దుశ్శాసన చక్రవర్తికి భర్తలున్నారన్న సంగతి గుర్తు చేసి వస్తున్నాను. ఇన్నాళ్ళూ శ్రీమంతుడైన భర్త వున్నాడనుకున్న దుశ్శాసనుడి శ్రీమతికి పాపం ఇప్పుడు బొట్టూ కాటుకా లేకుండా పోయాయి" అన్నాడు.

ద్రౌపది సంతోషంతో అరిచినంత పని చేసింది అమాంతం అతన్ని చుట్టేసుకుంది.

తెల్లటి బుగ్గమీద, ఎర్రటి చుక్క అంటింది.

* * * * * * *

కర్ణార్జును లిద్దరికీ ద్వంద్వ యుద్ధం జరుగుతోంది.

అర్జునుడు వేసిన ప్రతి బాణాన్నీ కర్ణుడు

> **ఇంతవరకూ సాగినకథ -: 30** పాండవులు జూదంలో ఓడిపోయి పన్నెండేళ్ళు అరణ్యవాసము, ఒక యేడు అజ్ఞాతవాసము పూర్తిచేసి తమకు అర్ధరాజ్యం యివ్వవలసిందిగా కృష్ణుడిని ధృతరాష్ట్రుడి వద్దకు రాయబారం పంపిస్తారు. కృష్ణుని సంధియత్నం విఫలమై యుద్ధం అనివార్యమవుతుంది. యుద్ధరంగంలో కౌరవ, పాండవులు భీకరయుద్ధానికి తలపడతారు. శిఖండిని అడ్డు పెట్టుకొని అర్జునుడు భీష్ముడిని నేలకూలుస్తాడు. పద్మవ్యూహంలో అభిమన్యుడి మరణానికి కారకుడైన సైంధవుడ్ని పార్థుడు సంహరిస్తాడు. ద్రోణుడు కూడా ప్రాణాలు వదులుతాడు. తండ్రి మరణవార్త విని అశ్వత్థామ ఉగ్రుడవుతాడు.

మధ్యలో నే నివారిస్తున్నాడు.

కృష్ణుడు కంగారుపడి "ఏమిటిది? ఎందుకిలా జరుగుతోంది? నిన్నుఎదిరించి కర్ణుడు నిలబడటమా! అసలు నీ తెలివంతా ఏమైంది?" అన్నాడు అర్జునుడితో కావాలనే కొంచెం కోపంగా, అతను మాట్లాడలేదు

కృష్ణుణ్ణి చూస్తున్న అర్జునుడికి బావ మొహంలో దిగులు, ఆందోళన కొట్టొచ్చినట్టు కనిపించాయి వెంటనే అర్జునుడు బాణాలతో భూమికీ ఆకాశానికీ మధ్య వున్న ప్రదేశమంతా కప్పేశాడు ఆ చీకట్లో నిలబడలేక కౌరవ సైనికులు పారిపోయారు

దుర్యోధనుడు వ్యాకుల పడ్డాడు

కర్ణుడు చప్పున సర్పముఖ బాణం తీసి అర్జునుడి కంఠానికి గురిపెట్టాడు

మంటలు కక్కుతూ వస్తున్న ఆ అస్త్రాన్ని చూసి తన రథాన్ని అయిదంగుళాలు భూమిలోకి దిగబడేటట్టు అదిమాడు కృష్ణుడు. సర్పముఖ బాణం వచ్చి అర్జునుడి కిరీటాన్ని ఎగరేసుకు పోయింది అంతకు మించి ఏం కాలేదతనికి

నిజానికి ఆ అస్త్రం అర్జునుణ్ణి చంపక పోవడం కర్ణుడికి ఆశ్చర్యం కలిగించింది అతను మళ్ళీ ఏ బాణం వెయ్యాలో ఆలోచించుకునే లోపల అర్జునుడి బాణాలు వచ్చి పాముల్లా కరిచేస్తున్నాయి అప్పటికే కర్ణుడి రథచక్రం కుంగిపోయి రథం ఒరిగి పోయింది

హోమధేనువు దూడను శల్యంతో చంపిన పాపం వూరకే పోలేదనుకున్నాడు

ఈ విపత్కర పరిస్థితి నుంచి తప్పించు కోవడమెలా?

అతనికి తోచకుండా వుంది.

మెదడంతా మొద్దుబారినట్టయింది.

కాసేపు ఆలోచించి విష సర్పం వంటి ఒక బాణం తీసి రౌద్రమంత్ర సహితంగా సంధించాడు

ఆ దెబ్బతో అర్జునుడు నేల కూలుతాడనే అనుకున్నాడు కాని ఇంతలో నేలలోకి సగం దిగబడిన రథ చక్రం పూర్తిగా దిగబడి పోయింది

నిలబడడానికి వీల్లేకుండా తిరగ బడుతోంది

కర్ణుడికి కళ్ళ నీళ్ళు వచ్చాయి.

విధి ఎంత చిత్ర మైంది!

ఎవరికి ఏ క్షణం ఆనందమో – ఏ క్షణం విషాదమో తెలీదు.

ఎంత గొప్ప మానవ ప్రయత్నాన్నయినా చిటికలో తలక్రిందులు చేసి తమాషాగా నవ్వ గలదు






ప్రతీకారం చెయ్యలేని నిస్సహాయ స్థితిలో వున్నప్పుడు మనిషి గుండెల్ని దహించే బాధ అది అనుభవించే వాళ్ళకు తప్ప తెలీదు

పాపం కర్ణుడు చేసేదేం లేక రథం దిగి కింద నిలబడ్డాడు బాణాలు నాలుగు వైపుల నుంచీ వచ్చి సూదుల్లా గుచ్చుకున్నాయి

అసలు అలా జరుగుతుందని అతను వూహించనే లేదు స్థాణు వయ్యాడు

ఎదురుగా పాండవ వీరులు తనను పరిహసిస్తున్నట్టనిపించింది

గొంతు పెగుల్చుకుని 'అర్జునా' రథ చక్రం భూమిలో కూరుకు పోయింది దాన్ని ఎత్తే దాకా మీ వాళ్ళ నెవరినీ బాణాలు వెయ్యొద్దని చెప్పు నేను నేల మీద వున్నాను మీరు రథాల మీద వున్నారు రణ నీతి తెల్సిన వాళ్ళెవరూ అదర్మంగా ప్రవర్తించరు' అన్నాడు

'ఎవరిది అధర్మం? తల్లీ బిడ్డలు నిద్రపోతుంటే లక్క ఇల్లు కాల్పించడం అధర్మం కాదా?మాయలూ మోసాలతో ఎదుటి వాళ్ళ సంపదను కాజేయడం అన్యాయం కాదా? పసి వాడన్న కనికరమైనా లేకుండా ఒక్కణ్ణి పది మంది చంపడం రాక్షసత్వం కాదా?' అన్నాడు కృష్ణుడు

అర్జునుడు కర్ణుడి జెండా కూల్చాడు

అది చూసి కౌరవులంతా నిరాశ పడి పోయారు

కర్ణుడు ఒక పక్క పాండవుల బాణాలను ఓర్చుకుంటూనే, మరో ప్రక్క రథం కిందికి భుజాన్ని పోనిచ్చి బలమంతా కూడ దీసుకుని చక్రం పైకెత్త బోయాడు రథ చక్రం పైకి లేవడానికి బదులు పర్వత, అరణ్య, సముద్ర సహితంగా భూమి ఆరంగుళాలు పైకి లేచింది

కర్ణుడి మొహంలో సంతోషం ప్రతిబింబించింది

కౌరవ సేన హర్షధ్వానాలు చేసింది

కర్ణుడు రథమెక్కి యుద్ధానికి సిద్ధమయ్యాడు

సరిగ్గా అదే సమయంలో మళ్ళీ రథ చక్రం నేలలో కూరుకు పోయింది

## ద్రౌపది



కర్ణుడి చేతివేళ్ళు అస్త్రం సంధించ బోతూ ఆగిపోయాయి అప్పటికే అర్జునుడు అంజలికమనే బాణాన్ని వేశాడు

భూమినీ ఆకాశాన్నీ తన మెరుపులతో కప్పుతూ వస్తున్న ఆ అస్త్రాన్ని చూసి కర్ణుడు విషాదంగా నవ్వుకున్నాడు నవ్వుకుంటూ మనసులో అనుకున్నాడు–

దుర్జనులతో సహవాసం ఎప్పటికైనా ముప్పే. మనిషి వక్రంగా వుండొచ్చేమో కాని మనసు వక్రంగా వుండ కూడదు.

చెరగున వున్న నిప్పు మనసులోని ఈర్ష్య మనిషిని దహించక మానవు.

దురభి మానం గర్వం మనిషిని అధఃపాతాళానికి తోసేస్తాయి

నేను మూర్ఖుణ్ణి

నేను దుర్మార్గుణ్ణి

నేను విధి వంచితుణ్ణి

నేను

నే.

ను .

మనసులోని మాట పూర్తి కాకుండానే అతని తల తెగి కింద పడింది.

ఉజ్వలమైన తేజస్సు అతని శరీరం నుంచి పైకి లేచి వెళ్ళి సూర్యుడిలో కలిసి పోయింది.

* * * * * *

కర్ణుడు పోయాక దుర్యోధనుడు రెక్కలు తెగిన పక్షి అయ్యాడు అతన్ని చూస్తున్న కొద్దీ జాలేసింది కృపాచార్యుడికి దగ్గరగా వెళ్ళి భుజం మీద చెయ్యి వేసి 'క్షత్రియులకు యుద్ధం చెయ్యడం ధర్మమే' అయినా నేనొక మాట చెబుతాను విను భీష్మ ద్రోణ కర్ణులంతటి వాళ్ళను కూడా జయించి, ఇప్పటికీ పాండవులు చెక్కు చెదరకుండా వున్నారంటే వాళ్ళకు అస్త్ర బలంతో పాటు దైవ బలం కూడా వుందన్న మాట మనలో బల విక్రములైన వీరులంతా వెళ్ళిపోయారు ఇంక ఈ మిగిలిన కురు సైన్యాన్ని అవలీలగా జయిస్తాడు అర్జునుడు. ' అని ఇంకా ఏదో చెప్పబోతుండగా

'మీరు మాకు ఇంకేం చెప్పొద్దు' అని విసురుగా అన్నాడు దుర్యోధనుడు

అతనిలో అందరి మీద కసి, రోషం, ద్వేషం చోటు చేసుకున్నాయి

కృపా చార్యుడికి అతని పరిస్థితి అర్థమైంది నమ్రతగా మళ్ళీ దుర్యోధనుణ్ణి పలకరించి 'భీముడు దుశ్శాసనుణ్ణి చంపి ఒక ప్రతిజ్ఞ తీర్చుకున్నాడు రెండోది కూడా ఎక్కడ తీర్చు కుంటాడో నని భయపడుతున్నాను అదే జరిగితే నీ పరిస్థితి ఎంత అధ్వాన్నంగా వుంటుందో ఆలోచించు ప్రతి మనిషీ తనకు అన్నీ కావాలను కుంటాడు. కాని తనే పోయాక ఏం వచ్చి మాత్రం లాభం? ముందు నిన్ను నువ్వు రక్షించుకో' అన్నాడు

'అంటే ఏమిటి మీ ఉద్దేశ్యం?'

'మనకు బలం ఎక్కువగా వుంటే యుద్ధం చెయ్యాలి. శత్రువులకు బలం ఎక్కువగా వుంటే సంధి చేసుకోవాలి'

అంతా విని దుర్యోధనుడు మౌనంగా అక్కడి నుంచి కదిలి వెళ్ళిపోయాడు.

అతని వెనకే అతని పరివారమూ వెళ్ళింది

అంతా సరస్వతీ తీరానికి చేరుకున్నారు

చేసేది లేక కృపాచార్యుడు కూడా వాళ్ళతోనే వెళ్ళాడు.

* * * * * *

మరునాడు శల్యుడి సారధ్యంలో కౌరవ సేన యుద్ధానికి బయలు దేరింది

శల్యుడు ధర్మరాజుతో తలపడ్డాడు.

చాలాసేపు మత్తేభాల్లా, సింహాల్లా పోరాడు కున్నారిద్దరూ

చివరికి ధర్మరాజు ప్రయోగించిన శక్తి ఆయుధంతో శల్యుడు రక్తం కక్కుతూ చేతులు రెండూ చాచి బోర్లా నేల మీద పడి ప్రాణాలు విడిచాడు

రక్తం అంతా మొహంలోకి చిమ్మినట్టూ– ఉవ్వెత్తున ఎగిసిపడే సముద్ర కెరటం ఒక్కసారి

వచ్చి మొహం మీద కొట్టినట్టూ దుర్యోధనుడు అప్రతిభు డయ్యాడు.

మాటలు రాని వాడిలా చుట్టూ చూశాడు

వున్న కొద్ది పాటి సైన్యం పారిపోతోంది

అతనికి తెలుసు తను ఓటమి చివరి అంచున వున్నాడని

అయినా సరే!

'ఆగండి! చావు ఎలాగో తప్పనప్పుడు పిరికి పందల్లా పారిపోవడ మెందుకు? సాహసించి పోరాడితే వీర స్వర్గమన్నా లభిస్తుంది' అన్నాడు.

పద్దెనిమిది రోజుల పాటు సాగిన యుద్ధానికి అతను వందన సమర్పణ చేస్తున్న వాడిలా వున్నాడు.

అతని మొహం చూసి కొందరు నిలిచి పోయారు.

మళ్ళీ విల్లంబులూ, బాణాలూ అందుకున్నారు.

దాంతో భీముడు రెచ్చిపోయి భూమ్యాకాశాలు అదిరేలా పెద్దగా అరిచి ముందుకు ఉరికాడు. అతన్ని ఎదిరించిన ధృతరాష్ట్ర కుమారు లందరూ హతులయ్యారు. నూరుగురు కొడుకులకు గాను దుర్యోధనుడూ, సుదర్శనుడూ మాత్రమే మిగిలారు.

త్రిగర్త రాజు సుశర్మ అర్జునుడి చేతిలో ప్రాణాలు పోగొట్టు కున్నాడు. శకుని కొడుకు ఉలూకుణ్ణి సహదేవుడు చంపి ఆ శవాన్ని బుజాన వేసుకునే మిగిలిన వాళ్ళతో యుద్ధానికి దిగాడు....

శకుని సహించ లేక పోయాడది.

రణ భూమిలో పిచ్చి వాడిలా వెర్రికేకలు వేశాడు.



'సహదేవుణ్ణి చంపండి. పొడవండి. నా కొడుకును పొట్టన పెట్టుకున్న వాణ్ణి నిలువునా నరకండి. ఏనుగుల చేత తొక్కించండి. ఏదైనా చెయ్యండి. వాడు మాత్రం బ్రతికుండ డానికి వీల్లేదు' అన్నాడు.

కాని, అతన్నెవరూ పట్టించుకున్న వాళ్ళులేరు

ఎవరికి వాళ్ళు ప్రాణ భయంతో వున్నారు.

చేసేది లేక శకునే సహదేవుడితో తలపడ్డాడు.

కాసేపటికే అలుపొచ్చింది.

'మామా' పాచిక లాడడం– కుట్రలూ, కుతంత్రాలతో పక్క వాళ్ళ సొమ్ము లాగేసు కోవడం గొప్పకాదు. అయినా మోసాలు చేసి ఎన్నాళ్ళు బ్రతుకుతావ్? నీ పాలిటి యముణ్ణి నేను. మమ్మల్ని పరిహసించిన వాళ్ళల్లో నువ్వూ, దుర్యోధనుడే మిగిలారు. ముందరే నీ మరణం. నీ ప్రియమైన మేనల్లుడు చూస్తుండగానే నీ తల తాటి పండులా ఎగర గొడతాను' అని సహదేవుడు వాన చినుకుల్లా బాణాలు కురిపించాడు.

శకుని ఒళ్ళు తూట్లు పడి పోయాయి.

తల ఎగిరి అల్లంత దూరాన పడింది.

కృష్ణుడు మందహాసం చేశాడు.

పాండవ వీరులు సింహ నాదాలు చేశారు.

దుర్యోధనుడి మొహం తెల్లగా పాలి పోయింది.

చూస్తున్నది కలో నిజమో అర్థం కావడం లేదు యుద్ధ భూమి అంతా జయ జయ నాదాలతో, హాహాకారాలతో గందరగోళంగా వున్న సమయంలో దుర్యోధనుడు రెండవ కంటికి తెలియకుండా పలాయనం చిత్తగించాడు.

(ఇంకా వుంది)

# అమెరికాలో తెలుగుయువత!

ప్రస్తుతం అమెరికాలో ఉన్న తెలుగు వారిలో 15 నుండి 20 సంవత్సరాల వయస్సులో వున్న యువతీ యువకులు అమెరికాలోని తెలుగు వారిలో మొదటి తరానికి చెందినవారు. వీరిపై తల్లిదండ్రుల ద్వారా తెలుగు సంస్కృతీ-సంప్రదాయాల ప్రభావం, బయట అమెరికన్ సభ్యతా-సంస్కారాల ప్రభావం సమానంగా పడుతున్నాయి. ఈ రెంటికీ మధ్య వారవలంబించవలసివస్తున్న ద్వంద్వ ప్రమాణాల మధ్య వారు కొంత వత్తిడికి గురవుతున్న విషయం కొంత యధార్థమే అయినప్పటికీ, దైనందిన జీవితంలో వీరు ఎక్కువగా తెలుగు కుటుంబాలతోనే సంచరించటం వలన, తమలో తామే ఒక బృందంగా ఉండటం వలన, ఈ ఒత్తిడి అంతగా పైకి కనబడటంలేదు. తెలుగు సంస్కృతి-సంప్రదాయాల పట్ల భారతదేశం పట్ల, భారతదేశం తిరిగిరావటం పట్ల కొందరు అమెరికన్ తెలుగు యువత తమ తమ అభిప్రాయాలను వెల్లడించారు

## గండికోట అనిత

కుమారి గండికోట అనిత విజయనగరానికి చెందిన ప్రముఖ కవి గండికోట బాబూరావు గారి మనుమరాలు. తండ్రి గండికోట వెంకట్రావు సెయింట్ లూయిస్ యూనివర్శిటీలో మెట్రియాలజీ విభాగంలో ఆచార్యులు. తల్లి విద్య సెయింట్ లూయిస్ తెలుగు సంఘానికి కోశాధికారి. అనిత చదువులోనే కాక, ఆటల్లో కూడా మంచి ప్రవీణురాలు, టెన్నిస్, ఫుట్‌బాల్ మొదలగు ఆటల్లో, చదువులో ఎన్నో విశిష్టమైన బహుమతులు పొందింది. అత్యంత ప్రతిష్ఠాత్మకమైన అమెరికన్ ప్రెసిడెంటు బంగారుపతకం ఈమెకు లభించింది.

భారతదేశం పట్ల తనకున్న పరిజ్ఞానం చాలా తక్కువని, అయితే తన తల్లిదండ్రుల ద్వారానూ, పుస్తకాల ద్వారానూ తనకు తానుగా తెలుసుకున్న దానిని బట్టి భారతదేశం చాలా గౌరవనీయ చరిత్ర గలిగిన దేశమని, తమ తల్లిదండ్రుల మాతృదేశంగా ఆ దేశం పట్ల తనకు ఎంతో గౌరవం ఉన్నదని అనిత చెప్పింది. అయితే తనకు భారతదేశం తిరిగి రావాలని లేదని కారణం అమెరికాలో వున్న విద్యావకాశాలు దైనందిన జీవితంలోని సౌకర్యాలు భారతదేశంలో లేకపోవటమేనని, ఆమె అన్నారు.

అమెరికన్ యువత మీ పట్ల భారతీయులనే విషక్షచూపుతున్నారా అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ ఖచ్చితంగా లేదని, అయినా అది వారి పట్ల మన ప్రవర్తనపైన ఆధారపడి ఉంటుందని చెప్పింది.

తల్లిదండ్రులు తనకు తగినంత స్వేచ్ఛనిస్తారని, అయితే తన మంచి చెడుల పట్ల, భద్రత పట్ల ఎంతో జాగ్రత్త తీసుకుంటారని ఒక ప్రశ్నకు సమాధానంగా అనిత చెప్పింది.

గండికోట అనిత



## పురుగుళ్ళ విజయప్రతాప్

12వ తరగతి చదువుతున్న పురుగుళ్ళ విజయప్రతాప్ జార్జియా రాష్ట్రంలోని అట్లాంటా నగరంలో నివసిస్తున్నాడు. తండ్రి పురుగుళ్ళ హరి అట్లాంటాలో పెద్ద



పురుగుళ్ల విజయ ప్రతాప్

హోటల్ యజమాని, విజయ ప్రతాప్ చిన్నతనం నుండే ఎన్నో బహుమతులు, గౌరవాలు పొందాడు అత్యంత ప్రతిభావంతులైన విద్యార్థులు ఎన్నికయ్యే జార్జియా రాష్ట్రపు 'బీటా క్లబ్'కు విజయ ప్రతాప్ ప్రస్తుతం అధ్యక్షుడుగా ఉన్నారు ఎమరీ విశ్వ విద్యాలయంలో మెడిసన్ చదువుతానంటున్నాడు విజయ ప్రతాప్

భారతదేశం అభివృద్ధి చెందటానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయని, నాయకత్వ లక్షణాలు, ఎన్నో దేశాలకు మార్గ దర్శకత్వం వహించగల సత్తా భారతదేశానికి కలదని, భారతదేశం పట్ల విజయప్రతాప్ తన అభిప్రాయం వెల్లడించాడు

భారతదేశం తిరిగి రావాలని ఉన్నదా అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ, నిజాయితీగా చెప్పాలంటే తనకు ఆ ఆలోచనేలేదని, అమెరికాలోనే పుట్టి పెరగటం వలన తాను ఇంతకాలం తర్వాత భారతదేశం తిరిగి వచ్చినా 'ఎడ్జెస్టు' కాలేనని చెప్పాడు భారతీయ భాషలలో అంతగా పరిజ్ఞానం లేకపోవటం వలన కూడా అది సాధ్యం కాదని తాను భావిస్తున్నానని చెప్పాడు

దృఢ దీక్ష, కష్టించి పని చేసే తత్వాలను మనం అమెరికన్ల నుండి నేర్చుకోవా

లని, అంతేకాకుండా భిన్నాభిప్రాయాలు కలిగి ఉన్నప్పటికీ అమెరికన్లు కలిసిమెలసి ఉండటానికి ఎక్కువ ప్రయత్నం చేస్తారని, వారి నుండి భారతీయులు నేర్చుకోవలసిన ప్రధానమైన అంశమిదని విజయప్రతాప్ చెప్పారు

## మంతెన కృష్ణ

కృష్ణ మిసోరి రాష్ట్రంలోని సెయింట్ లూయీస్‌లో ఉంటాడు కృష్ణ తండ్రి



మంతెన కృష్ణ

డా.మంతెన నరసరాజు ప్రస్తుతం ఉత్తర అమెరికా తెలుగు సంఘం కార్యదర్శిగా ఉన్నారు. కృష్ణకు చిన్నతనం నుండి సాంఘిక కార్యక్రమాలన్నా, ఇతరులకు సహాయం చేయడమన్నా చాలా సరదా ఇతరులకు సహకరించటంలో తన సమయం, చదువు దెబ్బతింటున్నా పట్టించుకోడని అతని మిత్రులు అంటూ ఉంటారు

భారత దేశమంటే తనకు చాలా ఇష్టమని, భారతదేశం తిరిగి వచ్చి స్థిరపడాలనే కోరిక ఉందని చెపుతూ భారతదేశంలోని బంధువుల, స్నేహితుల ఆప్యాయత, ప్రేమ అమెరికాలో లభించవని కృష్ణ చెప్పాడు బాపట్ల తాలూకాలోని అలకాపురంలో ఉండే తన తాతగారు మంతెన కృష్ణంరాజు గారి ప్రభావం తన మీద ఎంతో ఉందని, ఆయన తనపట్ల చూపే ఆప్యాయతే తనను భారతదేశం వైపు లాగుతుందని, తాను ఎంత ఆధునికంగా పెరిగినా, తన వివాహం మాత్రం తన తాత గారి ఇష్టం మేరకే చేసుకుంటానని ఖచ్చితంగా చెప్పాడు తనకు భారతదేశంలోని కుల విభక్తతంటే అసహ్యమని, అనువంశీకంగా పేరు చివర వచ్చే రాజు శబ్దం తన పేరునలేదని సగర్వంగా చెప్పిన కృష్ణ తోటి అమెరికన్ యువత తమను సమానంగానే చూస్తారని అభిప్రాయం వ్యక్తం చేసాడు




వింతా సంధ్య

సంధ్య టెక్సాస్ రాష్ట్రంలోని హూస్టన్ నగరంలో ఉంటుంది సంధ్య తండ్రి డా జనార్ధనరెడ్డి ఉత్తర అమెరికా తెలుగు సంఘపు కార్యక్రమాలలో ప్రముఖంగా పాల్గొంటూ ఉంటారు ఆయన సప్తమ ఉత్తర అమెరికా తెలుగు సమ్మేళనం కన్వీనర్‌గా ఉన్నారు సంధ్య చిన్నతనం నుండి చదువులో ముందుండటమే కాక, భరత నాట్యం వంటి వాటి పట్ల మంచి అభిరుచి కలిగి ఉన్నది

భారతదేశం చాలా గొప్పదని, అయితే అమెరికన్లు చాలా మంది భారతదేశం పేదరికంలో మ్రగ్గుతున్నదనే అభిప్రాయంలో ఉన్నారని, అయితే భారతదేశంలోని ప్రజలు కొందరు అమెరికన్ల కంటె సుఖవంతమైన జీవనం సాగిస్తున్నారని, పారిశుద్ధ్యం విషయంలో తగినన్ని జాగ్రత్తలు తీసుకుంటే, నివశించటానికి భారతదేశం చాలా చక్కని ప్రదేశమని భారతదేశం పట్ల కుమారి సంధ్య తన అభిప్రాయం వ్యక్తం చేసింది

భారతదేశానికి తిరిగి రావాలని ఉందా? అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ విద్యాభ్యాసం పూర్తి చేసి భారతదేశానికి తిరిగి వెళ్ళి, పెళ్ళి చేసుకుని స్థిరపడాలన్నది తన కల, కోరిక అని సంధ్య ఎంతో ఆత్మవిశ్వాసంతో చెప్పింది

అమెరికన్ల నుండి భారతీయులు నేర్చుకోవలసిందేమైనా ఉన్నదా? అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ 'భావాల వ్యక్తీకరణ'లో అమెరికన్ల నుండి మనం నేర్చుకోవలసింది ఎంతైనా వున్నదని, కనీసం తల్లిదండ్రులతో కూడా భారతీయ యువతీ యువకులు తమ ప్రేమను వ్యక్తం చేయలేని స్థితిలో ఉన్నారు అన్నది కుమారి సంధ్య

అమెరికన్ యువతీ యువకులకు వారి తల్లి తండ్రులిచ్చిన స్వేచ్ఛ తమ తల్లి తండ్రులు తమకివ్వరని, ఇది తన ఒక్కదాని విషయమేకాదని, ఎక్కువ మంది భారతీయ యువత పరిస్థితి ఇంతేనని అంటూ, దీని వలన భారతీయ యువతకే ఎక్కువ మేలు జరుగుతున్నదని, తల్లిదండ్రులు క్రమశిక్షణలో ఉంచటం వలనే భారతీయ యువత, అమెరికన్ యువత కంటే అన్ని విషయాలలో అగ్రగాములుగా ఉంటున్నారని కుమారి సంధ్య అభిప్రాయపడింది

-డా.యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

# ప్రత్యూష • స్వరూప్ సిన్హా

'నేనెందుకిలా చేసాను?' అని పదేపదే అనుకున్నాను. ప్రదీప్ వెళ్లిపోయిన చాలాసేపటి వరకూ అలా కూచునే ఉండిపోయాను. అడపా దడపా లేచి కాస్త ఏదయినా పని కల్పించుకుందామని ప్రయత్నించాను.

కాసేపు స్టౌ వెలిగించి ఆర్పేయడం, చేతి కందిన పుస్తకాల పేజీలు అనాలోచితంగా తిరగెయ్యడం, రేడియో ఆన్ చేసి వెంటనే ఆఫ్ చెయ్యడం లాటి అర్థం లేని పనులు చేస్తూ చాలా సేపు గడిపాను. నా వైఖరి నాకే వింతగా తోచింది. మరి కాస్సేపు గడిచాక కాసిని మంచినీళ్లు తాగి కూచుంటే అలసట తీరినట్టనిపించింది. తల వెనక్కు వార్చి కళ్లు మూసుకుని, స్థిమితంగా ఆలోచించడానికి ప్రయత్నించసాగేను. గంట క్రితం ప్రదీప్‌కూ నాకూ జరిగిన సంభాషణ నా మస్తిష్కంలో మెదలసాగింది-



"మమ్మీ, నీతో ఓ విషయం మాట్లాడాలి"

"ఏమిటి బాబూ?"

"టీ", కలుపుతూ ప్రదీప్ వేపు చూసాను. సాలోచనగా ఎటో చూస్తూ కాసేపు మౌనంగా ఉన్నాడు. వాడు చెప్పబోయే విషయమేమిటో నేను ముందుగానే ఊహించాను. వినడానికి సిద్ధంగానే ఉన్నాను. "నాకుద్యోగం దొరికి దాదాపు సంవత్సరం కావస్తోంది. ప్రతిమకు పెళ్లి చేసెయ్యాలని వాళ్లింట్లో తొందరపడుతున్నారు. మనం ముందుగా అనుకున్న సంబంధమే కాబట్టి ప్రత్యేకించి వివరాలు నేన్నీకు చెప్పక్కర్లేదు" వాక్యం పూర్తి చేసి ఒక్క మారు నా ముఖంలోకి చూసి మళ్లీ తలదించుకున్నాడు.

"అయితే ప్రతిమ విషయంలో నీ నిర్ణయం మారదా బాబూ?" టీ కప్పు అందిస్తూ వాడి ముఖ కవళికల్ని చదవడానికి ప్రయత్నిస్తున్నాను.

"అన్నీ తెలిసిన దానివి, నువు కూడా అలా అడుగుతావేమిటి మమ్మీ? మొన్నటి వరకూ ప్రతిమని మనింట్లోని వ్యక్తిలా గౌరవించి ప్రేమించావు. ఇంతలో నీ వైఖరిలో ఈ మార్పేమిటి మమ్మీ?" ప్రదీప్ గొంతు వణకడం స్పష్టంగా వినిపిస్తోంది.

"నాలో ఈ మార్పెందుకొచ్చిందో నీకు తెలీదా బాబూ?" గుచ్చి గుచ్చి వాడి కళ్లల్లోకి చూసాను. పలుచటి నీటిపొర వాడి కళ్లను కప్పేయసాగింది.

"మమ్మీ, ప్లీజ్ మమ్మీ! ఆ సంగతి నాకు మళ్లీమళ్లీ గుర్తు చేయకు...." వాడి గొంతు గద్గదమైంది. బాధగా చేతితో కణతలు పట్టుకున్నాడు. కళ్లు నెమ్మదిగా అరుణిమను దాల్చసాగేయి. నాకనిపించింది, ఆ అర్ధరాత్రి ప్రతిమ కళ్లు కూడా యిలాగే ఎర్రబడుంటాయని?

ఆ అమ్మాయి ఒంట్లోని రక్తమంతా కళ్లల్లోకి చిమ్మి ఉంటుంది స్నేహితురాలి పెళ్లికి వెళ్లొస్తున్న ప్రతిమను ఆ దుండగులు బలవంతంగా నిర్జన ప్రదేశంలోకి ఎత్తుకెళ్లి, ఆ అందాల బొమ్మ జీవితాన్ని నిర్దాక్షిణ్యంగా నేలకేసిబద్దలు కొట్టినప్పుడు, ప్రతిమ ఒంట్లోని అణువణువూ ఆక్రోశించి ఉంటుంది మానం-ప్రాణం రక్షణ కోసం గొంతు చించుకుని అరిచి ఉంటాయి ఆ అమ్మాయి, ఆ క్షణాల్లో పడ్డ వేదన తలచుకుంటే నాకు ప్రదీప్ పడే ఆవేదన అంత ఎక్కువగా ఏమీ అనిపించలేదు

"సరే బాబూ! నా అంతట నేను గతించిన సంఘటన నీకు గర్తు చేసి మరింత బాధ పెట్టను కానీ, రేపు నువ్వు ప్రతిమను పెళ్లాడినా గతాన్ని అంత తేలిగ్గా మర్చిపోగలవా? ఒక వేళ నువ్వు మరచిపోవాలనుకున్నా ఈ సమాజం నిన్ను మర్చిపోనిస్తుందా? అంతవరకెందుకూ, ఇంత కాలమైనా ప్రతిమ అసలీ విషయాన్ని మరచిపోగలిగిందా?"

"మమ్మీ, నేనెవరి గురించి ఆలోచించదల్చుకోలేదు ఒక్క ప్రతిమను గురించి తప్ప? ప్రతిమను నేను అప్పుడూ, ఇప్పుడూ ఒకేలా ప్రేమిస్తున్నాను. ఆ సంఘటన జరిగాక, ఆత్మహత్య చేసుకోబోయి విఫలురాలై ప్రతిమ నాకేసి చూసిన ఆ బేల చూపులు నన్ను అనుక్షణం వెంటాడుతున్నాయి. "ఇక నా ముఖం నువ్వు చూడవు కదూ, ప్రదీప్ నేనింకా ఎందుకు బ్రతకాలి?"అంటూ నా ఒళ్లో తల దాచుకుని వెక్కి వెక్కి యేడిచిన నా ప్రతిమ ఏం తప్పు చేసింది మమ్మీ? ఇంటా బయటా ఆ అమ్మాయిని ఎందుకలా చిత్రవధ చేస్తున్నారు? ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్టు నిర్జీవపు చూపుల్తో గత్యంతరం లేక బ్రతుకుతూన్నట్టు బ్రతికే నా ప్రతిమ మళ్లీ మునుపటి ప్రతిమ కావాలి! జీవితం పట్ల ఆమెలో కొత్త ఆశలు చిగురించాలి. నేను ప్రతిమ కోసం ఈ తుచ్ఛసమాజాన్ని లెక్క చెయ్యదల్చుకోలేదు. ప్రతిమ నా మీదే ఆశలు పెట్టుకుంది మమ్మీ. తనకిప్పుడు నేను తప్ప మరెవరున్నారు గనుక! అయ్ లవ్ హర్, షి ఈజ్ స్టిల్ ఏన్ ఏంజెల్ మమ్మీ" ఆవేశంగా చెప్పుకుపోతున్న కొడుకును చూస్తే నాలో కించిత్ గర్వం కలిగింది!

"కానీ ఆవేశంలో పలికే మాటలు ఆచరణలో చాలా కష్టం ప్రదీప్! నువ్వు ఇంకా చిన్నవాడివి. అనుభవం లేనివాడివి కాబట్టి అలా అంటున్నావు. రేపు పెళ్లయ్యాక మీ యిద్దరి మధ్యనే కలతలు రావని ఏమిటి నమ్మకం? నా మాట విను. ఈ పెళ్లి జరగకపోవడమే మీ యిద్దరికీ శ్రేయస్కరం" నా గొంతు ఖచ్చితంగా ధ్వనించింది.



## చిన్న సీటు

ప్రధాన మంత్రి, రక్షణ మంత్రి కూడా అయిన శ్రీ వి.పి.సింగ్‌కు సమస్యలెదురవుతున్నాయట.

ఢిల్లీలోని దక్షిణ బ్లాకులో వున్న రక్షణ మంత్రిత్వ శాఖ కార్యాలయంలోని రక్షణ మంత్రి కుర్చీలో కూర్చునేప్పుడేట ఈ సమస్యలు. రక్షణ మంత్రి కుర్చీలో కూర్చోవటం ప్రధాన మంత్రికి తగదని అభిప్రాయపడుతున్నారట అధికారులు. ఫలితంగా ఆయన రక్షణ శాఖ అధికారులతో చర్చించేప్పుడు అక్కడి సోఫాలో కూర్చుంటున్నారు. వాస్తవానికి రక్షణ మంత్రిత్వ శాఖ వ్యవహారాలు నిర్వహించేందుకు ఈ కార్యాలయంలో కూర్చున్న మొట్టమొదటి ప్రధాన మంత్రి శ్రీ వి.పి. సింగ్ట.

కొత్త ప్రధాని ఢిల్లీలో వున్నప్పుడు రక్షణ మంత్రిత్వ శాఖ కార్యాలయంలో ఒక గంట గడుపుతారట. కాగా సోమవారంనాడు సైనికాధికారులతోను, మంగళవారం నౌకాదళాధికారులతోను, బుధవారం వైమానిక దళాధికారులతోను, గురువారం రక్షణ ఉత్పత్తి శాఖాధికారులతోను, శుక్రవారం రక్షణ పరిశోధన శాఖాధికారులతోను గడుపుతారట.

"లేదు మమ్మీ, నేను ప్రతిమను చేసుకుని తీరతాను. ఎవరో కొందరు రాక్షసుల ఘాతుకానికి బలయిపోయిన నా ప్రతిమ జీవచ్ఛవంలా బ్రతకనవసరం లేదు. ఆమెను భార్యగా స్వీకరించి అన్ని సుఖాలూ-సంతోషాలూ పొందేట్టు చేస్తాను. ప్రతిమ నా ప్రాణం మమ్మీ!" ప్రదీప్ కంఠం స్వచ్ఛంగా, దృఢంగా పలికింది.

"వద్దు ప్రదీప్, అది సాధ్యపడదు. నువ్విప్పుడు వల్లించే ఈ నీతులూ, ఆదర్శాలూ రేపు పెళ్లయ్యాక ఆవిరయిపోతాయి. ఈ పెళ్లి జరగడానికి వీల్లేదు. నా మాట విను ప్రతిమను మర్చిపో....." దాదాపుగా అరిచినట్టే ఉంది నా గొంతు.

"ఎంతగా మారిపోయావు మమ్మీ! చెయ్యని పాపానికి ప్రతిమను శిక్షించదల్చుకున్నావు. మా మేలు కోరికాదు! నీ కసలు ప్రతిమంటే ఇప్పుడు అందరిలాగానే అసహ్యం కదూ! నువ్వూ అందరి లాటి దానివే. ప్రతిమను సూటీ పోటి మాటల్తో హింసిస్తూన్న సాటి స్త్రీలలో ఒక దానివే! అందుకే అంటారు ఆడదానికి ఆడదే శత్రు......!"

"నోర్మూయ్!...." ప్రదీప్ మాట పూర్తి చెయ్యకముందే వాడి చెంప ఛెళ్లు మనిపించాను. వాడు మారుమాట్లాడలేదు. విప్పెరపోనూ లేదు! వాలకం చూస్తే తన నిర్ణయాన్ని ఏ మాత్రమూ మార్చుకునే వాడిలా అగుపించలేదు. ఆరునూరయినా తన పంతాన్నే నెగ్గించుకునే వాడిలా కనిపించాడు. అయితే వాడు తలొంచుకుని, చెంప తడుముకుంటూ నెమ్మదిగా అక్కణ్ణించి లేచి వెళ్లి పోయేటప్పుడు మాత్రం వాడి కళ్లల్లోంచి జారిపడ్డ కన్నీటి చుక్కలు నాకు స్పష్టంగా అగుపించాయి. నేనిక్కడే చాలా సేపు కూచుని ఉండిపోయాను. ప్రదీప్‌ను ఏనాడూ ఒక్క మాట కూడా అని యెరుగను. అలాటిది వాడి మీద చేయి చేసుకోవడం నాకే వింతగా అనిపించింది. వాడు వెళ్లిపోయాక చాలా సేపు అన్య మనస్కంగానే ఉండిపోయాను. ఏ పనీ చెయ్యలేకపోతున్నాను.

ప్రదీప్ తీసుకున్న నిర్ణయం సామాన్యులెవ్వరూ తీసుకోనిది. అలాటి నిర్ణయం తీసుకోడానికి ఎంతో సంస్కారం ఉండాలి. మీరెంతో ఉన్నతమైన వ్యక్తిత్వం ఉండాలి! కానీ..... నేనేమిటి ఇలా వాణ్ణి వ్యతిరేకిస్తున్నాను? సంఘానికి భయపడుతున్నానా? ఛఛ! మరి?

అలాగే కళ్లు మూసుకుని ఆలోచిస్తున్న నాకు గదిలో చీకట్లు అలుముకోవడం తెలీడం లేదు. లేచి లైటు వేసుకోవాలన్న ధ్యాస నాకు రావడం లేదు. ఆ చీకట్లోనే, ఎక్కడో జ్ఞాపకాల నల్లతెరల మరుగున పడిపోయిన కథొకటి నా కళ్లముందు కదలాడసాగింది-

ఆ రామాలయ ప్రాంగణంలో సుధ అనే అమ్మాయి కాబోయే భర్త రామూని అడుగుతూంది....

"రామూ, మన పెళ్లికి మనిద్దరి తల్లిదండ్రులూ ఇంతకు ముందు ఇష్టపడ్డారు కదా! ఇప్పుడు కూడా మా అమ్మా నాన్నా మన పెళ్లికి సుముఖంగానే ఉన్నారు. మరి, మీ అమ్మానాన్నా అలా అర్ధాంతరంగా మారిపోయి, ఈ పెళ్లి వద్దంటున్నారెందుకని?"

ఈ ప్రశ్న విన్నాక రామూ కాసేపు నీళ్లు నమిలాడు. ఒక్క మారు సుధకేసి చూసి ఆ తర్వాత చాలాసేపు నీళ్లు నమిలాడు.

"అదా.... అదీ..... అబ్బే.....ఏం లేదు" అన్నాడు ఎటో చూస్తూ.

"ఏం లేకపోవడం ఏమిటి? ఏదో ఉండే ఉంటుంది. మన మధ్య దాపరికం దేనికి? నాకు చెప్పకూడనిదా?" సుధ కళ్లల్లో అమాయకత్వం!

"ఒద్దు సుధా. చెపితే నువు బాధపడతావు. ఇంటికెళ్దాం పద" రామూ మాటల్లో చాకచక్యం!

"అదిగో చెప్పకుంటే నామీదొట్టే. ఇంకా ఆ రాములవారి మీద కూడా ఒట్టే."

"మరిచెప్పాక నువు బాధపడనని మాటియ్యి."

"సరే.... నేను బాధపడను. చెప్పు" అంది సుధ రాము చేతిలో చెయ్యేసి.

"మరే.... అప్పుడు నువు చాలా చిన్నదానివట. నీకు నాలుగయిదేళ్లకంటే ఎక్కువుండి ఉండవు. అంటే నీకు ఊహతెలియని వయసు. మీ కుటుంబానికి బాగా తెలిసిన తనెవరో... " సందిగ్ధంగా ఆపేశాడు రాము.

"చెప్పు రామూ... నాకు నిజం తెలియాలి." దృఢంగా అంది.

"వాడొక 'సైకో' అట! అది తెలీని మీ వాళ్లు వాడు సహజంగానే చిన్న పిల్లలంటే ఇష్టం ఉన్నవాడేమోననుకుని అప్పడప్పుడు మీ యింటికొస్తూ పోతూ విన్నాడిస్తూంటే ఏమీ అభ్యంతరపెట్టలేదట. అలాగే ఓ రోజు నిన్ను ఆడిస్తానని వాళ్లింటికి తీసుకెళ్లి నీ మీద

## ప్రత్యూష

అత్యాచారానికి పాల్పడ్డాడట! నీ ప్రాణాలెలాగో మీ వాళ్లు కాపాడుకోగలిగారట. మొన్న నెవరో ఈ సంగతి కాస్తా మా వాళ్ల చెవిని వేసారు."

బి.ఏ. చదువుకున్న సుధకు ఈ విషయం మీద అంతకంటే వివరణ అవసరం లేకపోయింది. ఆ క్షణం నుంచే తన చుట్టూ ఉండే వారు ఇలా అర్ధాంతరంగా ఎందుకు మారిపోయారో బోధపడసాగింది.

"మరి..... నీక్కూడా నేనంటే అసహ్యం వేస్తూందా రామూ?" సుధకే దుఃఖం రాలేదు. అలాగని నవ్వూ రాలేదు! ఈ విషయం విన్న తర్వాత ఆమె శరీరంలో ఏదో జుగుప్స చోటు చేసుకోసాగింది. ఎప్పుడో పసితనంలో తన పై జరిగిన అఘాయిత్యం. ఆ అఘాయిత్యం ఇప్పుడు రేపుతున్న అసహ్యం! ఆ అసహ్యం మనిషిలోని పశువుమీదో, సమాజం మీదో లేక తన మీద తనకేనో అంతుబట్టని స్థితి ఆమె మనసుది!

"అబ్బే, అదేం లేదు సుధా. నువంటే నాకెంత ప్రేమో నీకు తెలీదూ? అమ్మా నాన్నా ఇష్టపడటం లేదు. అంతే! అందుకనే నేన్నిన్ను చేసుకోకూడదని నిర్ణయించుకు

> ### భూతదయ
>
> ఒరేయ్...ఒరేయ్....
> చంపకురా
> అవి పావురాలు
> విశ్వశాంతి చిహ్నాలు!
> వద్దు....వద్దు...
> వేటాడకురా
> అవి లేళ్లు
> జీవహింస మహాపాపం!
> చాలు....చాలు...
> హింసించకురా
> అవి రామ చిలుకలు
> అహింసే మానవధర్మం!
> బాబ్బాబూ....
> బాధించకురా
> అవికోళ్లు
> జీవకారుణ్యం పాపనాశనం!
> అది కాద్సార్...
>
> వాడు తమ పదవికి అడ్డొస్తున్నాడు!
> అయితే
> తీసెయ్ వాడితల!
>
> - భగ్వాన్

న్నాను." చావు కబురు చాలా చల్లగా చెప్పాడు రాము. ఆ మర్నాడు ఊరెళ్లిపోయాడు ఉద్యోగంలో చేరడానికి. ఆ తరవాత ఊళ్లోని జనానికి వాళ్ల పెళ్లి జరగటంలేదని తెలిసిపోయింది. ఆరాలు తియ్యడం, కారణాలు తెలుసుకోవడం, వాటికి చిలవలూ పలవలూ అల్లెయ్యడం, ఆ తరవాత గుసగుసలూ ప్రచారాలూ వెంటవెంటనే జరిగిపోయాయి. వీటన్నిటి ఫలితాన్ని అనుభవించింది సుధ ఒక్కర్తే. చివరికి అమ్మా నాన్నా కూడా సుధ తెలిసి తెలిసీ 'ఆ' ఘోరమైన తప్పు చేసినట్టు ఆమె ఎదురుపడగానే ఈసడించుకునే వారు. స్నేహితురాళ్లు క్రమంగా ఒక్కొక్కరే ఆమె జీవితంలోంచి తప్పుకున్నారు, 'అలాటి' అమ్మాయి స్నేహితులమని చెప్పకుంటే తమకెక్కడ పెళ్లిళ్లు కాకుండా పోతాయోనని! అలా తన చుట్టూ ఉండే వారి వైఖరి సుధలో తానేదో తప్పు చేసిందన్న భావనను కలిగించింది. 'నీలో ఏ పాపం లేదు, ఒక నికృష్టుడు చేసిన ఘాతుకానికి అన్నెం పున్నెం ఎరుగని నువ్వు బాధపడనవసరం లేదు' అని ఒక్కరు కూడా, చివరికి కన్నతల్లి కూడా ఆమెతో అనలేదు. అలా కొన్నాళ్లు జీవచ్ఛవంలా బ్రతుకీడ్చింది సుధ.

ఓ రోజు ఓ పెళ్లికొడుక్కి సుధ తండ్రి ఇస్తానన్న కట్నం నచ్చింది. తరవాత సుధ నచ్చింది కానీ సుధ మోసుకు తిరిగే కళంకం నచ్చలేదు. అయితే కట్నాన్నీ, లాంఛనాల్నీ రెట్టింపు చేస్తే సు ధ మెళ్లో తాళి కట్టడానికి తనకేం అభ్యంతరం లేదన్నాడు. కేవలం వాటి కోసమే సుధను పెళ్లాడి పదిమంది దృష్టిలోనూ ఆదర్శ పురుషుడైపోయాడు సదరు పెళ్లికొడుకు. జీవితంలో పెళ్లే కాదనుకున్న సుధకు అది కాస్తా అయిందనిపించి చేతులు దులిపేసుకున్నారు ఆమె తల్లిదండ్రులు.

కళాధర్ పేరుకు తగ్గట్టుగానే 'కళాపోషణ' ముమ్మరంగా జరిపేవాడు. ప్రస్తుత సమాజంలో తాగుడు, జూదం, వ్యభిచారం గొప్ప కళలని అతని అమూల్యాభిప్రాయం. ఆ అభిప్రాయం తప్పు అని ఎవరేనా అంటే అత నొప్పుకునే వాడు కాదు. సుధ అన్నప్పుడు అసలొప్పుకోలేదు. అలా అన్నప్పుడల్లా ఆమె ఒళ్లు హూనమయ్యేది.

"నా తిరుగుళ్లకెదురు చెప్పకూడదనే నీలాటి చెడిపోయిందాన్ని కట్టుకున్నానే దరిద్రురాలా! నా ముందర పతివ్రత పోజులు పెట్టకు. నేన్నా యిష్టమొచ్చినట్టు బతుకుతాను. నచ్చకుంటే ఈ క్షణమే బయటికి నడు. ఇంతకంటే మంచి బతుకు నువ్వెలా బతుకుతావో చూస్తాను."

రోజూ రాత్రి తిట్లూ, తన్నులతో పాటు అతనిచ్చే ఉపన్యాసాల సారాంశం ఇది.

## సుహాసినికి హిందీ అల్లర్జీ



సుహాసినికి శ్రీదేవి, జయప్రదల మాదిరి హిందీ చిత్రాల అవకాశం రావటం లేదు. అవకాశం రాకపోవటం కాదు సుహాసినికే ఆ చిత్రాల్లో నటించడం యిష్టం లేదుట.

ఆమె ప్రతిభకు గుర్తింపుగా ఉత్తమ నటిగా జాతీయ అవార్డు కూడా బహూకరింపబడిన సుహాసిని మహిళల సమస్యలపై మద్రాసు దూరదర్శన్ కోసం ఒక సీరియల్‌ను నిర్మిస్తున్నారట. హిందీ చిత్రాల్లో ఎందుకు నటించడం లేదన్న ప్రశ్నకు హిందీ చిత్రాలలో నటించే బదులు ఒక మళయాళ చిత్రంలో డబ్బు తీసుకోకుండా ఫ్రీగా నటించడం ఉత్తమం అంటోంది సుహాసిని. హిందీ చిత్రరంగానికి పోవాలని ఎంతో మంది ఉబలాట పడుతుండగా మరి సుహాసినికి ఆ చిత్ర రంగమంటే ఎందుకు అంత అయిష్టం?

'పసివయసులో ఓ పశువుకంటే హీనుడికి బలైతే అది చెడిపోవడం ఎలా అవుతుంది? 'రోజూ పశువులా తిరుగుళ్లు తిరిగే నువ్వు చెడిపోయిన వాడివి కాదా?' అని సుధ అడగలేదు. సుధే కాదు. ఆమె స్థానంలో ఉంటే ఏ స్త్రీ కూడా అలాటి ప్రశ్నలడగదు. అడిగితే ఆమె బతుకు బజారున పడుతుంది. అందుకే, ఎన్నిసార్లో నిలదీసి అడుగుదామనుకున్న ప్రశ్నలన్నింటినీ దిగమింగుకుని మౌనంగా ఉండిపోయేది. ఆమెలో నిరాశ స్థానంలో ఏదో కసి, మరేదో ద్వేషం పెరిగిపోయాయి. 'తనెందుకు చావాలి? తనేం తప్పు చేసిందని ఈ సమాజానికి భయపడాలి?' ఆమె తన మనసును నెమ్మదిగా పుస్తకాల పైకి మళ్లించింది. భర్త హేళనల మధ్యనే ప్రయివేటుగా పరీక్షలకు కట్టి ఎమ్.ఏ. పాసయింది. ఆమెకు తోడుకోసం అన్నట్టు ఓ బాబు పుట్టేడు. సుధలో కొత్త ఆశలు చిగురించాయి!

బాబుతోడిదే లోకమయ్యింది సుధకు. కళాధర్ ఒక్కమారైనా ఆ పసికందును తాకిన పాపాన పోలేదు. సుధ కూడా భర్తపట్ల ఓ విధమైన నిర్లిప్తత నలవర్చుకుంది. బాబు పెంపకంలో తన కష్టాలన్నింటినీ మరచిపోవడం అలవాటు చేసుకుంది. పేపర్లలో వచ్చే ఉద్యోగ ప్రకటనలన్నింటికీ అప్లై చేసింది. త్వరలోనే ఓ ప్రయివేట్ ఫర్మ్‌లో ఉద్యోగం వచ్చింది. అయితే కళాధర్ మాత్రం సుధ ఉద్యోగం చెయ్యడానికి ససేమిరా వీల్లేదన్నాడు. సుధలో మొండిధైర్యం చెలియలికట్టను దాటేసింది. తప్పేమిటని వాదించింది. తప్పు కాకుంటే తనతో తెగతెంపులు చేసుకోమన్నాడు. ఆ రాత్రంతా ఆలోచించింది సుధ. 'నీ కోసం నీ బాబుకోసం హాయిగా, స్వతంత్రంగా కొత్త జీవితాన్ని గడుపుదువుగానీ రా....!' అంటూ భవిష్యత్తు ఆమెను చేతులెత్తి పదేపదే ఆహ్వానించింది. తెలతెలవారుతుండగా ఉద్యోగంలో చేరడానికి బాబుతో సహా విశాఖపట్నం వెళ్లిపోయింది సుధ. ఆమె వెనకాలే విడాకులకోసం లాయరు నోటీసు కూడా వెళ్లింది! నిర్వికారంగా కళాధర్‌కు విడాకులిచ్చేసింది సుధ. 'పెళ్లి' అనేది ఆమె జీవితంలో ఓ పీడకలగా వచ్చినట్టే వచ్చి కరిగిపోయింది. అందుకామె బాధ పడ్లేదు. ఓ పెద్ద భారాన్ని దింపుకున్నట్టు హాయిగా ఊపిరి పీల్చుకుంది.

విశాఖలో స్థిరపడ్డ కొన్నాళ్లకే రాము ఆమెకు తారసపడ్డాడు. సుధకు జరిగిన అన్యాయానికెంతో విచారాన్ని వెలిబుచ్చాడు. రాముని చూస్తుంటే తనకంటూ ఉండే ఒక్కగానొక్క ఆప్తుణ్ణే చూసినట్టనిపించింది. తన బాధలన్నీ అతనితో చెప్పుకున్నాక కొంత భారం తీరినట్టనిపించింది. బాబుని ఒళ్లో కూచో బెట్టుకుని చెప్పాడు రాము 'నాతో వచ్చెయ్యి సుధా, నేను చాలా సంపాదించాను. బాబు బాధ్యత కూడా నేనే తీసుకుంటాను. మనం సుఖంగా ఉండొచ్చు.....'

"అదేమిటి రామూ, నువ్వింకా పెళ్లి చేసుకోలేదా?" అంది సుధ ఆశ్చర్యంగా.

"పెళ్లి....... చేసుకున్నాననుకో! కానీ నిన్నిలా నీ ఖర్మకు వదిలెయ్యడానికి మనసొప్పడం లేదు. నా భార్యకు తెలియనివ్వను. చిన్న 'ఎడ్జస్ట్‌మెంట్' అంతే!" చిరునవ్వుతో చెప్పాడు. విభ్రాంతిగా చూసింది సుధ.

"ఏమిటీ....? నన్ను చేసుకోడానికి తల్లిదండ్రులకి భయపడి పారిపోయిన నువ్వు, నీ భార్యతో పాటు నన్నూ ఏలుకుంటావా? అదీ, నేను 'ఎడ్జస్ట్' అవ్వాలా నీ ఉంపుడుకత్తెగా? యూ రాస్కెల్.... కళాధర్ లాంటి వాళ్లను నేను పశువులుగా చీదరించుకున్నాను. కానీ నువ్వు.... మనిషి తోలు కప్పుకు తిరిగే పశువ్వు.... ఛీ.....!"

"అలా ఆవేశపడకు. కాస్త స్థిమితంగా ఆలోచించు. పెద్దయ్యాక బాబు నాన్నెవరని అడగడా? ఈ సంఘం బాబుకు తండ్రి ఎవరని అడగదా?" ఎదురు ప్రశ్న వేసాడు రాము.

"మిస్టర్ రామచంద్రమూర్తీ, అనవసరంగా నా మీద నీ సానుభూతిని వేస్ట్ చెయ్యకు. బాబు తండ్రి చచ్చాడనే అందరితోనూ చెపుతున్నాను. వీడు నాకూ నా భర్తకూ ప్రేమ చిహ్నం కాదు. కేవలం నా భర్త కామానికి రూపం. వాడు నన్నర్థం చేసుకునే వయసుకెదిగాక నా కథ నేనే చెపుతాను. నేను చేసింది మంచో చెడో నిర్ణయించాల్సింది, ఆ అధికారం ఉంది నా కొడుక్కే తప్ప మరెవరికీ కాదు. నీ ఔదార్యానికి థాంక్స్! దయచేసి ఇక్కణ్ణించి వెళ్లిపో...." రానురాను సుధ కంఠం తీవ్రమయింది. రాము భుజాలెగరేసి వెళ్లిపోయాడు 'నీ ఖర్మ' అన్నట్టు.

"మమ్మీ అతనెవరు మమ్మీ? నువ్వెందుకలా తిడుతు న్నావు?" సుధ ముఖాన్ని తన చిట్టి చేతుల్లో పట్టుకుని ప్రశ్నిస్తున్న చిన్నారి ప్రదీప్‌ను "ఏం లేదులే నాన్నా, నీకు బువ్వ పెడతాను పద....." అని మరిపిస్తూ ఎత్తుకుని లోనికి నడిచింది.

"అదేమిటి మమ్మీ చీకట్లో కూచున్నావు?" అప్పుడే లోనికొచ్చిన ప్రదీప్ అన్నాడు స్విచ్ ఆన్ చేస్తూ. "ఆ..... నువ్వెప్పుడొచ్చావు బాబూ....." కళ్లు నులుముకుంటూ చుట్టూ చూసాను. గతాన్ని నెమరువేస్తూ కూచున్న నాకు పరిసరాలను గూర్చిన ధ్యాస లేకపోయింది.

గదంతా చీకటిగా ఉంది. టైము పది దాటినట్టుంది.

"సారీ మమ్మీ, మనసు బాగోలేక నీకు చెప్పకుండానే సినిమాకెళ్లొచ్చాను." అన్నాడు తన గదిలోనికి నడుస్తూ. వంట చెయ్యలేదన్న సంగతి స్ఫురణకొచ్చి గబగబా వంటింటివేపు నడిచాను.

భోంచేసేటప్పుడు మేమిద్దరమూ ముభావంగానే ఉన్నాము. మాట్లాడితే ఏ దొర్లకూడని విషయాలు మా మధ్యన దొర్లుతాయో అని భయపడ్డట్టు, ఇద్దరమూ మౌనంగా భోం చేస్తున్నాము. ప్రదీప్ నిర్ణయాన్ని హర్షించలేక పోవడానికి నాకు తోచిన కారణం ఒక్కటే! ప్రతిమ కూడా నాలా, పెళ్లయ్యాక కూడా నరకాన్ని చూస్తుందేమోనని.... భగవాన్ నా మనసెందుకిలా ద్వైదీభావంతో కొట్టుకులాడుతోంది.....? ప్రదీప్ నా బిడ్డ.... వాణ్ణి

నేననుమానిస్తున్నానా? నా బాబు నిజంగా సంస్కారవంతుడు కాడా....? అందరు మగ వాళ్లకి మల్లేనే వాడు కూడా ప్రతిమను హింసిస్తాడా......? ఛ.... నా తండ్రిని, ఈ ఒడిలో పొలిచ్చి పెంచాను..... వాడు నా కొడుకు.... ఎప్పటికీ నా కొడుకే..... అందరిలాటి వాడు కాదు. అయితే ఒక్క విషయం మాత్రం వాడితో చెప్పాలి..... నా గతాన్ని, నేను పడ్డ కష్టాల్ని.... గురించి... కానీ ఎలా? వాడితో నేనేమీ మాట్లాడలేకపోతున్నాను.

ఎలాగో భోజనం అయిందనిపించి లేచాము. రాత్రి చాలాసేపు నిద్రపట్టలేదు. అలా సీలింగ్ వైపు చూస్తూ ఎంతసేపు పడుకున్నానో నాకే తెలీదు. కళ్లు మంటలుగా ఉన్నాయి. లేచి మంచినీళ్లకోసమని డైనింగ్ రూమ్‌లోకొచ్చాను. ప్రదీప్ రూములో ఇంకా లైటు వెలుగుతూంది. టైము సుమారు మూడున్నరైంది.

"ఏం నాన్నా, ఇంకా పడుకోలేదా?" అన్నాను ఆశ్చర్యంగా కుర్చీలో కూచున్న ప్రదీప్‌ను చూసి.

"లేదు మమ్మీ, నిద్రరావటం లేదు."

## ప్రత్యూష

అన్నాడు చిరునవ్వుతో. మా మధ్య ఏ గొడవా జరగనట్టే మాట్లాడుతున్నాడు.

"బాబూ, నీతో ఓ విషయం చెప్పాలిరా. అది విన్నాక ప్రతిమ విషయంలో నీ యిష్ట ప్రకారమే చేద్దువుగాని," అన్నాను. మనసులో దైవాన్ని ప్రార్థిస్తున్నాను 'భగవాన్.... సృష్టిలో ఏ తల్లికీ ఈ దుస్థితి రానీయకు తండ్రీ.....'

"నువ్వేం చెప్పినా ప్రతిమ విషయంలో మాత్రం నా నిర్ణయం మారదు. మమ్మీ!" అన్నాడు నాకేసి చూసి అదే నిర్మలమైన చిరునవ్వుతో.

"ముందు నే చెప్పేది విను....." వద్దనుకున్నా అసహనం ధ్వనించింది నా గొంతులో.

"నా కంతా తెలుసు మమ్మీ! నువ్వు నీ కథ నాకు చెపుదామనుకుంటున్నావు. నాకు చెప్పనక్కర్లేదు. ముందే తెలుసు."

"ప్రదీప్..... ఏమిటి బాబూ నువ్వంటున్నది?" నా కంఠం వణికింది. దుర్భరమైన నా గతాన్ని నా బిడ్డకెవరు చెప్పారు. అది నా అంతట నేనే వాడికి చెపుదామనుకున్నాను... కానీ ఇప్పుడు.... వాడి ముందు నేనో దోషిలా ఇలా నిలబడాలా? వాడూ అందరి లాగానే నన్ను యీసడించుకుంటే.....?

"అవును మమ్మీ..... మీ కుటుంబాన్ని ఎరిగున్న ఒకళ్లిద్దరి ద్వారా నీ కథంతా విన్నాను. ... విన్నాక నాకనిపించింది...." వాడి గొంతు గద్గదమయ్యింది. తలెత్తి వాడి ముఖం చూడలేకపోతున్నాను. అలాగే నేల వైపు చూస్తూ వింటున్నాను.

"మా అమ్మ దేవత.... నిజంగా మా అమ్మ దేవత! అనిపించింది మమ్మీ...."

"బాబూ....." అని మాత్రం అనగలిగాను. చాలా యేళ్లుగా నాలో కరడు గట్టుకుపోయిన దుఃఖం ఒక్క సారిగా కట్టలుతెంచుకుని పెల్లుబికింది. అలాగే ముఖాన్ని చేతుల్తో కప్పుకుని వెక్కి వెక్కి యేడవసాగేను. ప్రదీప్ చప్పున లేచి వచ్చి నా ముఖాన్ని రెండు చేతుల మధ్యనా పదిలంగా పట్టుకుని చెప్పాడు....

"మమ్మీ నీ కథ విన్న రోజున నేనూ ఇలాగే యేడ్చాను మమ్మీ. ప్రతిమను పెళ్లాడి ఆమెకో కొత్త జీవితాన్ని అందించాలన్న కోరిక..... ఆ తర్వాత నాలో మరింత బలపడింది. నీ మీద నాకుండే ప్రేమా-గౌరవమూ మరింత పెరిగాయే గానీ తరగ లేదు మమ్మీ, యూ ఆర్ గ్రేట్. ఐ లవ్ యూ మమ్మీ....!" నా తలకు తన ముఖాన్ని ఆనించి పసిపిల్లాడిలా రోదించసాగేడు ప్రదీప్. అలా దుఃఖించిన చాలా సేపటికి మా యిద్దరి మనసులూ తేలిక పడ్డట్టయ్యాయి. ముందుగా నేనే తేరుకున్నాను.

"నీ నిర్ణయం నాకెంతో నచ్చింది బాబూ. నా బంగారు తండ్రి అందరిలాంటి వాడు కాదని నాకు తెలుసు. కానీ..... ఎన్నెన్నో ఎదురు దెబ్బలు తిన్న బ్రతుకు నాది. నాలా మరో ఆడది జీవచ్ఛవమైపోకూడదని కాస్త సంకోచించాను. నీ యిష్ట ప్రకారమే ప్రతిమ మనింటి కోడలవుతుంది." అన్నాను వాడి నుదుటి మీద ముద్దుపెట్టుకుని.

"థాంక్స్ మమ్మీ" నా బిడ్డ ముఖంలోని నిర్మలతను, సంతృప్తిని చూస్తూంటే నాకెంతో ఆనందంగా ఉంది. 'వాడు నా కొడుకు, నా రక్తంలో రక్తం..... నా ప్రాణంలో ప్రాణం... తల్లిగా నా జన్మ ధన్యమయ్యింది.' అనుకున్నాను తృప్తిగా.... జీవితంలో మొదటిసారిగా ప్రత్యూషను చూస్తున్న అనుభూతి కలుగుతూంది నా ప్రదీప్‌ను చూస్తూంటే.......

○

## సోవియట్ యూనియన్‌లో లక్షాధికారులు పదివేలు!

సోవియట్ దేశంలో బాగా ఆర్జించేవారి సంఖ్య నానాటికి పెరుగుతోంది. అయితే నవ ధనికులలో చీకటి బజారు శిఖామణులే ఎక్కువమంది ఉన్నారు. అధికార యుతంగా మిలియనీర్లయినవారి సంఖ్య గత సంవత్సరం 300 కు చేరుకున్నదని సోవియట్ ప్రణాళికా సంఘం ప్రతినిధి తెల్పారు. మిలియనీర్లుగా అధికార యుతంగా గుర్తించబడినవారు 300 కాగా, అజ్ఞాతంగా దాదాపు 10 వేల మంది మిలియనీర్లు ఉన్నారని, మరో 15,000 మంది 1990లో యీ స్థాయికి చేరుకున్నారని తెలుస్తున్నది చీకటి బజారు ఆర్థిక వ్యవస్థలో సోవియట్ యూనియన్‌లో దాదాపు 3 కోట్లమంది భాగస్వాములుగా ఉన్నారు వీరి ఉత్పత్తుల మొత్తం విలువ 10,000 కోట్ల రూబుళ్ళుగా ఉంటుందని భావిస్తున్నారు సోవియట్ మిలియనీర్ల ఆదాయంలో ఎక్కువ భాగం బంగారం, నాణాలు, విగ్రహాలు, రియల్ ఎస్టేట్ గృహ విభాగాలవంటి నిశ్చల నిధుల రూపంలో ఉంటున్నది ఈ నిధులలో పెద్దభాగం సహకార సంఘాల అధికృత పెట్టుబడిగా మారుతున్నది

సోవియట్ 'అజ్ఞాత' మిలియనీర్లను కేవలం పాలనా పద్ధతుల ద్వారానే పరాజితులను చేయడం సాధ్యం కాదని ఆర్థికవేత్తలు భావిస్తున్నారు వీరి ఆర్థిక మూలాలను కదల్చాలంటే సోవియట్ ఆర్థిక వ్యవస్థ పునరుద్ధరణకు అనేక గట్టి చర్యలను చేపట్టాల్సి ఉంటుంది. ఇందులో భాగంగా సాధారణ 'న్యాయబద్ధ వాణిజ్యాభివృద్ధికి తోడ్పడాల్సి ఉంటుందని ఆర్థికవేత్తలు అభిప్రాయ పడుతున్నారు ఇటీవల సోవియట్ ప్రజాప్రతినిధుల కాంగ్రెస్ సమావేశం ఆమోదించిన రిష్కోవ్ ప్రతిపాదిత ఆర్థిక కార్యక్రమం అమలుద్వారా యిది సాధ్యపడుతుందని భావించవచ్చు.

# నొప్పి, బాధ వచ్చినప్పుడు ఉపశమనానికి మీరు ఎవరి దగ్గరికి వెళ్తారు?

అమృతాంజన్ సుమారు నూరు సంవత్సరాలుగా అమృతాంజన్ మీ తలనొప్పులకు, వెన్ను నొప్పులకు బెణుకులకు, ఇతర శారీరక బాధలకు ఉపశమనం కలగచేస్తోంది విశ్వసించిన, ఉపశమనం కలగచేసే అమృతాంజన్—'మీ జీవిత కాలమంతా మీ వెంటవుండే సహాయకారి







## అమృతాంజన్

పెయిన్‌బామ్

అమృతాంజన్ లిమిటెడ్



O&M 1782 TG

# ప్రశ్నావళి

**- కె. రామలక్ష్మి**

**డి. జ్వాలా నరసింహారావు, నూజివీడు.**

తాము ప్రజలచేత ప్రజలకొరకు ఎన్నుకొనబడిన వారమని తెలిసికూడా ప్రజాకష్టాలు పట్టించుకోకుండా పరస్పర నిందారోపణలు చేసుకుంటున్న నాయకులకు మీరిచ్చే సలహా?

మనం వారికి సలహా లివ్వనవసరం లేని వారే- నాయకులు! అయినా మన కష్టాలు ఎన్నికల ముందు పట్టించుకుంటామని చెప్తారే గాని అధికారం హస్తగతం చేసుకున్నాక కూడా అని చెప్పలేదే! మళ్లీ ఎన్నికల దాకా- అంతే.

నేటి రచయితలు చాలా మంది మూస రచనలు చేయడానికి కారణం?

*ఆలోచించడానికి టైమెక్కడుంది?!

**ఎమ్.ఆర్.ఆర్., విశాఖపట్నం.**

పెద్దలకి యువకులకి తేడా ఏమిటి?

*వాళ్ల వాళ్ళ ప్రవృత్తులే! పెద్దరికం యువతకో మిస్టరీ అయితే- 'యువత' పెద్దలకో సమస్యకదా!.... వారిలా వీరు, వీరిలా వారు చూడలేరు.

**పాట్నేడి చక్రరావు, విశాఖపట్నం.**

పబ్లిక్ పరీక్షల్లో విద్యార్థులకు తల్లి తండ్రులే కాపీలందిస్తున్నారట. అభ్యంతర పెట్టిన ఓ గురువుగారి యిల్లు తగులబెట్టబోయారట. ఇంకెటుపోతుందండీ మన విద్యారంగం?

*డిగ్రీలకేసి! పరిశోధన కేసి!.... పరుగులు పెట్టిస్తోందనుకోండి... మీరు తల్లి దండ్రులు కాపీలు అందిస్తున్నారంటున్నారా? ఇక్కడొక పరీక్ష హాలు ప్రాంతంలో సంఘ సేవాపరాయణు డొకడు ఆన్సర్లు మైకులో చదవడం ప్రారంభించాడట?! ఈ చదువులకి అర్థం ఎప్పుడోపోయింది.

**లక్ష్మణ్‌దాదా, ఖమ్మం.**

స్నేహానికన్నా మధురమైనది లేదంటాను. ఏమంటారు?

*నిజమే. అది వికటిస్తే అంత కంటే చేదైనదీ యింకొకటి వుండదు!

**ఎక్కి మధుసూదనరావు, విజయనగరం.**

నేడు కొత్తగా వస్తున్న రచయితలు సహితం ముఖాముఖి శీర్షిక ద్వారా ప్రశ్నలకు జవాబులిస్తున్నారు. వీటివలన కలిగే ప్రయోజనం ఏమిటి?

*ఎవరికి? రచయితకా- పాఠకుడికా అని అడగాలి సోదరా! రచయిత రచననీ/పాఠకుల పేర్లనీ ఎడిటర్ ప్రచారం చేయడం- తద్వారా తమ 'అభిమాన' రచయితలని అందలం ఎక్కించడం (ఎలా-అంటారా? బాగున్నాయి- అద్భుతం, ఫెంటాస్టిక్, థ్రిల్లింగ్ లాంటి ఉత్తరాలే వేస్తే- అభిమాని అని)- ఈ రోజుల్లో ఎడిటర్/రచయితల సంబంధం చాలా గమ్మత్తుగా వింతగా ధ్వనిస్తున్నారు- చాలామంది.

**కె.ఎస్.ఎస్. ప్రసాద్‌బాబు, అమృతలూరు.**

కవిత్వం అనేది జీవితానుభవం నుంచి పుడుతుంది. అంతేకాని ఒక థియరీ దృష్టిలో పెట్టుకొని వ్రాయకూడదు. ఇప్పటి కవులలో స్లోగన్ పొయెట్రీ ఎక్కువగా వున్నదని నాయిని కృష్ణకుమారిగారు అన్నారు. నాకు కవిత్వం రాయాలని వున్నది- నాది తక్కువ వయసు. జీవితానుభవం ఎక్కడుంటుంది! మరి కవితలు రాయాలంటే?

*రాసేయండి. ఏదైనా థియరీనో దేన్నో విమర్శకులు దాన్లో వెతుక్కుంటారు. కవిత్వం కావాలనుకున్న వాళ్లు కవిత్వం వెతుక్కుంటారు. మధ్య మీకెందుకా బెంగ?!

మీరు దాదాపు అన్ని విషయాలలోనూ పరిజ్ఞానం వున్న వారిలా అనిపిస్తారు నాకు. అమెరికా నుంచి ఆవకాయిదాకా అన్నీ చెపుతారు. మీ జవాబులు నిష్పక్షపాతంగా వుంటాయి. రియల్‌గా మీరు చెప్పాలంటే యుఆర్‌ఎ గ్రేట్ ఉమెన్ ఆఫ్‌ఎ.పి. ముఖస్తుతి మాత్రం కాదు. ఇంతకీ మీరేం చదివారు?

*చూశావా? ఆకాశానికెత్తి కాలికింద కార్పెట్‌లాగేయడమంటే ఇదే! నాకేదో బిరుదిచ్చి సన్మానం గట్రా చేస్తానంటారనుకున్నా! ప్చ్. మోసం చేశావయ్యా ప్రసాద్‌బాబూ, నేనేం చదువుకోలేదు. అసలు నిజం అదీ. అందుకే అంత క్షుణ్ణంగా అభిప్రాయాలు చెప్ప కల్గుతున్నాను. "నీ ముఖం నీ బుర్రలో ఏముందే కోట నందూరు నల్లమట్టి తప్ప" అంటూండే వాడు మా పెదమామయ్య... క్యూరియాసిటీ నన్ను అన్నీ విని, చూసి, కబుర్లాడేలా చేస్తూ్తందంతే. థాంక్యూ ఎనీవే!

**టి. కిషోర్, చీరాల.**

ఘంటసాలగారు సినిమాలకు పాడిన పాటలు గల కొన్ని సినిమాలు అసలు విడుదల కాలేదు. ఆ పాటలని పొందే మార్గం పూర్తి చిరునామా తెల్పకలరని ఆశిస్తున్నాను.

*నాకీ సంగతులు అస్సలు తెలియవు. దయచేసి వి.ఎ.కె. రంగారావుగారితో సంప్రదిస్తే మీకు వివరాలు తెలియవచ్చు.

**కె. సన్ని, అనకాపల్లి**

స్త్రీకి ఆత్మాభిమానం ముఖ్యమా? అణుకువ ముఖ్యమా రామలక్ష్మిగారూ.

* మీకు ఆమె అణకువ, ఆమెకామె ఆత్మాభిమానం ముఖ్యం... అణకువ, పతిభక్తి, సర్దుకుపోవడం పడివుండడం, అతి వినయం... యివన్నీ యీ రోజుల్లో పనికిరాని మాటలని ఎప్పుడు గుర్తిస్తారు?!

**ఎస్. రవిసాగర్, ప్రొద్దుటూరు**

సరస్వతి ఆకు తింటే జ్ఞాపకశక్తి వస్తుందంటారు నిజమా?

* తెలియదయ్యా - యిలాంటివి నేనెప్పుడూ పట్టించుకోలేదు. 'ఆ ఏవుందే, కుతూహలం లేని విషయాలు జ్ఞాపకం వుండి చావ్వు. కావాలనుకున్నవి చచ్చినా మరిచిపోరు' అనే వాడు మా పెదమామయ్య. నేనాయన మాట నమ్ముతాను. ○



ప్రారంభం!

హాస్య నవలిక

# ఇంటికి దీపం ఇల్లాలే!

– పి. కుసుమా రెడ్డి

తెల్లవారింది–

రాత్రి రగ్గుతొలగించి, భూదేవి ఒళ్ళు విరుచుకొన్నట్టు.

''ఏవండోయ్, మిమ్మల్నే. లేవండి''.

''ఏమిటోయ్ 'సుబ్బూ, మరీ రాయినో, రప్పనో దొర్లించినట్టు ఈ లేపడమేమిటి? ఎప్పుడైనా ముద్దుగా ఏవండీ శ్రీవారూ అంటూ కాళ్ళకి దణ్ణంపెట్టి లేపావా!''

''మీ కాళ్ళకి నేనెందుకు దణ్ణం పెట్టాలి మీరేమంత ఘనకార్యాలు చేసారని, అయినా మీ కాళ్ళు నేనెందుకు పట్టుకోవాలి మనపెళ్ళిలో మా అమ్మా నాన్నల కాళ్ళకి దణ్ణం పెట్టమంటే ఏం అన్నారు మీరు? మనసులో వుండాలి కాని ప్రేమ, కాళ్ళు . చేతులు పట్టుకుంటే రాదని మీరనలేదూ! ఫలితం ఏమయింది?''

''ఏమవుతుంది దణ్ణం పెట్టలేదనేగా మీ నాయనమ్మ డబ్బు యివ్వనంది అయినా పెద్దవాళ్ళ మూర్ఖత్వం కాని. వంగి దణ్ణం పెడితే భక్తి ఉన్నట్టు. లేకపోతే లేనట్టూనా?''

''సర్లెండి, ఈ విషయాలు తర్వాతగాని ముందు ఈ విషయం విన్నారా?''

''ఏదీ నువ్వు చెప్పందే!''

''కోడలి వ్యాసానికి మొదటి బహుమతి వచ్చిందట''

''నిజంగానే?!''

''నిజంకాక, అబద్ధం ఏమిటీ? మీకు అంతగా నమ్మకం లేకపోతే బయట ఎంత హడావిడి చేస్తుందో వచ్చి చూడండి''

''ఏం చేస్తుందేమిటీ?''

''తను చేస్తుందేమిటీ? మనచేత చేయిస్తుంది''

''నాకు తెలుసులేవోయ్, కోడలి సంగతి బట్టలు పెట్టి, ఆ తర్వాత కాళ్ళకి దణ్ణం పెడుతుంది ఆ



## బుల్లి 'జాకీ'

తల్లిని కావాలన్న ఆయేషా జాకీశ్రాఫ్ కోరిక త్వరలో తీరబోతోందట. తన భార్య- మక్కువ తీర్చేందుకు బయటి వ్యవహారాలు తగ్గించుకొని ఎక్కువ సమయం యింట్లోనే గడిపేస్తున్నాడు జాకీ. మరి యింట్లోనే వుండిపోతుంటే ఆయేషా తల్లి కావటంలో వింతేముంది! పిల్లాడు కావాలని ఆయేషా ఉబలాటపడుతోందట. ఎవరు పుట్టినా అప్పుడు క్షణం తీరిక వుండదేమో యిద్దరికి అని యిప్పుడే వూసులు చెప్పుకుంటున్నట్లున్నారు ఫొటో చూస్తుంటే! ఎప్పుడూ సీరియస్‌గా వుండే జాకీ ముఖంలో యిప్పుడు నవ్వుతాండవిస్తోందట. నాకు నవ్వటం చేతనవునని నిరూపించుకుంటున్నట్లున్నాడు. మరి ఈ నవ్వు అలాగే వుంటుందా? ఏమో....?



తరువాత సౌభాగ్యవతీ భవ అంటూ ఆశీర్వదిస్తాం ఆ మధ్య ఏదో వ్యాసానికి రెండవ బహుమతి వస్తే అలాగే కదా చేశాం "

"సంతోషించాం కాని.. ముందు లేవండి"

"ఏమిటీ! కాఫీ తాగకుండానే, నావల్లకాదు"

"అలా అంటే ఎలాగండీ! కోడలేమో తన వ్యాసానికి బహుమతి వస్తే, మనచేత వెయ్యిమీద నూటొక్కసారి మెట్లు ఎక్కించి నాలుగు గుళ్ళలోనూ అభిషేకం చేయించి... ఒక్కో దేవుడికి 108 కాయలు చొప్పున కొట్టిస్తానని మొక్కుకుందట"

"ఇదెక్కడి గొడవే. బహుమతి తనకూ- శిక్ష మనకూనా?"

"శిక్ష కాదండీ! రక్ష. దేవుడికి దణ్ణం పెట్టుకోవడం శిక్షా? మీరు రాకపోతే కోడలు ఈ రోజు భోజనం చేయదట"

"మొక్కుకుంటే తనని చేయమను అంతేగాని బి. పి ఉన్న మనిషిని, బాధపెట్టి ప్రాణం తీయొద్దను"

"ఒక పూటకి ఏమైపోతుందండి. ఏదో కాస్త ఓపికపడితే భక్తి వస్తుంది... ఫలం దక్కుతుంది "

"ఏదో రచనలు చేస్తుందంటే సరదాపడి అబ్బాయికి చేసానుకాని. ఇలాంటి శిక్షలు వేస్తుందని తెలిస్తే ."

"అలా అంటే ఎలాగండీ! రచనలు చేయడానికి తెల్లవార్లూ నిద్రలేకుండా అమ్మాయి పడుతున్న శ్రమ చూస్తే జాలి వేస్తుందండి"

"ఓ పని చేయకూడదూ!"

"ఏమిటి!"

'పోనీ నాబదులు రెండుసార్లు నువ్వే మెట్లన్నీ ఎక్కకూడదూ!?"

"మీలాంటివాడే భార్యా భర్తలిద్దరూ వెళ్తే ఖర్చు ఎక్కువవుతుందని హనీమూన్‌కి ఒక్కడే వెళ్ళి వచ్చేస్తానన్నాడట "

"ఇదెక్కడి గొడవే! ఖర్మకాలి ఓసారి అచ్చు వచ్చిందని నన్ను ఉతికి పారేస్తుందేమిటీ! ఆ మధ్య అదేదో నవల.. అదే 'అర్ధరాత్రి అబలలు' నవల అచ్చువేసినప్పుడు నా తలమొక్కు యిస్తానని మొక్కుకుంది. పోన్లే ఎలాగూ చుండ్రు ఉంది కదా అని యిచ్చేశాను మళ్లీ రేపేదయినా ఖర్మకాలి ఏదన్నా నవలల పోటీలోనో, ఏ పత్రికా ఎడిటరో బహుమతి యిస్తే ఏ రెండు వేల రెండువందల పదహారు మెట్లో ఎక్కాలని మొక్కుకుంటే నావల్లకాదు"

"సర్లెండి అ యితే ఈ సారికి మీరు ఒప్పుకున్నట్లేగా!"

"నువ్వెక్కడ దొరికావే, అయినా తెలియని పిల్లలు తప్పుచేస్తే, మందలించవలసిందిపోయి, ఆ అమ్మాయికి వకాల్తా పలుకుతావా?"

లక్ష్మణరావు మాటలు ఇహ సుబ్బలక్ష్మి వినిపించుకొనే పరిస్థితిలో లేదు కాని ఆనందంతో 'మా మంచి శ్రీవారంటూ' అతన్ని గిరగిరా తిప్పేస్తోంది

"నీ ఆనందం పాడుగాను కాస్త కాళ్ళు నెప్పులుపుట్టి కాళ్ళు ఒత్తమంటే చేతులు నొప్పులంటావు, వెధవ సినిమాలు చూసి ఇలా తయారయ్యావు"

అతని మాటలింకా పూర్తికాలేదు. ఇంకా ఏదో అనబోతున్నవాడల్లా కరంట్‌షాక్ కొట్టినట్టు కొయ్యబారి పోయాడు. నాలుగొందల కొబ్బరికాయలు నాలుగుబస్తాలలో వేసుకొని... రెండు బకెట్లు.. చెంబు. ఇంకా పూజసామాన్లు తీసుకొని కోడలు రచన రిక్షా ఎక్కడం ఆ వెనుకే సుబ్బలక్ష్మి.. లక్ష్మణరావుకి నచ్చచెప్పి గుడికి లాక్కెళ్ళడం జరిగాయి.

తడి బట్టలతో వెయ్యిమీద నూటొక్క సార్లు మెట్లు ఎక్కేసరికి బహుమతి యిచ్చిన ఎడిటర్ మహానుభావుడు ఎవరో తెలుసుకొని అవసరం అయితే కడుపో, కాళ్ళో పట్టుకొని యిలాంటి బహుమతులు
రచయిత్రులకి యివ్వకండి మహాప్రభో! మీకు పుణ్యం ఉంటుంది', అంటూ కాళ్ళకి దణ్ణం పెట్టాలన్నంత ఉక్రోషం వచ్చింది.

ఏడు కొండల వాడికి అభిషేకం అయింది. ఆ తరువాత ఆంజనేయస్వామికి అభిషేకం + ఆకు పూజ అయ్యేసరికి పన్నెండయ్యింది. శోష వచ్చి పడిపోతున్నట్టు అనిపించింది లక్ష్మణరావుకి

వట్టి అభిషేకం అయితే బ్రాహ్మడు గొణిగే మంత్రాలతో కునుకుపాట్లు పడవచ్చు కాని. మధ్యలో చిన్న పిల్లవాడు చదవకపోతే నెత్తిమీద మాష్టారు మొట్టికాయ మొట్టినట్లు . ఈ కొబ్బరికాయలు కొట్టడం ఏమిటో అర్థంకాక... ఆలోచనలతో సతమతమవుతున్న లక్ష్మణరావు దేవుడిమీద అక్షింతలు వెయ్యమంటే పూజారిమీద వెయ్యడంతో, భార్య ,మోకాలిమీద ఓ చరుపు చరచడంతో స్పృహలోకి వచ్చి క్షణం సేపు సిగ్గుపడ్డాడు. ఆ తర్వాత ఫర్వాలేదని సర్దుకున్నాడు మిగతా రెండు గుళ్ళలోను అభిషేకాలు పూర్తయ్యాయి. నాల్గవ గుడిలో కొబ్బరికాయలు కొట్టే ఓపిక లేక, దొంగాటలో ఓడిపోయిన చిన్న పిల్లాడిలా చేతులు పైకెత్తేశాడు.

"మావయ్యా! మీ కిది న్యాయమా? ఇహ 108 కాయలేగా కొట్టేది. మీకు పుణ్యం ఉంటుంది. మీరు కాయలు కొట్టకపోతే మీ అబ్బాయిమీద ఒట్టే?"

పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాడు లక్ష్మణరావు

'ఇదెక్కడి దౌర్జన్యం చూసి, చూసి తనకే బాణం వేసింది. తప్పదు ఓపిక లేకపోయినా ప్రాణం పోయినా కొట్టి తీరాలి అయినా వేసుకునే ఒట్టేదో, గట్టో తనమీద వేసుకోవాలి గాని.. అభం శుభం తెలియని వాడిమీద ఎందుకు?' మనసులోనే తిట్టుకున్నాడు లక్ష్మణరావు.

అంతే! కొబ్బరికాయిలు టపా... టపా కొట్టడం ప్రారంభించాడు.

చివరిలో దక్షిణ యివ్వడానికని బ్రాహ్మల్ని తీసుకురావడానికి రచన ఆలయంలోకి వెళ్ళింది.

లక్ష్మణరావు వళ్ళంతా చెమటతో ముద్దవుతుంది. బయట ఎండ మండిపోతుంది. అలసటతో చిరాగ్గా భార్య వంక చూసాడు.

"ఏవండీ! నిజంగా మీరు చాల మంచివారండీ! మిమ్మల్ని చూస్తే, నాకు చాల బాధగా ఉంది .. కానీ ఏం చేస్తాం. కోడలు ఉన్నత స్థితిలోకి రావాలంటే మన తోడ్పాటు కావాలి "

"తోడ్పాటా . నా పిండాకూడా. ఇప్పుడు టైమెంతయిందనుకున్నావు? ఒంటిగంట దాటింది. పైగా ఇది చాలదన్నట్టు తనమీద పెట్టుకోకుండా...

# ఇంటికి శాపం ఇల్లాలే!

నా కొడుకుమీద ఒట్టు ఒకటి. ఈ కాయలు కొట్టి కొట్టి నా చేతులు ఎలా వాచిపోయాయో."

స్కూల్లో మాష్టారు కొట్టినప్పుడు కిమ్మనకుండా ఊరుకొని యింటికొచ్చి తల్లి కొంగు పట్టుకొని మారాంచేసే విద్యార్థిలా భర్త మొహం పెట్టేసరికి భర్తమీద జాలి అమాంతంగా ముంచుకొచ్చింది సుబ్బలక్ష్మికి.

నూటొక్కకాయలు అతి కష్టంమీద కొట్టి నూట రెండోకాయ కొట్టడానికి కాయి పైకెత్తిన లక్ష్మణరావుకి బి పి. పెరిగిపోయింది. ఫలితం... అప్పుడే దక్షిణ యివ్వడానికి తీసుకొచ్చిన బ్రాహ్మడు కాళ్ళమీద కాయ కొట్టేసరికి బ్రాహ్మడి సంగతి ఎలా వుందో తెలియదు కాని ఆ రక్తం చూసి లక్ష్మణరావు కళ్ళు తిరిగి కింద పడ్డాడు.

దాంతో సుబ్బలక్ష్మి ఆరున్నొక్క రాగం అందుకొంది. కాని రచన మాత్రం ఇంకా ఏడు కాయలు మిగిలిపోయాయని... ఇకముందు దేవుడు తనని క్షమించడని మనసులోనే కుమిలిపోయింది.

## 2

సుమారు గంట క్రితం కేంప్ నుండి వచ్చిన మురళి **గుళ్ళోకి వెళ్ళినవాళ్ళు యింకా తిరిగి రాకపోవడంతో** సూట్‌కేస్ పక్కింట్లో పెట్టి, స్కూటర్ లాక్ చేస్తుండగా ఇంటి ముందు రెండు రిక్షాలు నిలబడ్డాయి

ఓ రిక్షాలో ముక్కుతూ, మూల్గుతూ హడలిపోయిన తోటకూరకాడలా లక్ష్మణరావు, అలసట ఘెరుగని గుండ్రాయిలా సుబ్బలక్ష్మి దిగారు రెండవ రిక్షాలో మొక్కు సరిగ్గా తీర్చకుండా మధ్యలో మొహం తిరిగి పడిపోయాడనే కోపంతో విసవిసా దిగుతున్న రచనని చూసేసరికి విషయం చెప్పకుండానే అర్థం చేసుకున్నాడు మురళి ఎందుకంటే అనుభవం అలాంటిది. పెళ్ళయి అయిదేళ్ళయింది. రచనలు చేయడం పెళ్ళికి ముందె వుంది. ఇంటి పేరుతో పాటు తల్లి, తండ్రి పెట్టిన పేరుని 'సాహిత్యం' మీద భక్తితో రచనగా మార్చుకొంది.

"ఏం నాన్నా! ఎలా వుంది ఒంట్లో!"

"చూస్తున్నావుకదరా నాయినా! ఇంకా ఎలా వున్నానని చెబుతాను. మీ ఆవిడకు బహుమతి పారితోషికం ఎంత వచ్చిందో తెలియదు కాని... కొబ్బరికాయల ఖర్చు ఎనిమిది వందల యాభై...పూజారుల ఫీజులు 150. యింకా పై ఖర్చులు ఓ యాభై నేను నేలమీద కొట్టబోయి, కళ్ళు చీకట్లు కమ్మి బ్రాహ్మడి కాలిమీద కొట్టినందుకు 100 అయ్యాయి... ఇంకా తెలియకుండా ఎంతయిందో నాకు తెలియదు."

ఆయాసంతో, రొప్పుతూ చెబుతున్న లక్ష్మణరావు మాటలకి కొరకొరలాడుతున్న కళ్ళని రచన ఎర్ర చేయడంతో లక్ష్మణరావు మంచు ముక్కలా కొయ్యబారి పోయాడు.

లక్ష్మణరావు, సుబ్బలక్ష్మి, మురళి లోపలికి వెళ్ళగానే బయటే చింకి చేటంత మొహం చేసుకొని పలకరించింది భద్రకాళి.

"అమ్మాయ్, రచనా! నువ్వు ఏదో రాసావటకదా! దానికి బహుమతి వచ్చిందట. మాకు పార్టీ ఎప్పుడిస్తావు?"

"ఈసారి పార్టీ యివ్వడం లేదండీ. వట్టి స్వీట్స్ మాత్రమే పంచి పెడతాను. అంతే."

"అదృష్టవంతురాలివి. పట్టింది బంగారం అవుతుంది."

"అంతా మీలాంటివాళ్ళ ఆశీర్వాదమే. నాదేం-



వుంది?"

అంటూ బుట్టలో వున్న ప్రసాదం నాలుగు కొబ్బరి చిప్పలు, కుంకుమ చేతిలో పెట్టింది

ఇంకా ఏదో చెబుతుండగా గుమ్మంలో రిక్షా ఆగడంతో ఆమె మాటలకు ఆనకట్ట పడింది.

'శనిగ్రహం అని, తిప్ప వేస్తే నెల్లాళ్ళ వరకూ వీడు, వీడి మొహం అంటించా' మనసులో తిట్ల వర్షం కురిపిస్తూనే, పెదవులపై నవ్వు పులుముకుంటూ వచ్చిన వ్యక్తిని పలకరించింది భద్రకాళి. "లోపలికి రండి అన్నయ్యగారూ!" అంటూ తమ పోర్షన్‌లోకి దారి తీసింది.

కుశల ప్రశ్నలు పూర్తయ్యాయి. తండ్రి గొంతు వినగానే మంగళ గుండెల్లో రాయి పడింది. తండ్రి వచ్చాడని కాదు. తండ్రి రాకతో అత్తగారు యింటిని యుద్ధ రంగంలా చేస్తుందనే భయంతో.

"నాన్నా! అంతా బావున్నారా?" తండ్రిని పలకరించి, కాసేపటికి కాఫీ గ్లాసు చేతి కందించింది

"ఏమిటే అమ్మాయ్, మరీ అంత చిన్న గ్లాసులో యిస్తున్నావు? సోల గ్లాసులో తాగితేగాని తాగినట్టుండదే!"

అక్కడ కూర్చున్న భద్రకాళి మొహంలో రంగులు మారాయి.

'నీ మొహం మండ. కూతురికి కట్నం యివ్వలేని సన్యాసివి తగుదునమ్మా అని సిగ్గు లేకుండా యిచ్చింద తాగక సోల గ్లాసుతో కావాలా? సోల గ్లాసులోనూ, తవ్వ గ్లాసులోనూ కావల్సినవాడివి ఓ గేదెని అరణంగా యివ్వలేకపోయావూ?'

వియ్యపురాలి అంతరంగాన్ని అర్థం చేసుకోని సత్యమూర్తి అన్నాడు.

"కాఫీతో పాటు కాస్త ఉప్మా కూడా పట్టుకురామ్మా" తండ్రి మాటలకి అలాగేనని తలూపుతూ అత్తగారి చూపులకి వణికిపోతూ వంటింట్లోకి వచ్చింది కాని... మంగళకి ఏం చేయాలో తోచలేదు. కాస్త ఆలస్యం అయితే 'టిఫిన్ తెస్తున్నావా? లేక నన్నే వంటింట్లోకి రమ్మంటావా?' అనే తండ్రి తత్వం తెలిసి అక్కడికి సమస్య జటిలం కాకూడదని తండ్రి దగ్గరికి వచ్చి నెమ్మదిగా అంది.

'నాన్నా! భోజనం టైమ్ అయిందికదా! ఏకంగా వంట చేసేస్తాను. ఈలోగా ఈ వీక్లీస్ చూస్తూ ఉండు. మీ అల్లుడు కాలేజ్‌నుండి వచ్చే టైమ్ అయింది.'

అంటూ మరో మాటకి అవకాశం యివ్వకుండా వంటింట్లోకి నడిచింది మంగళ.

"అమ్మాయి ఏదో భోజనం అని మామూలుగా మీకు చేసుకున్నట్టు చెయ్యక రెండు కూరలు, పప్పు, పులుసు, రెండు పచ్చళ్ళు యింకా"

సత్యమూర్తి మాటలు పూర్తి కాలేదు కాని భద్రకాళి వళ్ళంతా కారం రాసుకున్నట్టు మంటగా వుంది.

అది ఎలా తీర్చుకోవాలో, ఏవిధంగా మొదలు పెట్టాలో రిహార్సల్ వేసుకుంటున్న భద్రకాళికి వంటింట్లో కూర పోపు పెడుతున్న చప్పుళ్ళు వినిపించాయి

"ఏమిటే! ఆ ముదనష్టపోడు తిండి కోసం మొహం వాచిన వాడిలా, నా యింటికి వచ్చి, ఆర్డర్లు వేస్తాడేమిటీ: నా కొడుకుని వెర్రినాగన్నని చేసి మూడు ముళ్ళు వేయించుకున్నావు. అది చాలక నీ వాళ్ళ తిప్పలు ఒకటి."

రుసరుసలాడుతున్న భద్రకాళికి వీధిలోకి అప్పుడే వచ్చిన మధుకర్ రాకతో నోరు మూత పడింది.

మామా అల్లుళ్ళ పలకరింపు లయ్యాయి.

అత్తగారి మాటలకి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్న మంగళ వంట పూర్తి చేసి ముందుగా అత్తగార్ని పిలిచింది.




మాడ్చుకొన్న మొహంతో భోజనం చేసి పక్క గదిలోకి వెళ్ళింది కాని, ఆమె ఏదో నెపంతో గదిలోకి వచ్చి అతను భోజనం చేస్తున్నంతసేపు అతను తిన్న తిండికి లెఖ్ఖలు కట్టసాగింది.

ముగ్గురు మనుష్యులకి సరిపడే భోజనం లోటా గిన్నెతో సాంబారు, పెద్ద గిన్నెతో రెండు సార్లు నెయ్యి... లెక్కలేనన్నిసార్లు పెద్ద గరిటెలతో కూరలు. పెద్ద చెంబుతో మజ్జిగ... అదీ చాలక స్వీట్లు ఐదు ఆరు కేజీలు ఒక్కసారే తినడంతో ఆమె గుండె గుబేలుమంది.

దున్నపోతుమీద వర్షం కురిసినట్టు... యిలాంటివేమీ పట్టించుకోనట్టు సాయంత్రం 'టీ' లోకి పెసర పునుకులు పకోడీలు వేయమని సత్యమూర్తి ఆర్డర్ వేయడంతో, పెనంమీద అట్టులా– ఆమె మనసు అసహనంతో కుతకుతలాడిపోయింది.

## 3

సత్యమూర్తి సుఖంగా తిని నిద్ర కుపక్రమించాడు. మధుకర్ కాలేజీకి వెళ్ళిపోయాడు. మంగళ వంటిల్లు సర్దుకుని... యిల్లంతా శుభ్రంగా ఊడ్చి నీట్‌గా ఎక్కడి వక్కడ సర్దింది.

"యిదిగో! యిది నా యిల్లు. నా యింట్లోకి అడ్డమైన వాళ్ళు రావడం నేను సహించను. అయినా మీ యింట్లో అసలు తిండి తింటాడో లేక ఊరుమీదపడి యిలాగే బాధ పెడు తుంటాడో? లేకిబుద్ధులుకాకపోతే ఏమిటా తిండి ఏనాడైనా అల్లుడ్ని ముచ్చటగా ఓ పండక్కి పిలిచి ఓ పూట భోజనం పెట్టి, ఓ గుడ్డముక్క పెట్టాడా? లేదు సరికదా అల్లుడి సొమ్ము తేర గా తింటాడా?"

బియ్యంలో రాళ్ళలా మంగళ పుట్టింటి వాళ్ళని తిరస్కారంగా ఏరి పారేస్తుంది.

అత్తగారి మాటలు కొరడా దెబ్బల్లా ఆమె మనసును బాగా గాయ పర్చాయి.

ఫలితం సాయంత్రం భర్త రాగానే, తండ్రికి చెప్పేసింది. తమ యింటికి రావద్దని ఒకవేళ వచ్చినా తనని చూసిపోవడం తప్ప.. పచ్చి మంచినీళ్ళు ఈ యింటినుండి ఆశించవద్దని'

ఈ పరిణామానికి సత్యమూర్తి సిగ్గుతో చితికి పోయాడు. కోపంతో పెట్టే, బేడా సర్దుకొని ఆ సాయంత్రమే వెళ్ళిపోయాడు సత్యమూర్తి. అతను వెళ్ళాక అంతవరకు ఓపికపట్టిన మధుకర్ భార్య మాటలకి చెంప చెళ్ళుమనిపించాడు.

ఈ హఠాత్ పరిణామానికి భద్రకాళి విరుచుకుపడింది.

"ఏమిటిరా! ఉన్న మాటంటే ఉలుకెక్కువని. అది ఏవందని దాన్ని కొట్టావు అంటే నన్ను కొట్టలేక దానిమీద చేయి చేసుకున్నావా! ఒరేయ్! నీకు తల్లంటే గౌరవం లేదురా! మీ నాన్న నీ చిన్నప్పుడే

పోతే పెంచి పెద్ద చేసి... నిన్నింత వాణ్ని చేశాననే విశ్వాసం ఉందిరా! అడ్డమైన వాళ్ళు కొంపలో కొచ్చి నెలలు... రోజులు తిష్టవేస్తే భరించే రిచ్ ఫ్యామిలీ కాదురా! నేను బ్రతకడం నీకిష్టం లేకపోతే చెప్పు యిప్పుడే ఏ గంగలోకి దూకైనా చస్తాను.".

"నువ్వు ఎందులోకి దూకవని నాకు తెల్సుకాని... ఒకవేళ దూకినా తర్వాత ప్రాణభయంతో గంగ వెర్రులెత్తుకుపోయి, ఏ హాస్పిటలుపాలో అయి వేలు ఖర్చు చేయించి మా ప్రాణం తీస్తావు అమ్మా! ఇంటికి ఎలాంటి మనిషొచ్చినా గౌరవించడం సంస్కార లక్షణం.అలాంటిది ఏడాదికి– ఎప్పుడో వచ్చేవాళ్ళ మీద మీ ప్రతాపం చూపించి హింసించారు. తిండికైనా... సుఖానికైనా కొందరే పెట్టిపుడతారమ్మా! అలాంటి వాళ్ళలో అతనొకడు. ప్రతి మనిషికి కొన్ని బలహీనతలుంటాయి అలాగే ఆయనకి కొన్ని ఉన్నాయి."

కోపం.. ఆవేశం కలగలిపిన గొంతుతో మధుకర్ చిరాగ్గా బయటకు వెళ్ళిపోయాడు.

## 4

తల్లి మాటలకి... బెదిరింపులకి మధుకర్ బాధపడలేదు.. ఎందుకంటే ఆమె చేష్టలన్నీ కొట్టినపిండే కాలేజీలో లెక్చరర్‌గా చేరిన రోజుల్లో మంగళ... మధుకర్ మనసులు కలిశాయి. మంగళ చదువు పూర్తయ్యాక తల్లికి అసలు విషయం చెప్పాడు తల్లి ఒప్పుకోలేదు. ఆ పిల్లను చేసుకుంటే చచ్చిపోతానని బెదిరించేది. దేనికీ మధుకర్ లొంగలేదు. తన మాటకంటె ప్రేమించిన పిల్లకే ఎక్కువ విలువ యిస్తున్నాడనే ఉక్రోషంతో నూతిలో పడిపోతున్నానంటూ బెదిరించి ఒకసారి నిజంగానే పడిపోయింది.

పడిపోవడం అంటె పడిపోయింది కాని... ఆ తర్వాత ప్రాణం విలువ తెలిసి రక్షణ కోసం నూతి అంచు పట్టుకొని భయంతో కేకలు పెట్టింది.

జనం పోగయ్యారు. నిచ్చెనలు వేసి... తాళ్ళతో బయటకు తీశారు కాని... మధుకర్ మాత్రం మనసు మార్చుకోలేదు.

తల్లి బెదిరింపులకు మధుకర్ అలవాటు పడిపోయాడు.

అలాగని ఎప్పుడు తల్లిని అశ్రద్ధ చేయలేదు. తల్లంటే ప్రేమ ఉంది. కాని ఆమె విపరీతపు ధోరణికి అతని అభిప్రాయాలు కలవనప్పుడు ఎదురు తిరిగేవాడు.

ఇంట్లో గొడవలు ఎవరితోనూ చెప్పుకోవడం అతనికిష్టం ఉండదు. అందుకే సరాసరి బీచ్‌కి రావడమో... నిర్మానుష్యంగా వున్న ప్రదేశాలలో ఒంటరిగా కాల క్షేపం చెయ్యడమో... పరిపాటయి పోయింది.

కాసేపు కూర్చుని మనసు సేద తీరాక ఇంటి మొహం పట్టాడు మధుకర్.

* * * * * * *

## సెక్స్ సింబల్



చిత్రాలలో సెక్స్ సింబల్‌గా వున్నంత మాత్రాన నష్టమేంటి అంటోంది కిమీకాట్కర్. ఆవిధంగా నటించటంలో తాను అనుభూతి చెందుతుందట. పైగా హాలీవుడ్ తారలంతా సెక్స్ సింబల్స్‌గానే తమ సినీ జీవితాన్ని ఆరంభించారంటోంది.

అన్ని 'రకాల' ఆఫర్లకు కిమీ గ్రీన్ సిగ్నల్ యిస్తోందిప్పుడు. ప్రప్రథమంగా మరాఠీ చిత్రం "ఏక్ ఫుల్... చార్ హాఫ్"లో నటించేందుకు సిద్ధమవుతోంది ఈ సెక్సీతార.

రచయిత్రి రచన అర్ధరాత్రి పన్నెండయినా వ్రాస్తూనే ఉంది. కొత్తగా ఈ మధ్యనే వెలువడిన 'హంస' వారపత్రికకి– చీకట్లో చిన్నదాని చిందులు' అనే నవల వ్రాయడానికి మంచి బిగినింగ్ కోసం ప్రస్తుతం పురిటినొప్పులు పడుతుంది.

ఇరవై రోజుల పైన కేంప్‌కెళ్ళి వచ్చిన తరువాత భార్య తన మనసుని అర్థం చేసుకోకుండా అలా వ్రాసుకు పోవడం చూస్తుంటే ఆ పత్రిక ఎడిటర్ ఎవరో తెలుసుకొని అయ్యా! ఎడిటర్ మహాశయా!మీరు వ్రాయించుకొండి. రచనలు అచ్చు వేయండి. ప్రోత్సాహం యివ్వండి కాని... డబ్బులు మాత్రం యివ్వకండి. అంటే అసలు యివ్వవద్దని కాదు. పేపర్లకి... సిరాకి... రీఫిల్స్‌కి... పోస్టల్ ఖర్చుకి యిస్తే చాలు. అంతేగాని మీరు వందలకి వందలు యిస్తుంటే ఈవిడ పూజల పేరుతో అయ్యే ఖర్చు నేను భరించలేను. ఈవిడ రచనలు చేస్తున్నంత సేపూ పగలు ఉద్యోగంతో తిరిగినా రాత్రిళ్ళు బ్రహ్మచర్యం వహించడం అంటే నావల్లకాదు. ఆవిడ వ్రాస్తున్నంతసేపు నేను 'జై హన్‌మాన్ చాలీసా' వెయ్యి నొక్కసార్లు చదువుకోవాలట. అప్పుడు ఆవిడకలం పలుకుతుందని, అలో చన్ను కొత్తనీరు వచ్చినట్లు ఉబికి ఉబికి వస్తాయట.

రాత్రి ఒంటి గంట దాటుతుంది కాని రచన కలం ఆగడంలేదు. మురళికి అకస్మాత్తుగా ఓ అనుమానం కూడా వచ్చింది. అవునూ! ఆవిడ చెప్పినట్లు హనుమాన్ చాలీసా చదువుతుంటే కొంపతీసి నిజంగానే ఈవిడ కలం విజృంభించడం లేదుకదా!

ఆ అనుమానంతో పుస్తకాన్ని కసిగా... రచన మీదకి గిరవాటు పెట్టాడు. అసలే మంచి మూడ్‌లో దెయ్యం సీన్ వ్రాస్తుందేమో... నిజంగానే తనమీదకి ఎగిరిపడిందన్నట్లుగా కెవ్వున కేక పెట్టి కింద పడిపోయింది రచన.

ఆ కేకకి లక్ష్మణరావు.. సుబ్బలక్ష్మి తలుపు కొట్టడం ప్రారంభించారు. మురళికి వణుకు పుట్టింది. గజగజలాడుతూ తలుపు తీశాడు.

"ఏమిట్రా అబ్బాయి. అలా గజగజ వణుకుతున్నావేమిటి! అయ్యో! అమ్మాయి అలా పడిపోయిందేమిట్రా! ఏవండోయ్ వళ్ళంతా చూడండి. ఎలా ఐసు ముక్కలా అయిపోయిందో! డాక్టర్‌ని తీసుకురండి."

"నీ అసాధ్యం కూలా! ఏమీ భయపడనక్ఖర్లేదు కాని, ఆ కాగితాలు.. పెన్ను... లైట్ చూస్తుంటే తెలియడం లేదూ!?' లక్ష్మణరావు అంటుంటే ఇంతెత్తున ఎగిరిపడింది సుబ్బలక్ష్మి.

"మీ కుళ్ళుబుద్ధి పాడుగానూ. వ్రాసుకుంటే పడిపోవడం ఏమిటే!? ఈ ముదనష్టపోడు ఏదో చేసి ఉంటాడు." అంటున్న సుబ్బలక్ష్మి మాటలకి మురళి చిన్న మొహం చేసుకొని నిజం చెప్పేశాడు.

"ఏం చెయ్యనమ్మా! బయట తిరిగి.... తిరిగి వస్తే, ఒక్క రోజంటే ఒక్క రోజు ముద్దుగా మాట్లాడుతుందా! సరదాగా కబుర్లు చెబుతుందా! మాట్లాడితే సస్పెన్స్ సీరియల్స్ నుండి.... చిన్న పిల్లల కథలు వరకూ ఏకధాటిగా ఉపన్యాసాలు యిస్తుందే కాని... కాపురం సభ్యతగా చేసుకోవాలన్న ధ్యాసే లేదు. నువ్వేమో... మనవడో... మనవడో అంటావు. నేనేం చేయను చెప్పు."

"వెర్రి మొహమా యిప్పటికైనా అర్థం అయిందా?! అసలు ఆ అమ్మాయిని పాడు చేస్తున్నది నువ్వే. మొన్న అత్తలూ– కోడళ్ళూ అనే వ్యాసంలో అత్తగార్లను పొగిడి... కోడళ్ళను కాస్త కింద లెవెల్లోకి వ్రాసిందని దీని సంబరం."

లక్ష్మణరావు మొట్టికాయలు చేతితో వేయకుండా నోటితో వేసి ఆమె బుర్ర వాయగొట్టేస్తున్నాడు.

"మహాప్రభో! మీకు దణ్ణం. నేను మీ చేత ఎన్ని మాటలు అయినా అనిపించుకుంటాను. కాని....

# ఇంటికి శాపం ఇల్లాలే!

అమ్మాయిని ప్రోత్సహించకుండా ఉండలేను. ఎందుకంటే నా మీద మీకు కోపం వస్తే... నాలుగు తిట్టి ఊరుకుంటారు. కాని అమ్మాయలా కాదు. పాతకుల చేత వేయిస్తుంది మొట్టికాయలు."

అంటూ కొడుకుని సాయం చెయ్యమని రచనని మంచం మీద పడుకోబెట్టి మొహం మీద నీళ్ళు చల్లి తలుపేసుకోమని బయట కొచ్చేశారు లక్ష్మణరావు... సుబ్బలక్ష్మి దంపతులు.

5

"సారీ చెబుతున్నానుగా, నువ్విలా మాట్లాడకుండా ఏదో పరాయి మనిషికి చేసినట్టు దూరంగా ఉంటుంటే నాకు బాధగా ఉంటుంది. ఏం చెయ్యను చెప్పు. ఏ మనిషిని అయినా యిష్టం లేకపోతే నొప్పించకుండా చెయ్యాలి కాని.... బాధ పెట్టకాదు. అమ్మతత్వం నీకు తెలుసు. అలాంటి వాళ్ళమాటలు అసలు పట్టించుకో కూడదు."

"అయితేమటుకు నన్నెందుకు కొట్టారు. నాకు చేయి చేసుకొనే మనుష్యులంటే అసహ్యం. నేను మాత్రం అనాలని అనలేదుగా! అయినా నాన్నకి అలా జరగాల్సిందే! ఎందుకంటే ఆయనకేం తక్కు వయిందని అక్కడ... యిక్కడ ఉండటం. ఉద్యోగానికి– ప్రెంచి లీవ్ పడేసి స్నేహితుల మీద చుట్టాల మీద వాలడానికి వెళతాడు. వాళ్ళు పరోక్షంగా తిట్టక పోయినా వెనుక తిట్టుకుంటారు కదా! చుట్టం చూపుకు వెళ్ళిన వాళ్ళు ఎవరికైనా భారంగా మారకూడదు. అతనికి కావలసింది డబ్బు. ఆ డబ్బు పోగెయ్యడానికి వాళ్ళ మీద వీళ్ళ మీద వాలతాడు. పోనీ కుటుంబాన్ని సరిగ్గా చూస్తాడా అంటే అదీ లేదు. కడుపారా ఒక్కళ్ళనీ తిననీయడు. దాంతో పెద్దన్నయ్య చిన్నప్పుడు ఒక్కసారి ఎక్కడో అడుక్కున్నాడట కూడా. అది మాకు తెలిసి సిగ్గుతో కుమిలి పోయాం."

"ఏమో నాకేం తెల్సు. మీ యింటి విషయాలు తెలియడానికి నేను ఎప్పుడూ మీ ఇంటికి రాలేదుగా."

"మీరు రావడానికి వాళ్ళు పిలిస్తేగా! నిజానికి అమ్మకి పిలవాలని ఉన్నా, నాన్న మనల్ని చూసి మనకేదో పెట్టాలనే భయంతో బయటకు చల్లగా జారుకుంటారని అమ్మ పిలవ లేదు. ఇలాంటి విషయాలు ఎవరితో చెప్పుకుంటే ఎవరు తీరుస్తారు చెప్పండి. నా కంటె పెద్దదైన అక్కకి పెళ్ళి అవ్వకుండా, నేను పెళ్ళి చేసుకొని దాని ఎదుట ఎలా నిలబడగలను చెప్పండి. ఒక విధంగా చెప్పాలంటే తనకి పెళ్ళి వయసు దాటి చాలా కాలమైంది. ఉద్యోగం చేస్తుందని..... పెళ్ళయితే ఆమె సంపాదన ఉండదని ఆమెకు సంబంధాలు చూడలేదంటే. మీరు నమ్ముతారా? ఇహ తమ్ముళ్ళిద్దరు చదువులు పూర్తయ్యాయి. ఉద్యోగం రావాలంటే ఎంతో కొంత ముడుపు చెల్లించాలి. ఈయన చెల్లించరు. వాళ్ళు నిరుద్యోగంతో చేతులు నులుముకొని అర్థణాకి... అణాకి అతని దగ్గర చేయి చాపాలి. వీళ్ళు ఒకోసారి ఎదురు తిరుగుతారు. అప్పుడు అమ్మ ఏడ్పులతో యిల్లు యుద్ధ భూమిలా ఉంటుంది."

"ఎన్నోసార్లు మీ యింటి విషయా లడిగినా నువ్వు చెప్పావా? చిన్న నవ్వుతో దాటవేశావు. అవునూ! మీరు ముగ్గురు కదా ఆడపిల్లలు."

"ముగ్గురమే! కాదని ఎవరు చెప్పారు."

"మూడో ఆవిడ ఏం చేస్తుంది."

"ఏం చేస్తుంది. ఓ కాన్వెంట్‌లో ఉద్యోగం చేస్తుంది."

"అయితే బావ మరదులకన్నా... మరదలు పిల్ల చాలా తెలివైందన్న మాట."

"తెలివికేం ఉందండీ! అవసరాన్ని... పరిస్థితులని బట్టి వస్తాయి."

"సర్లే మా ఆఫీసులో ఎప్పుడైనా పోస్టు ఖాళీ అయితే మీ తమ్ముళ్ళకి ఏదైనా ఉద్యోగం చూద్దాం. సరేకాని నా మీద కోపం పోయిందా?"

"ఏం అలాగ అడుగు తున్నారు?"

"ఏం లేదు. ప్రవీణ్ వాళ్ళ బాబు పుట్టిన రోజట. సరదాగా మనల్ని పిలిచాడు."

"దానికేం భాగ్యం. అలాగే వెళదాం" అంటూ త్వర త్వరగా ముస్తాబు అయి స్కూటర్ ఎక్కింది మంగళ.

చిలకా... గోరింకల్లా వెళ్ళడం చూసిన భద్రకాళి మనసు కుతకుతలాడి పోయింది.

"ఏమనుకుంటే ఏం లాభం. అడ్డాల నాడు బిడ్డలు కాని... గెడ్డాలు వచ్చాక మన బిడ్డలా? నా సుఖం.... సౌఖ్యం మానుకొని ఇంతవాడిని చేశాను. విశ్వాసం ఉందా. అయినా నా చాదస్తం కాని తల్లి అల్లం... పెళ్ళాం బెల్లం అని ఊరికే అన్నారా!"

వెనుక నుండి అత్తగారు అంటున్న మాటలు మంగళ చెవిన పడక పోలేదు. కాని మధుకర్ మాత్రం అవేమి పట్టించుకో లేదు.

(ఇంకాఉంది)



## అధునాతన కళ్ళజోడు

కళ్ళలోని భావాలను యిట్టే పసిగట్టే కొత్తరకం కళ్ళజోళ్ళను ఇజ్రేల్ శాస్త్రవేత్తలు కనిపెట్టారు.

ఇజ్రేల్ సాంకేతిక విజ్ఞాన సంస్థ శాస్త్రవేత్తలు కళ్ళ కదలికలను పర్యవేక్షించే విధంగా 'హైఫా' అనే అధునాతన మైన కళ్ళజోళ్ళను అభివృద్ధిపరచారట. పై బొమ్మలో చూపిన విధంగా కళ్ళ కదలికలను విశ్లేషించే కంప్యూటర్లు కూడా ఈ కళ్ళజోళ్ళకు అమర్చి వుంటాయి వికలాంగులకు, అంటు వ్యాధులు సోకిన వారికి సత్వరమే సందేశాలను అందించేందుకు గాను ఈ కళ్ళజోళ్ళను శాస్త్రవేత్తలు కని పెట్టారట.

ఇజ్రేల్‌లో వున్న టెచ్నియన్‌లో వీటిపై జరుగుతున్న పరిశోధనలో – యివి యుద్ధ విమానాల్లో పనిచేసే పైలట్‌లకు తమ విధి నిర్వహణలో బాగా ఉపయుక్తం కాగలవన్న సూచనలు వెల్లడయ్యాయట కూడా.




చిన్ననాటి నుండి చదువులో నాకు బాగా మార్కులొస్తుండేవి. సహజంగ నాదే ఫస్టు మార్కుగా ఉండేది. ఉన్న కొద్దిపాటి పొలం ఆధారంగ చేసుకొని నన్ను చదివించాడు నాన్న.

డిగ్రీ అనంతరం ఎమ్.ఎస్‌సీ. ఫిజిక్సులో చేరాను. రెండేళ్ళు హాస్టలు జీవితంలో రకరకాల విద్యార్థులు వారి మనస్తత్వాలు గమనించడం జరిగింది. కొందరు పుస్తకాల పురుగులయిపోతే, పుస్తకాలంటేనే మరికొందరికి ఎలర్జీ. కొంత మందిని చూస్తే "వీరు విద్యార్థులేనా!" అనిపించేది. కాని పరీక్షలు వచ్చేసరికి అందరికి మార్కులు బాగానే వచ్చేవి. ప్రొఫెసర్లని బెదిరించి మార్కులు వేయించుకుంటారని కొంత మందిని గూర్చి హాస్టలులో అనుకునేవారు. అలాంటి వారిలో ప్రకాశం ఒకడు.

శేషాద్రి బ్లాకులో నాది ఇరవయిమూడో నంబరు గది. ప్రకాశం యిరవయి అయిదులో ఉండేవాడు. మొత్తానికి ఏదో ఆర్ట్సు సబ్జెక్టు. ఏనాడూ క్లాసుకు వెళ్ళేవాడు కాదు. వెళ్ళినా అటెండెన్సు యిచ్చి వచ్చేవాడు. చదువు అనేది అతని డైరీలో లేదు. యూనివర్సిటీ రాజకీయాలన్నీ అతని గదిలోనే ఉండేవి. ప్రక్క హాస్టలు విద్యార్థులు, వెటర్నరీ, మెడికల్, ఇంజినీరింగ్....ఎవరెవరో వస్తుండేవారు. ఎక్కడ ఏ గొడవ జరిగినా, జరగాలన్నా అతని ప్రమేయం తప్పక ఉండేది. బాగా చిల్లరగా తిరుగుతుండేవాడు.

ఆ గదిలో ఎప్పుడూ ఏదో ఒక చర్చ జరుగుతుండేది. కనుక అతని రూం మేటు నా గదికి వచ్చి చదువుకునేవాడు. ఒక్కోసారి మెస్‌కు వెళ్ళేసమయంలో వాళ్ళ గదిలో జరిగే విషయాలు, గొడవలను గూర్చి నాతో చెప్పేవాడు. ప్రకాశం ప్రస్తుతం బీదవాడని, యీ చిల్లర రాజకీయాల వలన అతనికి కొంత ముడుతుందని, ఒకసారి ప్రొఫెసరు మందలిస్తే ఆయన కొడుకుని రౌడీల చేత తన్నించాడని....ఏవేవో చెప్తుండేవాడు.

పరీక్షలయ్యాయి. నాకు క్లాసు ఫస్టు ర్యాంకు వచ్చింది. ప్రకాశంకు కూడా ఫస్టు క్లాసు వచ్చిందని అంతా చెప్పుకున్నారు.

ప్రొఫెసర్ల ప్రోద్బలంతో యు.జి.సి. స్కాలర్ షిప్ మీద రిసర్చ్‌లో చేరాను. మూడేళ్ళలో డాక్టరేట్ వచ్చింది.

ఈ మధ్య కాలంలో మా యింటి వాతావరణంలో చాలా మార్పులొచ్చాయి. వరుసగా మూడు సంవత్సరాలు పంటలు సరిగా పండకపోవడం మూలాన నాన్న కొన్ని అప్పులు చేయాల్సి వచ్చింది. అప్పు తీర్చడానికి ఏదయినా వాణిజ్య పంటవేస్తే బావుంటుందని భావించి ప్రత్తి నాటితే మొదలంట నష్టం వచ్చి వడ్డీలు పెరిగి అప్పుల వారి ఒత్తిడికి తట్టుకొనలేక ఉన్న కాస్త పొలం అమ్మ వలసి వచ్చింది. సన్నకారు రైతులందరి పరిస్థితి దాదాపు యిలాగే అయిపోయింది.

కుటుంబ పోషణ చెయ్యలేక, స్వగ్రామంలోనే మరో చిన్న పని చేయడానికి మనసొప్పక రెండు పాడిగేదెల్ని తోలుకొని గుంటూరు శివార్లలో ఒకపాకలో కాపురం పెట్టాం. తమ్ముడ్ని హైస్కూలులో చేర్చాం. అమ్మా, నాన్న గేదెల పని చేసుకుంటూ ప్రక్కనే గల ప్రత్తి మిల్లులో మురా పనికి పోసాగారు. నేను పాలు తీసుకొని కొన్ని యిళ్ళు ఖాతాలుగా పోస్తూ, ప్రతిరోజు లైబ్ర

రిలోని వార్తా పత్రికలలో అడ్వర్‌టైజ్‌మెంట్లు చూసి ఉద్యోగాలకు అప్లయి చేయసాగాను. ఇంటర్వ్యూలకు శక్తికి మించిన చార్జీలు పెట్ట వలసి వస్తోంది. కాని ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. ప్రతి కాంపెటీటివ్ ఎగ్జామినేషన్ వ్రాస్తున్నాను. రోజులు దొర్లుతున్నాయి.

తల్లిదండ్రులు మిల్లులో కూలి చేసి సంపాయించే డబ్బు కుటుంబ ఖర్చులకు సరిపోతే, పొల మీద వచ్చే ఆదాయం నా ఉద్యోగ దరఖాస్తులకు, ఇంటర్వ్యూ ప్రయాణ ఖర్చులకు సరిపోయేది.

మూడు సంవత్సరాలు గడిచాయి. వివిధ యింటర్వ్యూలలో అధినేతల చేతుల మురికి తగిలి నా సర్టిఫికేట్లు మైలబడినాయి. కాని ఉద్యోగం ఆర్డరు ఎక్కడ నుండీ రాలేదు. క్రమంగా, ఉద్యోగం దొరుకుతుందనే ఆశ సన్నగిల్లి "ఏదయినా ట్యుటోరియల్ కాలేజీలో చేరితే కొంత ఉపయోగముంటుంద"నే ఆశ, ఆలోచన కలిగాయి.

లైబ్రరీలో న్యూస్ పేపరు తిరగేస్తుంటే వాంటెడ్ కాలంలో ఒక స్థానిక రెసిడెన్షియల్ కళాశాలలో ఫిజిక్స్ టీచరు ఉద్యోగం పడింది. జీతం రెండు వేలిస్తామని కూడా రాసి ఉంది.

మరుక్షణంలో దరఖాస్తు ఫారం పంపాను. పక్షం రోజులలో యింటర్వ్యూ కార్డు అందింది. వెళ్ళాను.

ఊరికి చివర దూరంగ అధునాతనంగా నిర్మించిన బిల్డింగుల సముదాయమది. అదొక ట్యుటోరియల్ కాలేజి అనిపించటం లేదు. ఒక ప్రొఫెషనల్ కాలేజీలాగ ఉంది. క్లాసు రూంలలో పాలిష్ చేసిన బెంచీలు, పైన ఫ్యానులు, కొన్ని గదులకు ఎయిర్ కూలర్లు, మంచినీటికి వాటర్ కూలర్లు ఉన్నాయి.

## రాణించిన ప్రతిభ

ప్రక్కనే హాస్టలు వివిధ ఆధునిక వసతులతో ఉంది.

ఉద్యోగానికి పాతిక మందిదాకా అభ్యర్థులు వచ్చారు. అందరూ మంచి క్వాలిఫికేషను ఉన్నవారే! అంతా ఒక చల్లని గదిలో కూర్చున్నాం. ఒక్కొక్కరే డైరెక్టరు గదిలోకి వెళ్ళి వస్తున్నారు. నా వంతు వచ్చింది.

ఎయిర్‌కండిషన్డ్ గదిలోకి అడుగు పెట్టాను. ఎదురుగా డైరెక్టరు రేవాల్వింగ్ చెయిర్‌లో కూర్చున్నాడు. యిరువైపుల యిద్దరు మెంబర్లు ఉన్నారు. డైరెక్టరు ముఖంలోకి చూసి స్థాణువునయి పోయాను. అతనుకూడా నన్ను చూసి ఒక్క క్షణం సాలోచనగా ఉండిపోయి "మరోగంటలో యీ తతంగమంతా పూర్తవుతుంది. సాయంత్రం వరకు ఉండండి, మీతో వేరే మాట్లాడాలి!" అన్నాడు.

ప్రకాశం నన్ను గుర్తించాడనిపించింది.

మధ్యాహ్నం మూడు గంటల కంతా ఇంటర్వ్యూకి వచ్చిన అభ్యర్థులు ఎటువారలటు మెల్లమెల్లగా వెళ్ళిపోయారు. ఏ విషయం తమ చిరునామాలకు తెలియ పరుస్తామన్నారు.

సాయంత్రం అయిదు గంటలు కావచ్చింది. "డైరెక్టరుగారు రమ్మంటున్నారయ్యా!" అన్నాడు ఒకతను పరుగెత్తుకుంటూ వచ్చి. బహుశ వాచ్‌మన్ అయి ఉంటాడు.

లోనకు వెళ్ళాను. మిగతా యిద్దరు మెంబర్లు కూడా వెళ్ళిపోయినట్లున్నారు. లేచి సాదరంగ కరచాలనం చేశాడు-కూర్చున్నాను.

జవాను బిస్కెట్లు, కూల్‌డ్రింక్ తెచ్చాడు. వద్దనకుండ ఆరగించాను.

"బావున్నావా రామం! ఏం చేస్తున్నావు!" అన్నాడు.

నా నుండి ఏ సమాధానం రాకపోయేసరికి తానే తిరిగి చెప్పసాగాడు.

"నీ పరిస్థితి నాకర్థమయింది. కాని నేనాశ్చర్యపడడంలేదు. నా గురించి కూడా నీకు కొంత బోధపడి ఉండవచ్చు. నాకెక్కడా ఉద్యోగం దొరకదని ముందుగానే తెలుసు. ఎమ్.ఏ. కాగానే గుంటూరు చేరి ఒక అద్దె యింట్లో ట్యూషన్లు చెబుతూ, సైడ్ బిజినెస్‌గా ప్లాట్ల వ్యాపారం చేయసాగాను. రాత్రింబవళ్ళు శ్రమించి చదివించడం ద్వారా ఆ సంవత్సరం విద్యార్థులంతా పాసయ్యారు. ప్లాట్ల వ్యాపారంలో వచ్చిన లాభం రెండు లక్షలు పెట్టి కొంత స్థలం కొని సొంత పాకలలో ట్యుటోరియల్ కాలేజి పెట్టాను. మొదటి సంవత్సరం బాగా రిజల్టు వచ్చినందు వలన స్ట్రెంత్ పెరిగింది. నేను కూడా రేటు పెంచి రెసిడెన్షియల్ కాలేజి చేశాను.

వెంటనే యింజనీరింగ్, మెడికల్ ఎంట్రన్సు కోచింగ్ కూడా పెట్టాను. సంవత్సరానికి నా దగ్గర సుమారు నాలుగు వేల మంది విద్యార్థులు కోచింగ్‌కు చేరతారు. ముప్పయి రోజులకుగాను ఒక్కొక్కరి దగ్గర ఎనిమిది వందలు ఫీజు వసూలు చేస్తాను. అంటే ఆ నెలలో నాకు ముప్పయి లక్షలపైచిలుకు వసూలవుతుందన్నమాట! సుమారు పది లక్షలు కోచింగ్ టీచర్లకు ఖర్చవుతుంది. ఇన్‌కంటాక్స్, కమర్షియల్ టాక్సు ఆఫీసుల్లో

కొందరు నా భృత్యులుంటారు. వారందరకు భూతశాంతిగా సుమారు ఒక లక్ష ఖర్చవుతుంది. ఖర్చులన్నీ పోను ఆ నెలలో నాకు యిరవయి లక్షల రూపాయిలు మిగులుతాయి.

ఇందులో మరొక చిట్కా ఉంది. కొందరు తల్లిదండ్రులకు తమ పిల్లలు ఏ యింజినీరో లేక డాక్టరో కావాలని ప్రగాఢ ఆకాంక్ష ఉంటుంది. వారి వద్ద నలభయి నుండి యాభయి వేల వరకు వసూలు చేస్తాను. సీటు వస్తే ఆ డబ్బు వారు వదులుకుంటారు. లేదా వారి డబ్బు తిరిగిచ్చేస్తాను. ఇలాంటి వారు సంవత్సరానికి సుమారు పది మంది తగులుతారు. సాధ్యమయినంత వరకు అందరికీ సీటువచ్చేది. ప్రతి కాలేజీలో నా భృత్యులు అంటే నా దగ్గర కోచింగ్ యిచ్చేవారు ఉంటారు. కొన్ని ప్రైవేటు కాలేజీలలో వారు నా ఏజెంట్స్‌గ పని చేసి కొందరకు సహాయం చేస్తారు. అయితే గత రెండు మూడు సంవత్సరముల నుండి ప్రభుత్వం తీసుకున్న చర్యల మూలంగా యిక్కడ నాకు కొంత ప్రతికూలత ఏర్పడింది. అయినప్పటికి ఏ రూపంలో చూచినా నా ఆదాయం చాల ఎక్కువ.

ఫలితంగ ముప్పయి ఎకరాల స్థలం కొని అందులో మూడంతస్తుల భవనాలు లేపకలిగాను. ఇప్పుడు నేను ఓ కోటీశ్వరుడ్ని.

ఇంకా చెప్పాలంటే చాలా రహస్యాలున్నాయి. ఇక నీ ఉద్యోగం సంగతి! ఈ ఉద్యోగానికి పాతిక వేల దాకా లంచం యిస్తామంటున్నారు కొందరు. కాని నాకు కావలసింది నీలాంటి మేధావులు, గోల్డు మెడలిస్టులు. నీకు యీ ఉద్యోగం యిద్దామని నిర్ణయించుకున్నాను. కాని యిది ఒక వ్యాపార సంస్థ కనుక ఒక నిబంధన ఉంది. నీ సర్టిఫికెట్లు నాకిచ్చివేయాలి! కనీసం ఐదు సంవత్సరాలు యిక్కడ పనిచేస్తానని, అలా చేయలేని పక్షంలో పదివేలు నష్టపరిహారం చెల్లిస్తానని బాండు రాసివ్వాలి. ఈ నిబంధనలకు ఒప్పుకుంటే సోమవారం నుండి క్లాసులు తీసుకోవచ్చు. ఇప్పుడే సమాధానం చెప్పాల్సిన అవసరం లేదు. ఆలోచించి చెప్పవచ్చు!" అన్నాడు.

రూంలో నుండి బయటకు వచ్చేసరికి సాయంత్రం ఆరుగంటలయింది. ఇంటి దారి పట్టాను.

ప్రకాశం మాటలు వినిన తరువాత ట్యుటోరియల్ కాలేజీల భాగోతం అవగతమయింది. నా చిన్న తనంలో యిలాంటి తళుకు బెళుకులతో ట్యుటోరియల్ కాలేజీలుండేవి కాదు. ఎక్కడో ఒక ప్రైవేటు మాస్టరు ట్యూషన్లు చెప్పుకునేవాడు. మరి యిప్పుడో, ప్రతి టౌనులో ప్రతి వీధి, ప్రతి సందు, ప్రతిగొందిలో యీ ట్యుటోరియల్ కాలేజీ బోర్డుల తోరణాలు వ్రేలాడుతున్నాయి. ఆ బోర్డులు పట్టుకొని కొందరు వ్రేలాడుతుంటారు. వీటిల్లో కూడ ఎన్నో స్పర్థలు అంతర్యుద్ధాలుంటాయని వినికిడి. యిదంతా ఒక రేస్‌కోర్సులాగ తయారయింది. విద్యాలయాలు సరిగ పనిచేయకపోవటం దీనికి కారణంగ పలువురు అభిప్రాయపడుతుంటారు.

ఇదంతా ఒక సుడిగాలిలో చిక్కుకోవడమనిపించింది. ఇందులో చేరితే నా ప్రతిభకు రాణింపు ఉండదని భావించాను. 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' నానుడి ప్రకారం నా ప్రతిభకు తగిన వేరే ఉద్యోగం వస్తుందనే నమ్మకం కలిగింది.

సంధ్యా చీకట్లు క్రమ్ముకొస్తున్నాయి. నాన్న దారి చూస్తున్నాడు. కాళ్ళు కడుక్కొని ముంగిలిలో మంచం మీద కూర్చున్నాను.

"ఏమయింది బాబూ!" అన్నట్లుంది నాన్న చూపు ఆ మసక చీకట్లో!

"లాభంలేదు నాన్నా! వాళ్ళ బంధువులబ్బాయికే ఉద్యోగం యిచ్చుకున్నారు!" అన్నాను.

అబద్ధం చెబుతున్నాననే బాధను దిగమ్రింగాను. కాని యిది నా మొదటి అబద్ధం, పైగా నాన్నతో!

పది రోజులు గడిచాయి. ఖాతా యిళ్ళల్లో పాలు అందించి, లైబ్రరీకి వెళ్ళి న్యూస్ పేపరు అందుకున్నాను. మొదటి పేజీలో 'ట్యుటోరియల్ కాలేజీ పేరుతో ప్రభుత్వాన్ని, ప్రజల్ని మోసం చేస్తున్న ప్రకాశం అరెస్టు!' అని పెద్ద-పెద్ద అక్షరాలలో వార్త ప్రింటయి ఉంది.

విద్య పేరుతో వ్యాపారం చేశాడని, ఆదాయం లెక్కలు సరిగ చూపి పన్ను చెల్లించలేదని, కాంపెటీటివ్ ఎగ్జామినేషన్ సెంటర్‌లలో చీఫ్ సూపరింటెండెంటును యిన్విజిలేటర్లను లాలూచీ పర్చడానికి ప్రయత్నించాడని, అతని యింట్లో లైసెన్సు, బిల్లులేని విదేశీ వస్తువులు, అక్రమంగా బంగారు బిస్కెట్లు, విదేశీ కరెన్సీ, రకరకాల దస్తావేజులు, బ్యాంకు డిపాజిట్ పత్రాలు దొరికాయని దోషారోపణ చేయబడింది.

నేనే మాత్రం ఆశ్చర్యపడలేదు. ఖాళీ పాల క్యానులు సైకిలుకు తగిలించుకొని బయలుదేరాను. బజారు కూడళ్ళలో, హోటళ్ళ ముందు ఎక్కడ చూచినా ప్రజలు యీ విషయమే రకరకాలుగా చర్చించుకుంటున్నారు.

ఇల్లు చేరి ముఖం కడుక్కొని లోనకు వెళ్ళి మంచం మీద కూర్చున్నాను.

"అన్నం వడ్డించ నా!" అంది అమ్మ.

"కొంచెము ఆగి భోం చేస్తానమ్మా! ఎండలో వచ్చాను గదా! కాసిని మంచినీళ్ళివ్వు!" అన్నాను.

"మర్చిపోయాను నాయనా! పొద్దున నీకేదో ఉత్తరం వచ్చింది!" అంటూ తెచ్చి యిచ్చింది అమ్మ మంచినీళ్ళతోపాటు.

నీళ్ళు త్రాగి కవరు విప్పాను. ఐ.ఏ.ఎస్. సెలెక్షన్ లెటర్ వచ్చింది.

"భగవంతుడా! నాకు ఎంత మంచి ఆలోచన కలిగించావు! ఆ ప్రకాశం సుడిగాలిలో యిరుక్కొని సర్టిఫికేట్లు కూడా యిచ్చేసి ఉంటే, ఎక్కడ చతికిల పడేవాడినో కదా!" అని భావిస్తూ, నా ప్రతిభ నిజంగా రాణించినందులకు ఆపరంధాముని హృదయ పుష్పంతో ఆరాధిస్తూ కళ్ళు మూసుకున్నాను.

"ఏమిటి నాయనా ఉత్తరం!" అంది అమ్మ నా నిశ్చలావస్థని గమనించి

"నాకు ఉద్యోగం వచ్చిందమ్మా! మంచి ఉద్యోగం!" అంటూ అమ్మకేసి చూశాను.

ప్రశాంతంగా ఉంది అమ్మ ముఖం ◯



## ఆరు సెంచురీలు నాటౌట్

తెలుగు హాస్యనటుడు డా. అల్లు రామలింగయ్య 600 చిత్రాలు పూర్తి చేశారు. 30 సంవత్సరాల క్రితం అల్లు చిత్రరంగంలోకి అడుగుపెట్టాడు. పద్మశ్రీ అల్లు రికార్డు యిలా వుండగా మరో దక్షిణాది హాస్యనటి మనోరమ చిత్రరంగంలోకి ప్రవేశించి 27 సంవత్సరాలే అయినా వెయ్యి చిత్రాలకు పైగా నటించిందట. ప్రపంచ రికార్డులు చోటు చేసుకొనే గిన్నిస్ పుస్తకంలోకి ఎక్కేందుకు మనోరమ ప్రయత్నిస్తోందట. మగ పేర్లలో శ్రీ అల్లు రామలింగయ్య పేరు ఎక్కుతుందేమో మరి.



# లవ్ గేమ్



చల్లా సుబ్రహ్మణ్యం

సరిగ్గా ఏడు పదిహేనుకి ఆ ఇంటికి ఫర్లాంగు దూరంలో టాక్సీ దిగి నడుచుకుంటూ ఇంటికొచ్చాడు స్వాగత్.

తోటలో అతని కోసమే ఎదురు చూస్తున్న తోటమాలి- ఇంటి వెనక్కి రమ్మని సైగ చేశాడు. స్వాగత్ ఇంటి వెనకున్న కొబ్బరి చెట్టు దగ్గరకెళ్ళి-

"తెచ్చావా?" అనడిగాడు తోటమాలిని.

"తెచ్చాను బాబూ... ఇంద..." మూట కట్టిన ఓ చిన్న గోనె సంచిని చూపించాడు.

"వెరీ గుడ్! నల్లదేనా?"

"నల్లదే బాబూ... నిఖార్సయిన నలుపు"-

"వెరీ గుడ్! చెప్పింది గుర్తుందిగా- ఏమాత్రం పొరపాటు జరిగినా- నా సంగతి తెలుసుగా?"

"తెలుసు బాబూ... పొరపాటు జరగదు"-

వాచీ చూసుకున్నాడు స్వాగత్.

ఏడు- ఇరవైమూడు.

ఇంకా ఏడు నిముషాలు టైముంది.

అతనికి చెప్పాల్సిన జాగ్రత్తలన్నీ చెప్పి-నెమ్మదిగా ఇంటి ముందుకొచ్చాడు. వస్తూ- హాల్లోకి చూశాడు.

తన ఊహ కరక్టే!

వీడియోలో 'ఎగ్జార్సిస్ట్' సినిమా చూస్తోంది నవ్య.

అప్పటికి-

ఈవిల్ డెడ్- ఓమెన్- డ్రాకులా సీరీస్- నైట్‌మేర్ క్యాసెట్లన్నీ చూసేసినట్టు పక్కన పడేసి ఉన్నాయి.

అవునుమరి.

ఆ క్యాసెట్లు తప్ప వేరే ఏవీ లేకుండా చేశాడు

(గత సంచిక తరువాయి)

తను. చచ్చినట్టు వాటిని చూసి తీరాలి. తన తెలివితేటలకు తననే అభినందించుకుని- మెల్లగా- పిల్లిలా ఇంట్లోకి ప్రవేశించాడు.

ఇంకా రెండు నిముషాలు టైముంది.

అతను ఊపిరి బిగబట్టి- ఆమెకు కనపడకుండా హాలు గుమ్మంలో నిలబడ్డాడు.

ఒక్క నిముషం!

ఒకే ఒక్క నిముషంలో- నవ్య కౌగిలిలోని ఆనందాన్ని తాను చవిచూడబోతున్నాడు. ఆమెకు మగవాడి స్పర్శ ఎలా ఉంటుందో రుచి చూపించబోతున్నాడు.

సరిగ్గా ఏడున్నర-

మరుక్షణంలో అంతా అంధకారం!!

"థాంక్యూ.... యాదీ...." గొణుక్కున్నాడతను.

లోపల గదిలో- ఓ నిముషం క్రితం- ఈవిల్ స్పిరిట్ హీరోయిన్‌ని ఆవహించే సన్నివేశం జరుగుతోంది. దానికి గుర్తుగా కిటికీలోంచి నల్లపిల్లి కిటికీ అద్దాల్ని పగులగొట్టుకుని హీరోయిన్ గదిలోకి వచ్చింది.

చీకట్లో దాని కళ్ళు పచ్చగా మెరుస్తున్నాయి.

ఊపిరి బిగబట్టి చూస్తోందామె.

ఒక్క క్షణం అంధకారం ఆవహించడంతో ఉలిక్కిపడింది. సరిగ్గా ఈవిల్ స్పిరిట్ రాబోయే ముందు సినిమాలో కూడా ఇలాగే కరెంట్ పోతుంది.

భయంగా లేచి నిల్చుందామె.

సరిగ్గా అప్పుడు-

కిటికీ అద్దాలు భళ్ళుమని పగిలాయి.

కెవ్వుమన్న కేక ఆమె కంఠంలోనే నిక్షిప్తమైపోయి- అలాగే భయంతో వణికిపోతూ చూస్తోంది.

అప్పుడు వినిపించిందామెకు.

"మ్యా....వ్...." అన్న శబ్దం.

భయంతో రక్తం గడ్డ కట్టుకుపోతుండగా-అలాగే చూస్తోందామె.

ఆ వెంటనే పగిలిన గాజు కిటికీలోంచి-

రెండు పచ్చటి కళ్ళు- రేడియంలా మెరుస్తూ-

తననే తదేకంగా చూస్తూ- భయంకరంగా వినిపించింది.

"మ్యా....వ్..."

ఆమె కెవ్వున కేకేసింది.

మీనాక్షి మాటలు గుర్తొచ్చాయి.

"ఈ ఇంటికేదో దుష్టశక్తి ఆవహించింది. శాంతి చేయాలి"- నిలువునా వణికిపోతుండగా -అప్పుడొచ్చాడు స్వాగత్.

"ఏమైంది నవ్యా! కరెంట్ పోయిందా?"

అతని మాటలు పూర్తికాలేదు.

ఆమె గట్టిగా- బలంగా అతన్ని కౌగలించుకుంది.

"థాంగాడ్!" మనస్సులోనే అనుకుంటూ ఆమెను తనివితీరా హత్తుకుని ఆమె వీపు మీద తన కుడి చేత్తో రాస్తూ-

ఎడమ చేత్తో ఆమెను మరింతగా దగ్గరకు జరుపుకుంటూ-

"యాదగిర్ని ఇంకో ఐదు నిముషాలు ఆపమని అడిగితే బాగుండేది"- అనుకుంటూ- ఆమెను గాఢంగా- తమకంతో ఆబగా- ఆశగా- కౌగలించుకుని- ఆనందసాగరంలో తేలిపోతుండగా

అప్పుడొచ్చాయి లైట్స్!!

కళ్ళు మూసుకుని పరవశించిపోతున్న అతనికి కరెంట్ వచ్చిన సంగతి తెలీదు. ఆకాశమార్గాన మేఘాల రథం మీద పిల్లగాలుల మధ్య తేలిపోతూ- గంధర్వలోకానికి- స్వర్గానికి- అడ్రస్ వెదుక్కునే సమయంలో వినిపించిందతనికి-

"రాస్కెల్ ఎవర్రా నువ్వు?"

తటాలున కళ్ళు తెరిచి చూశాడతను.

పిడుగుపడ్డట్టు అదిరిపడి-

"మీరు... మీరెవరు?" అన్నాడు.

"నేనెవరో చెప్తాను. ముందు నువ్వెవరో చెప్పరా రాస్కెల్!"

ఆమె వంగి చెప్పు తీస్తోంది.

**ఇంతవరకూ సాగినకథ -: 6** పెళ్ళయిన భార్యాభర్తలు ఆనందలోకాల్లో విహరించే మధురాతి మధురమైన తొలిరోజు అనుభవాలను చవిచూడాలనుకున్న స్వాగత్‌కు భార్య నవ్య నుంచి ఊహించని వ్యతిరేకత ఎదురవుతుంది. ఏడాది తర్వాత విడాకులు తీసుకోవాలన్న నిర్ణయానికి కట్టుబడి వేరే కాపురం పెట్టాడు స్వాగత్. నవ్య బావ మన్మధరావు పైలాపచ్చీసుగా తిరుగుతూ లాడ్జిలో పోలీసులకు దొరుకుతాడు. నవ్యను ఎలాగైనా తన ఒడిలోకి చేర్చుకోవాలని పథకాలు వేస్తుంటాడు స్వాగత్.

పరిస్థితి అర్థం చేసుకున్న స్వాగత్-

"ప్లీజ్- మీరెవరో చెప్పండి. ఆవేశపడకండి ఎక్కడో-ఏదో పొరపాటు జరిగుంటుంది"-అన్నాడు.

"అయాం శ్రీమతి.... మిస్ శ్రీమతి ..." అందామె.

"ఐసీ... అయితే ఇక్కడికెందుకొచ్చారు?" అడిగాడతను ఆశ్చర్యంగా.

"ఆ మాటడగడానికి నువ్వెవడివి? నా ఇష్టం. ఎందుకయినా వస్తాను" అందామె కోపంగా.

అప్పుడొచ్చింది నవ్య చేతిలో కాఫీ కప్పుతో-

అతనికంతా అయోమయంగా ఉంది.

కరెంట్ పోవడానికి మూడు నిముషాల ముందు




ఆమె వీడియో చూడ్డం తాను కళ్ళారా చూశాడు ఇంతలో ఈ మార్పెలా జరిగింది?

"ఏమైంది శ్రీమతీ?" అడిగింది నవ్య

"ఈ స్టుపిడ్ కరెంట్ పోయినప్పుడు దొంగలా గదిలోకి వచ్చి నన్ను కౌగలించుకున్నాడు"- అంది శ్రీమతి ఆవేశంతో

"అబద్ధం! అరిచాడు స్వాగత్

"మీరు రెండు అబద్ధాలు ఆడుతున్నారు" అన్నాడతను

"ఏంటవి?"

"ఒకటి నేను దొంగలా రాలేదు రెండు నేను మిమ్మల్ని కౌగలించుకోలేదు మీరే నన్ను కౌగలించుకున్నారు"-

"షటప్ అండ్ గెటౌట్!" అరిచింది శ్రీమతి

"నా ఇంట్లోంచి నన్ను వెళ్ళమనడానికి- అసలు మీరెవరో తెలుసుకోవచ్చా మేడమ్?" చిన్నగా నవ్వుతూ అన్నాడు స్వాగత్

శ్రీమతి ముఖంలో రంగులు మారాయి

కొన్ని క్షణాలు అలాగే అతన్ని చూస్తుండిపోయి- ఆ తర్వాత తేరుకుని "

"అంటే మీరు " అంది

"నా పేరు స్వాగత్. ఈ ఇంటి యజమాన్ని అఫ్‌కోర్స్ ఈ ఇంటి ఇల్లాలికూడా" శ్రీమతి చప్పున అతని చేతులు పట్టుకుని-

"ప్లీజ్ నన్ను క్షమించండి మీరెవరో తెలీక ఇష్టమొచ్చినట్టు వాగాను" అంది

"క్షమించాల్సిన తప్పు మీరేం చేశారు?" అన్నాడతను

"నోటికొచ్చినట్టు తిట్టాను గదా"- అందామె

"వెధవ తిట్లదేముందిలెండి రెండు నిముషాల ఆనందం ముందు. రెండు తిట్లు పెద్ద గొప్పవేం

కావు"- అన్నాడు నవ్వుతూ.

"రెండు నిముషాల ఆనందమేవిటి?" అర్థం కాక అడిగిందామె.

అతను నవ్య కళ్ళలో కనిపిస్తున్న ద్వేషాన్ని గమనించాడతను.

"బై ది బై... ఇంతకీ మీరు నవ్య స్నేహితురాలా? లేక నా ఫ్రెండా?" అన్నాడు నవ్వుతూ.

"పరిచయం చేయవేమే రాస్కెల్! అలా బొమ్మలా నిల్చుంటావేం?" అంది శ్రీమతి.

"ఎందుకులెండి. మన పరిచయం. కరెంట్ పోయినప్పుడే జరిగిపోయిందిగా? శ్రీమతి ముఖం ఎర్రబడింది.

"అసలప్పటి వరకూ. ఇద్దరం కలిసి కూర్చుని చూస్తున్నాం ఆ సినిమాని. అప్పుడే- కాఫీ తెస్తానని వెళ్ళింది నవ్య. అంతలో కరెంట్ పోవడం- ఈ ఇంటికి దుష్టశక్తి ఆవహించిందన్న మీనాక్షిగారి మాటలు గుర్తు రావడం- సరిగ్గా అప్పుడే ఆ వెధవ పిల్లి రావడంతో భయమేసి- అలా చేశాను. సారీ" అందామె.

అంటే ఇంతకు ముందు తాను చూసింది నవ్యను కాదన్నమాట. అటు తిరిగి కూర్చోవడం వల్ల తాను నవ్యనుకున్నాడు.

"మ్యావ్!"

అంతా అటు తిరిగి చూశారు.

టేబుల్ కింద కూర్చుని స్వాగత్ వేపు దిగులుగా చూస్తూ అరుస్తోంది- నల్లపిల్లి!!

* * * *

"ఐసీ... ఇదన్న మాట అసలు జరిగిన కథ!"

నవ్య చెప్పిందంతా విని- సాలోచనగా తల ఊపి అంది శ్రీమతి.

మధ్యాహ్నం ఒంటి గంటవుతోంది.

మీనాక్షి అక్కినేని నాగేశ్వర్రావు విశేషాలు చెప్పి చెప్పి అలసిపోయి నిద్రపోతోంది.

ఇంట్లో ఎవరూ లేరు.

అందుకే తన కథంతా నాన్ స్టాప్‌గా చెప్పగలిగింది నవ్య.

"శ్రీమతీ! నువ్వు తప్ప నాకు సాయపడేవాళ్ళెవరూ లేరు"- అంది నవ్య.

"అయితే నాకిక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయడం-రీజనల్ మేనేజర్‌గా ప్రమోట్ చేయడం- అంతా కలిసొచ్చిందే ఇడియట్. ఇక నువ్వేం దిగులుపడకు-అంతా నాకొదిలెయ్-"

ఉత్సాహంగా అంది శ్రీమతి.

"అంటే- ఏం చేద్దామంటావ్?" ఆశగా అడిగింది నవ్య.

"అతను తొందరపడి నీ మీద అఘాయిత్యం చేసేడిపా?"

"అబ్బే అదేం లేదు. ఇప్పటివరకలాంటి ప్రమాదం లేదు"-

"అయితే నో ప్రాబ్లమ్! కానీ ఒక్క విషయం గుర్తు పెట్టుకో- మగాడు పెళ్ళాలతో అవసరం లేనంత మాత్రాన దిగులువడుతూ కూర్చునే జీవి

## లవ్ గేమ్

కాదు. బయట చాలామంది పెళ్ళాలతో తన అవసరం తీర్చుకునే అవకాశం- అక్కడ కూడా సమాజం వాడికి కల్పించింది. అంచేత- నీ మొగుడు...."

"ప్లీజ్ అలా పిలవకు. నాకు కంపరంగా ఉంది"- అంది నవ్య.

"ఇట్సాల్ రైట్- అయితే నా మొగుడని పిలవనా?"

"జోకులేయకు- నాకు ఒళ్ళు మంట-" సీరియస్‌గా అంది నవ్య.

"అలాగే చెప్పేది వింటావా- లేకపోతే నీకు ఒళ్ళు ఎప్పుడెప్పుడు మండేదీ లిస్ట్ చెప్తావా?"

"శ్రీమతీ!" కోపంగా అంది నవ్య.

"వెరీ గుడ్! చెప్పేది విను. అంచేత నీ మొగు.. సారీ... అతను ముభావంగా నువ్వంటున్నంత మాత్రాన దిగులుతో కుంగిపోతున్నాడని అనుకోకు- నేను చూశాను గదా- హి ఈజ్ హేపీ!

"అయితే నన్నేం చేయమంటావ్?" చిరాగ్గా అంది

"చెప్పేది వినవే రాస్కెల్- అంచేత అతన్ని క్షణం క్షణం చిత్రవధ చేయాలి-"

"అంటే- ఎలా?" ఉత్సాహంగా అడిగింది నవ్య.

"ఏమీ లేదు నీ పొందు కోసం- కనీసం- నీ కౌగిలింత కోసం అతను తహ తహలాడి పోతున్నాడన్నది నేను గమనించిన విషయం"-

"ఎలా చెప్పగలవ్?" ఆసక్తిగా అడిగింది నవ్య.

"అతని కౌగిలింతను ఎప్పుడైనా అనుభవించావా?" సూటిగా చూస్తూ అందామె

"ఛీ.... ఛీ...." అసహ్యంగా ముఖం పెట్టి అంది నవ్య.

"అంచేత నీకు తెలీదు గనుక నోరు మూసుకుని విను- అతన్ని టీజ్ చేసి ఏడిపించాలి- అందినట్టే అంది- ఆశ చూపించి- మానవుణ్ణి పిచ్చివాణ్ణి చేసి జారిపోవాలి ఓ క్షణం ఆనందంగా ఉంచి మరుక్షణం చావు దెబ్బ కొట్టాలి- ఇక నువ్వంటేనే బెంబేలెత్తి-

చేతులు జోడించి వెళ్ళిపోవాలి...."

"ఇదంతా జరిగే పనేనంటావా?" అనుమానంగా అంది నవ్య

"జరగదు. అంచేత వెళ్ళి మీ అక్క పక్కలో ముసుగుతన్ని పడుకో- గెట్‌లాస్ట్' - కోపంగా అంది శ్రీమతి.

""అబ్బ ... అంత కోపమెందుకే... ఏం చేయాలో చెప్పరాదూ?" విసుగ్గా అంది.

"చెప్పింది వినకుండా మధ్యలో నీ బోడి అనుమానాలెందుకు?"

"సర్సరే.. అడ్డురాను చెప్పు "

"ఈ రోజు అతనికి ఫోన్ చెయ్ .."

"నేనా? అతనికా? ఫోన్ చేయడమా?" ఆశ్చర్యంగా అంది.

"అవును. నువ్వే ఫోన్ చేయాలి. ఈ రోజు ఏడు గంటలకు నాకు మీరు డిన్నర్ ఇస్తున్నారు. అంచేత- పూలూ- డిన్నర్‌కి కట్టుకోడానికి నీకో మంచి చీరె- ఇవన్నీ తీసుకుని సరిగ్గా ఆరున్నరకల్లా ఇంటి కొచ్చేయమను-"

"నీకు డిన్నరివ్వడం బానే ఉంది. ఈ పూలూ చీరెల గొడవేమిటి?' చిరాగ్గా అంది నవ్య.

"పిచ్చి మొద్దూ- చెప్పేది వినమని లక్షసార్లు చెప్పాను నువ్వలా అతనికి చెప్పగానే- గురుడు మేఘాల మీద తేలిపోతూ నాలుగు చీరెలూ- ఓ బుట్టెడు పూలూ- తదితర సామానుతో ఇంటికి ఆరు గంటలకే వస్తాడు "

"అప్పుడు నేనేం చేయాలి అతను తెచ్చిన చీరె కట్టుకుని- పూలు పెట్టుకుని సిగ్గుపడుతూ

## పునాదులు

నచ్చిన వాడికి సీటివ్వలేదని
ఆత్మహత్యలు చేసుకుంటున్నాం
నిరాహారదీక్షలు చేస్తున్నాం
ప్రజాసేవ పేరుతో పదవుల
కోసం వాళ్లు ఆశపడుతుంటే
అర్థంలేని ఆవేశాలతో మనం
కొట్టుకు చస్తున్నాం....అందుకే
పలుగులు, పారలు పట్టండి
గోతులు తీసి సమాధులు నిర్మిద్దాం...
మన సమాధుల మీద వాళ్ల
పదవులకు పునాదులు వేద్దాం!

-హేమ

మూత్రపిండాల పరీక్షకై జరిపే చిన్న రక్త పరీక్ష ద్వారా రక్తపోటువున్న రోగులలో గుండెజబ్బులు, "హార్ట్ ఎటాక్స్" రాగల అవకాశాలను తెలుసుకోవచ్చని ఇటీవల అమెరికాలో జరిపిన పరిశోధనలలో వెల్లడైంది.

రక్తంలో క్రియేటినైన్ అనే పదార్థం ఎంత ఎక్కువ వుంటే అంత త్వరగా మృత్యు ద్వారం దగ్గరవుతారట. ఈ "క్రియేటినైన్" అనేది కండరాలలో ఉండే "క్రియేటిన్" అనే మూల పదార్థం యొక్క ఉప ఉత్పత్తి. క్రియేటిన్ మూత్రపిండాల ద్వారా



## రక్త పరీక్ష ద్వారా గుండె జబ్బును తెలుసుకోవచ్చు!

క్రియేటినైన్‌గా మార్చబడి, మూత్రం ద్వారా బయటకు విసర్జించబడుతుంది అలా కాకుండా రక్త పరీక్ష ద్వారా ఇది రక్తంలో ఎక్కువ శాతం వుంటే మూత్రపిండాలు సరిగా పని చేయలేక పోతున్నాయని అర్థం

రక్తపోటు వున్నవాళ్లు క్రియేటినైన్ రక్తంలో ఎంత శాతం వున్నదీ కనీసం సంవత్సరానికొక్కసారైనా పరీక్షించు కుంటుండాలి. రక్తంలో క్రియేటినైన్ శాతం ఎక్కువ వున్నట్లు తెలిస్తే తగిన జాగ్రత్తలు తీసుకోవాలి బరువు తగ్గటం, కొలెస్టరాల్ శాతం తగ్గేట్లు చూసుకోవటం, పొగ త్రాగటం నిషేధించటం లాంటివి చేయాలి

కొలెస్టరాల్, మధుమేహం, గుండె జబ్బులు ఈ తరహా ఏ పరీక్షలకన్నా కూడ ఈ క్రియేటినైన్ పరీక్ష రక్తపోటు రోగులు మృత్యువుకు ఎంత దగ్గరగా వున్నదీ కరెక్టుగా చెబుతుంది.

రక్తపోటుకు చికిత్స చేయించుకోవటం వలన మూత్రపిండాలు పాడైపోకుండా చూడొచ్చు. అమెరికాలో గత ఎనిమిదేళ్ళుగా ఈ క్రియేటినైన్‌పై పరీక్షలు నిర్వహించి, ఇది ఎక్కువ శాతం వున్నవారు మృత్యువాతబడటం గమనించారు. అసలు సాధారణంగా రక్తంలో వుండవలసిన క్రియేటినైన్ శాతం ఒక డెసి లీటరు రక్తంలో 1.2 శాతం నుండి 1.5 శాతం వరకు వుండొచ్చు. మూత్రపిండాలు సరిగా పని చేయనపుడు, హార్మోన్ల ఉత్పత్తిలో తేడా రావచ్చు. హార్మోన్ల ఉత్పత్తి సరిగాలేనపుడు మెదడుకు, గుండెకు వెళ్లే రక్తనాళాలు దెబ్బ తింటాయి ఒక్కొక్కసారి గుండె కాకుండా మూత్రపిండాలే అధిక రక్తపోటుకు కారణం కావచ్చు.

ఎదురుగా కూర్చోవాలా?" కళ్ళలో నిప్పులు కురిపిస్తూ అంది నవ్య.

"అక్కర్లేదు అసలు నువ్వేకాదు ఎవరూ ఏమీ చేయం ..'

"అదేవిటి?" ఆశ్చర్యంగా అంది నవ్య

"అదంతే– అసలతను ఇక్కడికొచ్చేసరికి– మనం ఎవరమూ ఉండం. మీ అక్కతో సహా అంతా కలిసి ఫస్ట్ షో కెళ్ళిపోతాం"–

నవ్య ముఖంలో వెన్నెల కురిసింది.

చప్పున శ్రీమతి చేతులు పట్టుకుని ఊపేస్తూ–

"బ్రహ్మాండంగా ఉంది. వెరీగుడ్! ఈ దెబ్బతో చచ్చిపోతాడు"– అంది.

"ప్లాన్ నచ్చింది గదా– మరింక ఆలస్యం దేనికి– ఫోన్ చేయి"–

నవ్య లేచి ఫోన్ డయల్ చేసింది.

"హలో ." అన్నాడు స్వాగత్

"నే ను'

అతనితో ఫోన్‌లో.... తొలిసారిగా మాట్లాడ్డం వల్ల తడబడింది.

"ఓహో.. . నేనుగారా.. . ఎలా ఉన్నారు .. కులాసానా?" నవ్వుతూ అన్నాడు

నవ్య మాట్లాడ లేదు.

చెప్పాల్సింది రెండు ముక్కల్లో తేల్చి చెప్పాలనుకుంటే అవతల జోకు లేస్తున్నాడు

"మాట్లాడ రేవిటండి... అసలు మాట్లాడేది నేనుగారేనా?"

"నేను. . నవ్యను."

రెండు క్షణాల నిశబ్దం అనంతరం అన్నాడతను.

"నవ్యా... నువ్వా... ఏవిటి విశేషం?" అతని కంఠంలో ఆత్మీయతను గమనించిందామె. మరుక్షణం అతని మీద ద్వేషం ఉవ్వెత్తున ఎగిసిపడింది.

"ఈ రాత్రి– ఏడు గంటలకు మా ఫ్రెండ్ శ్రీమతికి డిన్నర్ ఇద్దామనుకుంటున్నాను. అంచేత నువ్వు సరిగ్గా ఆరున్నరకల్లా ఇంటికొచ్చేయ్"

"ఆరున్నరెందుకు? ఇప్పుడే వస్తాను"–

"ఇప్పుడెందుకు? డిన్నర్ ఏడు గంటలకు"–

"ఇప్పుడొచ్చి పాపం నీకు సహాయం చేద్దామని..."

"అక్కర్లేదు అక్క ఉందిగా– నేనే చేస్తాను.

"అయితే ఇప్పుడొద్దంటావ్!"

"వద్దు. ఇంకో విషయం"–

"ఏవిటి?"

"వచ్చేటప్పుడు– ఓ మంచి చీరె– పూలు తీసుకురా–"

"బ్లౌజ్ బ్రా కూడా తీసుకురానా?"

"అక్కర్లేదు– చీరె చాలు–"

"మీ ఫ్రెండ్‌కేగా? ఆమెకే కలర్ ఇష్టమో చెప్పు..."

"ఫ్రెండ్‌కి కాదు– నాకే...."

ఓ క్షణం ఆగి అన్నాడతను.

"పూలు కూడా నీకేనా?"

"అవును."

"వెరీగుడ్! నా ఆత్మ కథలో అండర్‌లైన్ చేయాల్సిన సన్నివేశం ఇది..."

"ఆత్మ కథేమిటి?"

"నా ఆత్మ కథ రాసుకుంటున్నాలే..."

"నువ్వేమయినా రాసుకో– ఆరున్నరకల్లా అవి తీసుకుని వచ్చెయ్–"

"అలాగే– బైదిబై– ఈ రాత్రి మీ ఫ్రెండ్ కూడా మనతోనే ఉంటుందా?"

"ఉంటుంది."

"అలాగే– అయినా పర్లేదు... మనింట్లో చాలా గదులున్నాయిగా..."

"అవును... చాలా ఉన్నాయి... ఇక ఉంటాను..."

"కాసేపు మాట్లాడరాదూ?"

"మీరొచ్చాక మాట్లాడుకుందాం."

ఫోన్ పెట్టేసి– శ్రీమతిని చూసి నవ్వింది నవ్య.

శ్రీమతి ఆనందంగా చేయి కలిపింది.

స్వాగత్ ఫోన్లో శైలజని పిలిచి అడిగాడు.

"మిస్ శైలజా చీరెల్లోకెల్లా అందమైన చీరేలేవి?"

బాస్ ప్రవర్తన గత కొద్ది రోజులుగా వింతగా అనిపిస్తోందామెకు.

"అందమైన వాళ్ళకు అన్ని చీరెలూ బాగానే ఉంటాయి సర్...."



## శిల్పం

మిత్రమా! నా చిత్రశాలలో
ఇది! ఒక చందన సుందర శిల్పం
ఎందరో చూచారు రెప్పవాల్చకుండా
ఎవరు! అన్నట్లు - ఎంతో ఆరాటం
అలా అల్లుకున్న బూజు
వారి హృదయాంతర భావాల మోజు సుమా!
నేను! ఆ నవ్వే కనుల వెనుక
నల్లని లోకాలల్లో దాగున్న రహస్యం
ఎవరికీ చెప్పలేదు
నీకు మాత్రం చెప్పాలని వుంది
ఎందుకంటే! నువ్వే ఆ బొమ్మను అంతగా చూడంది
ఒకప్పుడు! ఆ మూల సౌధంలోనో
ఒంటి స్తంభం మేడలోనో వుండేద
ఈ మధ్య కనిపించింది ఉద్యానవనాలల్లో
విలాసమందిరాలల్లో

ఒకడు! యజమానట దీని చిత్రం గీయమన్నాడు.
వరి పంపు మబ్బు తెరల వెనుక చందమామ.
ఏ ఇందు ముఖశాలలో నేను!
ఏ బుగ్గల గులాబీలు పూస్తేగాని
నీ దంతాల జాజులు విరిస్తేగాని
బొమ్మ వెయ్యటం నా వల్ల కాదన్నాను
ఆ బొమ్మ నవ్వింది
దరహాస చంద్రికలు కలువరేకుల్లో నింపాను
పల్లవ రాగాన్ని, మల్లికా గంధాన్ని కలిపాను
తూలికా శిరీషాన్ని ముంచాను- వ్రాశాను
కుందన రజాన్ని చల్లాను
మలయపవనంతో విసిరాను
అదే ఈ శిల్పం!

దీన్ని చూచి అతడు కోపగించాడు
ఎందుకని! ఆలోచిస్తే
ఆమె మెడ నుండి జారిన
ముదురు లేత ఎరుపులు నే చిత్రించానట!
సితలాగా లేదేం? అన్నాడు
ఏ సీత?!
ప్రభాతాన భర్త పాదాలు కడిగి నీళ్ల నెత్తిన చల్లుకునే సీత
దానికి బొమ్మ గీయాలా!
అక్కడున్న నౌకరుకు చూపించాను
వాడైనా మెచ్చుకుంటాడేమోనని
వాడూ, పెదవి విరిచి సీతలా లేదేం? అన్నాడు
ఏ సీత?
లంకలో అశోకవనంలో సీత!
భర్త అవమానిస్తే అగ్నిలో దూకుతున్న సీత!
ఎవడో ఏదో అంటే, అడవిలోకి నెట్టబడిన సీత
తెలియదా! నీకు ఏ సీత తెలుసు? అన్నాడు
గవాక్షంలోంచి రాముడి కోసం
తనువెల్ల కనులై చూచే సీత!
మధురోహల ముంగురులు ముఖాన ముసిరే సీత
నాకు తెలుసు! ఆమె ఈ శిల్పంలో లేదా!
అప్పుడు నేను తోటలో త్రవ్వుతుంటే
నాకేం తెలుసు- అని వెళ్లిపోయాడు వాడు
ఈ బొమ్మకు అక్కడ తెరబడింది
తెరచిన నా గాజు మందిరంలో చేరింది.
ఇంతకు వీడేడి చెపుమా! ఎప్పుడు పోయాడో
మధ్యతరగతివాడై యుంటాడు!

- పింగళి వెంకటకృష్ణారావు

"అఫ్‌కోర్స్ అందమైన వాళ్ళు ఏమీ లేకపోయినా బాగానే ఉంటారు కానీ నేనడిగింది మంచి చీరెల విషయం-"

"హనీమూన్ శారీస్ తీసుకోండి. చాలా బావుంటాయ్-

"అంటే ఈ రోజు నువ్వు కట్టుకున్న చీర అదేనా?"

"కాదుసర్. ఇది ఫస్ట్ నైట్ శారీ - బావుందాసర్?'

"చాలా బావుంది లాస్ట్ నైట్ వరకూ గుర్తుంటుంది-"

"థాంక్యూ సర్-"

"వెల్‌కమ్ మిస్-"

ఫోన్ పెట్టేసి ఆబిడ్స్ కెళ్ళాడు స్వాగత్.

హనీమూన్ షోరూం కెళ్ళి - మూడు చీరెలు తీసుకున్నాడు

ఆ తర్వాత - మొజంజాహి మార్కెట్ కెళ్ళి-

మల్లె పూలు- సన్నజాజులు- రెండు బుట్టలు తీసుకున్నాడు.

కొంతదూరం వచ్చాక- గులాబీలు తీసుకోలేదని గుర్తొచ్చి - మళ్ళీ వెనక్కెళ్ళి ఇంకో బుట్ట నిండా గులాబీలు తీసుకున్నాడు మళ్ళీ కారెక్కి కాస్త దూరం వెళ్ళాక తమలపాకులు గుర్తొచ్చి వెనక్కి వెళ్ళి ఓ బుట్ట తమలపాకులు - ఓ వక్కపొడి డబ్బా తీసుకుని కారు స్టార్ట్ చేశాడు. మళ్ళీ అంతలోనే ఏదో గుర్తొచ్చి - కిందకి దిగాడు

"సార్!' అని వినిపించి చూశాడు

ఆశ్చర్యంగా చూశాడు

"వీటికోసమేగా మీరొస్తోంది తీసుకోండి-" అన్నాడు పళ్ళ షాపువాడు ఓ అరటి పళ్ళగెల అందిస్తూ-

"థాంక్యూ.... థాంక్యూ.'. నీకెలా తెలుసు? నాకివి కావాలని?" ఆశ్చర్యంగా అడిగాడు

"మేము రోజూ మీలాంటి వాళ్ళని చాలా మందిని చూస్తుంటాం సార్- ఈ రోజు శోభనమా?"

"అవును. .. కాదు .. అవునవునవును. . అలాంటిదే!"

అతను పకాల్న నవ్వి-

"ఇంత వయసొచ్చినా ఇంకా సిగ్గేవిటి సార్? వెళ్ళిరండి-" అన్నాడు

హాయిగా నవ్వుకుంటూ కారుస్టార్ట్ చేసి ఆఫీస్ కొచ్చాడు స్వాగత్

బాస్ రాక కోసం కిటికీలో నిల్చుని వెయిట్ చేస్తున్న శైలజ- కార్లో కనిపించిన బుట్టల్ని చూసి అనుకుంది

"హి ఈజ్ క్రేజీ!!"

సాయంత్రం-

ఐదు గంటల నుంచే మీనాక్షి సందడి ప్రారంభమైంది

నాగేశ్వర్రావు సినిమా విడుదలై అప్పటికి ఆరు గంటలైంది విడుదల రోజే సినిమా చూడకపోతే ఆమెకు నిద్ర పట్టదు అన్నం సయించదు. చిరాకు పెరిగి పోతుంది. స్వాగత్ ముందు సినిమా ప్రసక్తి తేవడానికి కొంచెం మొహమాట పడింది.

అందుకే-

తాను నిద్రలేచే సరికి చెల్లెలు హఠాత్తుగా సినిమా ప్రోగ్రాం చెప్పేసరికి ఆనందంతో తబ్బిబ్బయి పోయింది.

"మీ ఆయన కూడా వస్తే బావుంటుంది కదా- పాపం... మనమంతా వెళ్ళి అతనొక్కడినే వదిలేస్తే బాధ పడడూ-" అంది.

వద్దంటే అక్క చెప్పే నీతి చంద్రిక వినాల్సి వస్తుందని-

"ఆయనకు ఫోన్ చేసి చెప్పాను. థియేటర్ దగ్గర కొచ్చేస్తారు. ." అంది

సాయంత్రం ఆరవుతుండగా- అంతా. కలిసి ఆటోలో బయల్దేరారు

మరో అరగంటలో చీరెలూ - పూలూ తీసుకుని ఇంటికి రాబోతున్న స్వాగత్ - ఇంట్లో ఎవరూ లేరని తెలిసి ఏవిధంగా షాక్ తింటాడో ఊహించు

కుంటుందే– నవ్యకు పట్టరాని ఆనందంగా ఉంది.

"ఏమనుకుంటా డంటావ్?" గుసగుస లాడింది శ్రీమతి చెవిలో నవ్య.

ఏమైనా అనుకోనీగానీ – మనం రేపట్నుంచీ జాగ్రత్తగా ఉండాలి– అంది మెల్లగా

ఎందుకు? ఆశ్చర్యంగా అడిగింది నవ్య

అతన్ని ఫూల్ని చేయడానికి మనిద్దరం ఈ నాటకం ఆడామని తెలిసి పోతుందతనికి అతను– రేపట్నుంచి మనల్ని ఫూల్స్‌ని చేయడానికి ఎత్తు వేస్తాడు– అంది

'నిజమే సుమా! ఏం చేస్తాడంటావ్– అంది నవ్య–

ఏవిటే ఆ గుసగుసలు– పెద్దగా మాట్లాడుకోరాదూ చిరాగ్గా అంది మీనాక్షి

ఇద్దర్లో ఎవరూ మాట్లాడలేదు

థియేటర్ దగ్గర జనం పల్చగా ఉన్నారు–

మీనాక్షి దిగులుగా అంది

ఏవిటి సినిమా ఫ్లాపయిందా జనమే లేరు

ఆమె మాటలు పట్టించుకోకుండా ముగ్గురూ థియేటర్‌లోకి వెళ్ళారు

అడ్వర్టైజ్‌మెంట్స్ వేస్తున్నారు

సీటు నంబర్స్ చూసుకుని–

మీనాక్షి – శ్రీమతి – నవ్య – వరుసగా కూర్చున్నారు

నవ్య వాచీ చూసుకుని–– శ్రీమతి చేయి ఆనందంగా పట్టుకుని–

'ఆరున్నర అంది

ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు

'మరి మీ ఆయనొస్తే ఎక్కడ కూర్చుంటాడు? అడిగింది మీనాక్షి

ఇదుగో– నా పక్క సీటు ఖాళీగానే ఉందిగా ఇక్కడే కూర్చుంటాడు అంది నవ్య– అక్క అమాయకత్వానికి మనసులో నే నవ్వుకుంటూ–

'ఇంకా రాలేదే? అంది మీనాక్షి

అబ్బ వస్తార్లేక్కా! ఆయనేం చిన్నపిల్లాడు కాదుగా తప్పి పోవడానికి?

ఇదెక్కడి చోద్యమే తల్లీ– మొగుడి మాట ఎత్తితే చిటపటలాడి పోతావ్– విసుగ్గా అంది

## లవ్ గేమ్

మీనాక్షి

సినిమా ప్రారంభమైంది

మీనాక్షి తనను తాను మర్చిపోయి– సినిమాలో లీనమైంది

'ఎన్ని చీరెలు తెచ్చి ఉంటాడంటావ్? అడిగింది నవ్య

ఆమెకు చాలా థ్రిల్లింగా– ఎక్సయిటింగా ఉంది

తనను ప్రతి రోజూ మాటలతో – చేతలతో టీజ్ చేస్తున్న అతనికి ఇంత కాలానికి పారం చెప్పే అవకాశం వచ్చినందుకు ఆమె ఆనందంతో పొంగిపోతోంది

"షాపు మొత్తం తెచ్చి ఇంట్లో పెట్టినా – ఆశ్చర్య పోనక్కర్లేదు– అంది శ్రీమతి

"పాపం అందులో సగం నువ్వు తీసుకోవే కష్టపడి ప్లాన్ వేశావు–

'షటప్! మగాడు తెచ్చిన చీరెలు కట్టుకోకూడ దన్నది నా శపథం తెలుసా?

"ఐసీ సీరియస్ అంది నవ్య

"పాపం పూలెన్ని తెచ్చుంటాడో కదా అంది నవ్య

"పాప మంటున్నావ్ పెట్టుకుంటావా? సీరియస్‌గా అడిగింది శ్రీమతి

అబ్బబ్బ, సినిమా చూడనివ్వకుండా ఏవిటే మీ గొడవ?

విసుగ్గా అంది మీనాక్షి

"మేమేం చేశాం? నీకడ్డు నిలబడి – కళ్ళు మూస్తున్నామా? కోపంగా అంది నవ్య

'ఏవిటో గుసగుసలు– అంది

'స్వీట్ నథింగ్స్– అంది శ్రీమతి

మీనాక్షి వారి వేపు కోపంగా చూసి– సినిమా చూడడంతో లీనమై పోయింది

ఇంటర్వెల్ అయింది

'చివరకు నాగేశ్వర్రావు – శ్రీదేవి కలుస్తారంటావా? దిగులుగా అంది మీనాక్షి

"కలవరు–" అంది శ్రీమతి.

"ఎందుకని?" మీనాక్షి ఆశ్చర్యంగా అడిగింది.

"నాగేశ్వర్రావ్ ఉండేది హైదరాబాద్‌లో – శ్రీదేవి బొంబేలో ఉంటుంది

'ఎలా కలుస్తారు? అంది శ్రీమతి

మీకంతా ఎగతాళిగానే ఉంటుంది– కోపంగా అంది మీనాక్షి

పాపం – మీ ఆయనేం చేస్తుంటాడో –" శ్రీమతి మెల్లగా అంది

నవ్యలో చలనం లేదు

శిలా ప్రతిమలా కూర్చుండి పోయింది

శ్రీమతి కర్థం కాలేదు

నవ్యా అంది భుజం తట్టి – నవ్య కదలలేదు

ఏమైంది దీనికి – కొంపదీసి మొగుడి బాధను తలచుకుని– ఆనందంతో గుండె ఆగి పోలేదు కదా–

కంగారుగా భుజం కుదిపి–

'నవ్యా– అంది

ఆమె ఉలిక్కిపడి– శ్రీమతిని చూసింది

తెల్లగా నెత్తురంతా ఇంకి పోయినట్టున్న నవ్య ముఖంలోకి చూసి ఆశ్చర్యంగా అంది శ్రీమతి-

"ఏవిటే – ఏమైంది– ఎందుకలా అయిపోయావ్?"

ఆమె కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి

పెదవులు వణుకు తున్నాయి

ఏదో చెప్పాలని ప్రయత్నిస్తూ– మాట రాక అలానే చూస్తుండి పోయింది

శ్రీమతికి కంగారు ఎక్కువై–

"నవ్యా– వాటీజ్ దిస్– ఏమైంది నీకు? అంది

చివాలున లేచి

నవ్య పక్కన కూర్చున్న వ్యక్తిని చూసి–

నెత్తి మీద నాటుబాంబు పేలినట్టు అదిరిపడింది

అక్కడ– నవ్య పక్కన–

చిన్నగా నవ్వుతూ– శ్రీమతిని చూసి-

రెండు చేతులెత్తి అన్నాడు స్వాగత్–

'నమస్తే! డిన్నర్స్ సినిమా హాల్లో కూడా అరేంజ్ చేస్తారని ఈ రోజు తెలుసుకున్నాను–

(ఇంకా వుంది)



# పౌష్టికాహారం అంటే?

ప్రశ్న: ఆకర్షణకు, ఆరోగ్యానికి ప్రధానమైనది ఏమిటి?

జవాబు: ఆకర్షణకి ప్రధానమైనది ఆ వ్యక్తి తీసుకొనే ఆహారం. సమీకృతమైన ఆహారం తీసుకున్న వ్యక్తి ఆరోగ్యంగా, ఆకర్షణ కలిగియుండటం సహజంగా గమనిస్తుంటాం

ప్రశ్న: సమీకృత ఆహారం అంటే ఏమిటి?

జవాబు: ఆహారంలో పిండి పదార్థాలు, మాంసకృత్తులు, కొవ్వు పదార్థాలు, ఖనిజాలు, విటమినులు, నీరు, పీచు పదార్థాలు సమపాళ్లలో వుంటే దానిని సమీకృతాహారం అంటారు ఈ ఏడు పదార్థాలను ఆహారంలో వుండే సప్తవింతలు అంటారు

ప్రశ్న: పిండి పదార్థాలు మనకు ఎలా వుపయోగపడతాయి?

జవాబు త్వరితంగా శక్తినిచ్చేవి పిండి పదార్థాలు. తియ్యదనాన్ని కలుగజేసే వాటిలో పిండి పదార్థాలు ముఖ్యమైనవి పంచదార ఎక్కువ తింటే వచ్చేది పళ్లు, పోయేవి పళ్లు. అందుకే పిండి పదార్థాలు మన ఆహారంలో అరవైశాతం కంటే మించకుండా వుండటం మంచిది. తీపి వస్తువులు తిన్న వెంటనే నోరు కడుగుకుంటే మంచిది

ప్రశ్న: పాలల్లో పిండి పదార్థం ఏమైనా వున్నదా?

జవాబు: పాలల్లో లాక్టోజ్ (పాల పిండి పదార్థం) అనే పిండి పదార్థం ప్రకృతి సిద్ధంగా వుంటుంది. ఇది కాల్షియం ఖనిజం ప్రేగుల నుండి రక్తంలోకి వెళ్లటానికి తోడ్పడుతుంది. పాలల్లో ఈ రెండూ కలిసి వున్నాయి. పెరిగే పాపాయికి తోడ్పడటానికి ప్రకృతి పాలల్లో పొందుపరచిన ద్వయం లాక్టోజ్, కాల్షియం.

ప్రశ్న: క్రొవ్వు పదార్థాలు మనకి ఎలా వుపయోగపడతాయి?

జవాబు: అత్యంత శక్తినిచ్చేవి కొవ్వు పదార్థాలు రుచిని కలుగజేసేవి కూడా అవే వేపుడు కూరల్లో రుచికి ముఖ్య కారణం కొవ్వు పదార్థాలు. మన ఆహారంలో షుమారు 30 శాతం కొవ్వు పదార్థాలు చోటు చేసుకోవాలి కొవ్వు పదార్థాలు అధికంగా తింటే మొదట ఆకలి తగ్గిపోతుంది మెల్లగా బరువు పెరిగి రక్త నాళాల్లో కొవ్వు చేరటం రక్తపోటు పెరగడం జరగవచ్చు గుండెపోటుకి దారితీయవచ్చు

ప్రశ్న: ఏయే రకాలైన కొవ్వు పదార్థాలు మనం తినాలి?

జవాబు: మన ఆహారంలో 10 శాతం సంతృప్తి కొవ్వు పదార్థాలు, 20 శాతం అసంతృప్తి కొవ్వు పదార్థాలు వుండాలి

ప్రశ్న: నెయ్యి మంచిదా? వెన్న మంచిదా?

జవాబు వెన్నలో విటమిన్ 'ఎ' విటమిన్ 'డి' వున్నాయి అవి కరిగిపెట్టినపుడు విధ్వంసమై నెయ్యిలో లోపిస్తాయి నెయ్యి మాత్రమే వాడే వారిలో వృద్ధాప్యంలో ఎముకల పటుత్వం కోల్పోతున్నట్లు గ్రహించడమైనది. అందువల్ల రోజూ చెంచా వెన్న మంచిది



డా. ఎస్.ఎస్.దాస్ ఎం.బి.బి.ఎస్., ఎం.డి.తో ఇంటర్వ్యూ

డా. ఎస్. ఎస్. దాస్, ఎం. డి. విజయవాడ సిద్ధార్థ మెడికల్ కాలేజీ జీవ రసాయన శాస్త్ర విభాగపు ఆచార్యులుగా పని చేస్తున్నారు. వీరు విజయవాడ శాఖ ఐ.ఎమ్.ఎ. ప్రెసిడెంట్ గాను, జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర ఉపాధ్యక్షులుగాను వున్నారు. వీరు వరంగల్, ఉస్మానియా వైద్య కళాశాలలో విద్యనభ్యసించారు. వీరు సాంఘిక సేవా కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొంటారు.

ప్రశ్న: పిండి పదార్థాలు కొవ్వు పదార్థాలుగా మారగలవా?

జవాబు పిండి పదార్థాలు అధికంగా తీసుకున్నప్పుడు కొవ్వు పదార్థాలుగా మారతాయి ముఖ్యంగా చక్కెర కొవ్వు పదార్థంగా తేలిగ్గా మారుతుంది.

ప్రశ్న: మాంసకృత్తుల వలన వుపయోగమేమి?

జవాబు. మన శరీరంలో శరీర పుష్టికి హేతువయ్యేవి మాంసకృత్తులే మనం షుమారు 12 శాతం మాంసకృత్తులను ఆహారంగా తీసుకోవాలి పాలు, గ్రుడ్లు, మాంసం, పప్పుదినుసులు, చిక్కుళ్లలో మాంసకృత్తులు లభ్యమగుతాయి

ప్రశ్న: విటమిన్ల వలన వుపయోగమేమి?

జవాబు: విటమిన్లు మన శరీరంలో అనేక ముఖ్యమైనటువంటి కార్యక్రమాలకి తోడ్ప



డుతాయి. విటమిన్ 'ఎ' ఆకుపచ్చ, పసుపుపచ్చగా వుండే కాయగూరలలో అధికంగా వుంటూ మన కంటిని, చర్మాన్ని కణపొరలని కాపాడుతాయి మునగాకు కూర, కేరట్ కూర, పాలు, వెన్న, బొప్పాయి, చేప నూనె విటమిన్ 'ఎ' అధికంగా కలిగి వుంటాయి

విటమిన్ 'డి' ఎముకల పటుత్వాన్ని పెంపొందిస్తాయి. మొలకెత్తుతున్న విత్తనాలలో విటమిన్ 'ఇ' శరీరంలోని ప్రేగులలో తయారయ్యే విటమిన్ 'కె', ధాన్యాదులు, కాయగూరలలో పుష్కలంగా లభించే విటమిన్ "బి కాంప్లెక్స్" ఉసిరి, నిమ్మ, నారింజ లాంటి పళ్లలో దొరికే విటమిన్ 'సి' చాలా ముఖ్యమైనవి.

బి కాంప్లెక్స్ లోపం "బెరి బెరి" అనే వ్యాధిని, అంగిట్లో పుండ్లు, పెదాల మూంగిట్లో పుండ్లు, వళ్లంతా చిట్లే "పెల్లాగ్ర" రక్తహీనత, పిల్లలలో మూర్ఛలాంటి వ్యాధి, పాండురోగం మున్నగు వాటిని కలుగజేస్తుంది.

నిత్యం పాలు, కొద్దిగా వెన్న, ఒక కప్పు ఆకు మరియు కాయగూరలు, ఒక పండు భుజిస్తే మనకు కావలసిన విటమిన్లు దొరికి మనం ఆరోగ్యంగా వుండటానికి తోడ్పడతాయి అయితే ఎక్కువగా విటమిన్లు భుజిస్తే, అనేక నష్టాలు వాటిల్లుతాయి.

ప్రశ్న: మనకు ఏవి ఖనిజాలు ముఖ్యం?

జవాబు: ఎముకలలో వుండే కాల్షియం, భాస్వరం, శరీరమంతటా వుండే ఉప్పు, పొటాషియం, రాగి, మెగ్నీషియం, రక్తానికి ముఖ్యంగా అవసరమయ్యే యినుము, థైరాయిడ్ గ్రంధికి అవసరమయ్యే అయోడిన్, తుత్తునాగం (జింక్)





క్రోమియం, ఫ్లోరైడ్ మనకు కావలసిన కొన్ని ముఖ్య ఖనిజాలు.

ధాన్యాదులు, పప్పు దినుసులు, చిక్కుళ్లు, ఆకుకూరలు మనకు కావలసిన ఖనిజాలను అందిస్తాయి కాల్షియం భాస్వరలోపం ఎముకల బలహీనతను, ఉప్పు, పొటాషియం లోపం నిస్సత్తువును కలుగజేస్తాయి రాగి, ఇనుము, జింక్ లోపం రక్తహీనతకు, అయోడిన్ లోపం థైరాయిడ్ గ్రంధి లోపానికి దారితీస్తాయి. క్రోమియం లోపం మధుమేహాన్ని కలుగజేస్తుంది. మితిమించి ఖనిజాలు తింటే శరీరానికి నష్టం కలుగజేస్తాయి.

ప్రశ్న: పీచు పదార్థాలు ఏ విధంగా వుపయోగపడతాయి?

జవాబు: త్వరితంగా జీర్ణంగాని పిండి పదార్థాలు, పెద్ద ప్రేగులలో కొన్ని సూక్ష్మ క్రిముల బారికి గురై కొంత వరకు విధ్వంసం పొందుతాయి. యిలాటి పిండి పదార్థాలను పీచు పదార్థాలు అంటాం ఆకుకూరలు, కాయగూరలు, బియ్యం, గోధుమలలో, పళ్లలో, కొంత పీచు పదార్థం వుంటుంది. మన ఆహారంలో షుమారు 60 గ్రాముల పీచు పదార్థం చోటు చేసుకోవాలి. యిది పెద్ద ప్రేగులలో పుట్టుకురుపు వ్యాధి రాకుండా కాపాడుతుంది.

ప్రశ్న: సత్తవింతలున్న ఆహారం మనకు ఎలా లభిస్తుంది?

జవాబు: 1. పాలు, పాల ఉత్పత్తులు 2. పళ్లు, కాయగూరలు, 3 మాంసం లేక మాంసకృత్తులు అధికంగా వుండే పప్పులు, చిక్కుళ్లు, గ్రుడ్లు, 4 వరి అన్నం, గోధుమన్నం, రొట్టెలు తీసుకుంటే సత్త వింతల మిశ్రమాహారం మనకు లభిస్తుంది.

ప్రశ్న: ఉపవాసం మంచిదా?

జవాబు: ఆహారం తినకుండా వుండటం పగలుకాని, రాత్రికాని మంచిది కాదు మధుమేహం వున్న వారు ఉపవాసం చేస్తే మంచి కన్నా చెడు జరుగుతుంది.

ప్రశ్న: మెంతులు రోజా కొద్దిగా తింటే మంచిదా?

జవాబు: మెంతులలో మధుమేహాన్ని తగ్గించే శక్తి, రక్తంలో కొవ్వు పదార్థాలు తగ్గించే శక్తి వున్నది. అందుచేత మెంతులు ఆహారంలో భాగంగా చేయడం మంచిదే.

ప్రశ్న: ఆహారలోపం పిల్లలలో ఎలాటి స్థితికి దారితీస్తుంది?

జవాబు' చిన్న పిల్లలలో పోషకాహార లోపమైతే ఎదుగుదలే లేకుండా తెలివితేటలు దెబ్బతింటాయి. మాంసకృత్తుల లోపం వలన చురుకుదనం లేకపోవడం, కండరాలు చిక్కిపోవడం వళ్లంతా వాపు, ఎఱ్ఱబడిన జుట్టు, పగిలిపోయిన చర్మం ఏర్పడుతుంది మాంసకృత్తులతో పాటు శక్తినిచ్చే ఆహారం లోపిస్తే పిల్లలు చిక్కి ఎముకల గూడులా అవుతారు. పోషకాహార లోపం వున్న పిల్లలకు 40 గ్రాములు వేడిచేసిన గోధుమ, 16 గ్రాముల శనగలు, 10 గ్రాముల వేరుశనగ పప్పు, 20 గ్రాముల బెల్లం కలిపి పప్పు వుండలు చేసి తినిపిస్తే మూడు నెలలో ఆరోగ్యవంతులవుతారు రోజు ఒక గ్రుడ్డు మంచిది.

ప్రశ్న: మూత్రపిండాలలో, రాళ్లున్న





వారు ఏ విధమైన జాగ్రత్తలు తీసుకోవాలి?

జవాబు. ముఖ్యంగా వీరు నీళ్లు అధికంగా తీసుకోవాలి. ఆహారం ఆ వ్యక్తి విసర్జించిన రాయి రసాయనిక రూపాన్ని బట్టి తీసుకోవాలి.

**పౌష్టికాహారం అంటే?**



ప్రశ్న: కడుపునొప్పి, మంటతో బాధపడే వ్యక్తి ఏం తీసుకోవాలి?

జవాబు: మెత్తటి అన్నం, రొట్టెలు, సేమ్య, పొట్టులేని పప్పుతో చేసిన వంటకాలు, పాలు, వెన్న, గుడ్లు, లేత ఆకుకూరలు, కాయగూరలు, కొద్దిగా మాంసం తీసుకోవాలి. పచ్చి ఉల్లిపాయలు, మసాలా, వెల్లుల్లి, అరగ మోత దినుసులు, వేపుడు కూరలు తీసుకోవద్దు. వక్క, తమలపాకులు, పొగాకు, కాఫీ నిషిద్ధం.

ప్రశ్న: గుండెపోటు వచ్చిన వారు ఏం ఆహారం తీసుకోవాలి?

జవాబు: మితంగా భుజించాలి జంతు సంబంధిత కొవ్వు పదార్థాలు తగ్గించాలి వృక్ష సంబంధిత నూనెలు అంటే తవుడు నూనె పొద్దు తిరుగుడు నూనె, తీసుకోవాలి. మాంసం తగ్గించాలి. మత్తు పానీయాలు తగ్గించాలి. కూరగాయులు అధికంగా తీసుకోవాలి. వేపుడు కూరలకంటే పులుసు కూరలు శ్రేష్టం.

ఆహారం విలువైనది. ధూమపానానికి • మత్తుపానీయాలకు పెట్టే ఖర్చును బీదవారి పోషకాహారానికి వాడితే వారు వారి పిల్లలు ఆరోగ్యంతో తీర్చిదిద్దబడతారు ఆహారంలో సమన్వయం సాధిస్తే వచ్చేది సోయగం, కలిగేది దారుఢ్యం, పెరిగేది ఆరోగ్యం. అందుకే మనం మితంగా తిని, సంధికొట్టకుండా పరిశ్రమించి హితవుగా మాట్లాడితే యింపైన జీవితం గడపవచ్చు

ఇంటర్వ్యూ:

హిప్నాటిస్ట్ టి.ఎస్. రావ్.

# న్యాయచట్టం ప్రశ్నలు-జవాబులు



అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ.,ఎల్.ఎల్.బి.

**జి. అశ్వర్ధమ్మ, హిందూపురం.**

ప్రశ్న :- నేను 1988 సంవత్సరంలో నమ్మి నా స్నేహితురాలికి 3 బంగారు గాజులు, ఒక రింగు మరో స్నేహితురాలి ఎదుట కుదువ పెట్టుకొనుటకు ఇచ్చాను. వారిద్దరు వెళ్ళి కుదువ బెట్టారు ఇప్పుడు బంగారం తీసుకొని వెళ్ళిన స్నేహితురాలు ఎదురు తిరిగింది నా బంగారం నాకు ఇమ్మని అడిగితే నాకు ఇవ్వలేదు అంటున్నది ఎస్ ఐ గారిని అడిగితే బంగారం ఇచ్చినట్లు రాత మూలకంగా వున్నప్పుడు ఇప్పించ గలను అంటున్నారు నా స్నేహితురాలు సాక్ష్యం చెబుతుంది 'మీరు పరిష్కార మార్గం చెబుతారని ఆశిస్తున్నాను.

జవాబు - మీరు 3 బంగారు గాజులు, ఒక రింగు మీ స్నేహితురాలికి నమ్మి ఇచ్చామన్నారు ఆమె మరియొకరి దగ్గిర తాకట్టు పెట్టి అప్పు తీసుకున్నది దానికి సాక్ష్యం ఉన్నది ఇక మీరు ఆ వస్తువులు ఎవరి దగ్గిర తెయ్యించారో వారిని కూడా అడగండి మీ బంగారం ఇచ్చి వెయ్యమని అడగండి మీరు అప్పు తీర్చివేసి మీ బంగారం తీసుకొనండి అది మీకు ఇష్టం లేకపోతే మీ స్నేహితురాలి మీదా, అప్పు ఇచ్చిన వారి మీదా భారత శిక్షాస్మృతి లోని 406 సెక్షన్ క్రింద కేసు పెట్టండి. పోలీసులు మీతో సహకరించకపోతే మేజిస్ట్రేట్ కోర్టులో మీరు కంప్లయింట్ పెట్టుకొన వచ్చును.

**పి. సుబ్బారావు, రాజమండ్రి.**

ప్రశ్న - సకాలంలో న్యాయం జరుగకపోతే న్యాయం జరిగినా అది అన్యాయం అవుతుంది అంటారు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఒకరు సివిల్ కేసులు 2 సంవత్సరములలోను, క్రిమినల్ కేసులు ఒక సంవత్సరంలోను పూర్తి అవ్వాలి అన్నారు ఇది జరిగే పనేనా? ఈ నాడు రాజమండ్రిలో 1983 నాటి కేసులు విచారణ జరుగుచున్నవి. లిటిగేషన్ తెలిసిన కొంతమంది అప్పు తీసుకున్న వాళ్ళు సక్రమంగా చెల్లించకుండా కావాలంటే దావా చేసుకొనండి తీర్పు వచ్చేటప్పటికి పదేళ్ళు పడుతుంది మరో పదేళ్ళు వాయిదాల మీద తీసుకొందురు అని బెదిరిస్తున్నారు దీనికి మరో పరిష్కార మార్గము లేదా?

జవాబు :- తగినంతమంది జుడీషియల్ మేజిస్ట్రేటులు, డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌లు లేక కేసులు, దావాలు త్వరగా పరిష్కారం కాలేదు అంటున్నారు. అయితే ఆంధ్రప్రదేశ్ హైకోర్టు వారు ప్రతీ జిల్లాలోను లోక్ అదాలత్‌లు నిర్వహించి కేసులు త్వరగా పరిష్కారం చేస్తున్నారు ఈ మధ్య విశాఖపట్నంలో కూడా స్టీలు ప్లాంట్ వారి యొక్క భూసేకరణ కేసులు పరిష్కారం చేసి సుమారు 18 కోట్ల రూపాయల వరకు నిర్వాసితులకు కంపెన్సేషన్ క్రింద చెల్లించినట్లు తెలుస్తున్నది ఇంత త్వరగా వేల కొలది కేసులు పరిష్కారం కావడం భారత దేశన్యాయ చరిత్రలోనే ప్రథమం అంటున్నారు కనుక ఇక ముందు కూడా లోక్ అదాలత్‌లు త్వరగా నిర్వహించి కేసులు పరిష్కరిస్తారని ఆశిద్దాము

**ఎల్. ఎస్. ప్రసాద్, అనంతపురం.**

ప్రశ్న - బస్సునందు ప్రయాణం చేస్తున్న ఒక ప్యాసింజర్ టికెట్ తీసుకొనని యెడల కండక్టర్ అజాగ్రత్తగా ఉన్నాడని ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ కేసు వ్రాయుచున్నాడు. ఎ పి ఎస్ ఆర్ టి. సి రూలు ప్రకారం స్టాటిస్టికల్ రిటర్న్‌లో బస్‌లోని ప్యాసింజర్ల యొక్క కెపాసిటి తెలియును కాని ఒక స్టేజి నుంచి మరియొక స్టేజికు రిక్వెస్ట్ స్టాప్‌లు వుండుట వలన ప్యాసింజర్స్ ఎంత మంది ఉన్నది తెలియదు బస్‌నందు ఎంతమంది వున్నదీ తెలియక పోవుటకు కారణాలు క్రింద ఇచ్చాను

(1) స్కూలు విద్యార్థులకు ఫ్రీ పాస్‌లు (2) న్యూస్ రిపోర్టర్లకు 1/3 వంతు టికెట్టు (3) ఉద్యోగుల బస్ పాస్‌లు (4) వికలాంగులకు 1/2 టిక్కెట్ (5) కాలేజీ విద్యార్థులకు 1/2 టిక్కెట్ (6) పిల్లలకు 1/2 టిక్కెట్ (7) ఒక స్టేజిలో ఎక్కిన వాడు దిగవలసిన స్టేజికు ముందుగా వచ్చే చిన్న స్టేజిలో దిగుతున్నాడు

—పైన వివరించిన విషయముల ప్రకారం ఎస్ ఆర్ నందు ఎంత మంది వున్నది తెలియదు కావున మేము ఈ విషయంలో కోర్టుకు వెళ్ళవలయునని నిశ్చయించినాము చిన్న విషయాలలో కూడా సస్పెన్షన్, రిమువల్ చేయుచున్నారు. కాబట్టి ఈ విషయం హైకోర్టునకు వెళ్ళవచ్చునా? లేదా?

జవాబు :- ప్యాసింజర్లలో పూర్తి టికెట్ చెల్లించువారు, 1/2 టిక్కెట్ చెల్లించువారు, 1/3 టిక్కెట్ చెల్లించువారు, మరియు ఫ్రీ పాస్‌ల వారు అని 4 తరగతుల వారు వున్నారు మీరంతా యూనియన్‌లో ఎస్ ఆర్ మార్పు చెయ్యవలెనా లేదా అని చర్చ జరిపి ఎ పి ఎస్ ఆర్ టి సి వారికి తెలియ పర్చండి ఒరిస్సా, కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలలో ఎటువంటి పద్ధతి అనుసరిస్తున్నారో వివరాలు సేకరించి వారు అనుసరించిన పద్ధతి ఆచరణ యోగ్యంగా వుంటే ఆ విధంగా చెయ్యమని కోరవచ్చును ఎ పి ఎస్ ఆర్ టి సి చైర్మన్ కూడా ఆలోచన చేసి నిర్ణయం తీసుకుంటారు చైర్మన్ కూడా తిరస్కరించిన ట్లయితే హైకోర్టులో రిట్ పిటిషన్ పెట్టుకొన వచ్చును

**జె. చంద్రశేఖర్, ఆదోని**

ప్రశ్న నేను షాపు గుమస్తాగా పని చేయుచుంటిని నా సర్వీసు ఎనిమిది సంవత్సరములు షాపు మేనేజ్‌మెంట్‌వారు, నేను యూనియన్ ఎగ్జిక్యూటివ్ మెంబర్ అయినందు వలన నన్ను ఉద్యోగం నుంచి నోటీస్ ఇచ్చి పని నుండి తొలగించినారు నేను కర్నూలు అసిస్టెంట్ లేబర్ కమిషనర్ ఆఫీస్‌లో కేసు దాఖలు చేసి గెలిచాను నేను షాపు చట్టం ప్రకారం డిమాండ్ చేసిన వెనుకటి జీతము, నాలుగు సంవత్సరముల బోనస్, మూడు నెలల నోటీస్ జీతము మరియు గ్రాట్యూటీ మొత్తము ఇచ్చుటకు యజమాని నిరాకరించినారు నాకు రావలసిన బకాయిలు సాధించుట కొరకు ఏమి చర్య తీసుకొనవలయునో తెలుపవలెను

జవాబు - కోర్టు ఉత్తర్వులపై మీ యజమాని అప్పీలు పెట్టుకున్నట్లు లేదు కనుక మీకు చెల్లించవలసిన గ్రాట్యుటీ, బోనస్, జీతములు ఇవ్వక తప్పదు మీరు లాయర్ నోటీస్ పంపించండి. మీకు 15 రోజుల లోపల బకాయిలు చెల్లించనట్లయితే కంటెంప్ట్ ఆఫ్ కోర్టు క్రింద కేసు పెట్టండి.

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయచట్టం ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..............................

పేరు: ..............................

పూర్తి చిరునామా: ..............................

..............................

# కన్నీటి శిథిలాలు

## -అరణి




పడవలో అవతలి గట్టుకు చేరానో లేదో, నన్ను గుర్తించి, ఫలానా అని నిర్ధారించుకున్నట్టున్నాడు అక్కడి వ్యక్తి.

"దండాలు బాబూ" అని ఎదురు వచ్చాడు.

"తమరు బేంక్ ఆఫీసరుగారు కదండీ" అడిగాడు. అవునన్నాను. రెండు చేతుల్తోనూ మూడు సూట్‌కేసులు మోయలేని నా అవస్థను గమనించినట్టున్నాడు.

"ఈటి పని నేను చూసుకుంటాను! మీ రెళ్ళి రిక్షా ఎక్కండి" అన్నాడు. రిక్షాలో సూట్ కేసులుంచి–

"నాయుడుగారి మేడకేకదా!" అడిగాడు. అవునని తలూపాను. రిక్షా దూసుకు పోయింది

కొత్తగా మా బ్యాంక్ శాఖను నెలకొల్పడంతో ఆఫీసరుగా ప్రమోటయి, నా రాక ఇక్కడికి తప్పనిసరయ్యింది. సమీప గ్రామంలోనే ఫోటో స్టూడియో పెట్టుకుని ప్రసాద్ ఉంటున్నాడు. వారం రోజులు ముందుగా నేనొస్తున్నట్టు వాడికి ఉత్తరం రాశాను. అయినా ఫలితం లేదు. వాడి దర్శనం కాలేదు. ఇంతకీ నా ఉత్తరం వాడికి అందిందో లేదో!

పచ్చ పచ్చని పొలాలు. కొబ్బరి తోటలు, రెండు టూరింగ్ టాకీసులు, అడుగడుగునా దేవాలయాలూ... ఊరంతా బాగుందనిపించింది.

"చెప్పడం మరచిపోయాను! ప్రసాద్‌బాబుగారి కేదో పెళ్ళి తగిలిందట! ఫోటోలు తీయడానికి అయనక్కడికెళ్ళి, మీ వివరాలు చెప్పి నన్నిక్కడికి పంపారు. సాయంత్రం వచ్చి మిమ్మల్ని కలుస్తానన్నాడు." బురద బురదగా ఉన్న రోడ్డుమీద బలంగా రిక్షాను లాగుతూ చెప్పాడతను

నాయుడుగారి మేడ దగ్గర కొచ్చాం. రిక్షా దిగి, వళ్ళు విరుచుకుని తేరిపార చూశాను. నాయుడుగారి మేడ రాజ భవనంలా ఉంది. తోట మధ్యలో ఉంది పురాతన కట్టడమయినా దృఢంగా ఉంది. కొత్తగా వెల్ల వేశారేమో చలువరాతి సౌధంలా మెరుస్తోంది. గ్రౌండ్ ఫ్లోర్ గదుల్లో ఎవరెవరో ఉన్నారు. ఫస్ట్ ఫ్లోర్నంతా బ్యాంకికి కేటాయించారు. సెకెండ్ ఫ్లోర్‌కి నడిచాను. ఒకేఒక పెద్ద గది ఉందక్కడ. అందులోనే నా నివాసం!

పరుగు పరుగున నౌకరొచ్చాడు. గది తాళం తీసి, సూట్‌కేసులు లోపలుంచాడు. రిక్షావాలాకి డబ్బులివ్వనుంటుండగా–

"పద్దుబాబూ! ప్రసాద్‌బాబుగారంతా చూసుకున్నారు" అని వెళ్ళిపోయాడు. నవ్వుకుని గదిలోనికి నడిచాను. నేలంతా దుమ్ముకొట్టుకుపోయుంది. గోడల్ని పరికించి చూశాను. ఎదురుగా గోడపై నిలువెత్తు చిత్రపటం ఉంది. అందమయిన యువతి చిత్రం! అర్ధ నగ్నంగా ఉంది. శిరోజాలను విశృంఖలంగా ముందుకి గుండెలమీద పడవేసి, రాతిపై యాటవాల్చుగా కూర్చునుందా యువతి. మోకాల్పై ఒకదానిపై నొకటిగా చేతుల్నుంచింది. ఆ భంగిమ చూడ ముచ్చటనిపించింది అర చేతి వెడల్పునున్న లతలూ, చిలుకలూ గల ఫ్రేములో, ఆ తైల వర్ణ చిత్రంలో జీవం ఉట్టిపడుతోంది అయితే శుభ్రపరిచే నాథులు లేకపోవడంతో షట్టి కొట్టుకు పోయుందది. బూజు పట్టి ఉంది దృష్టిని మరల్చుకోవడం కష్టసాధ్యమయింది.

బాత్‌రూంలోనికి నడిచాను. ఆసరికే రెండు బకెట్లతో నీళ్ళుంచి వెళ్ళాడు నౌకరు టైం చూస్తే పదవుతోంది. మరో అరగంటలో ఆఫీసుకి సిద్ధం కావాలనుకుని, ఆ ప్రయత్నాల్లో పడ్డాను. ఆదరాబాదరాగా బయల్దేరడంతో ఏ సూట్‌కేసులో ఏమేముంచిందీ తెలియక, అన్నీ తెరచి కావాల్సిన వాటికోసం అంతా చిందర వందర చేశాను. స్నానం అయిందనిపించి, ఎలా ఉన్న వాటిని అలానే ఉంచి, గదికి తాళం వేసి ఆఫీసుకి బయల్దేరాను. సాయంత్రం వరకు తనకి అంతూ పొంతూ లేకుండా పోయింది. ఏడు గంటలకి ఊపిరి పీల్చుకున్నాను. ప్రసాద్ గాడింకా రాలేదేమిటా? అనుకుంటూ, గదికి చేరాను. తాళం తీసి, లైటు వేసి చూద్దునో! గదెంతో శుభ్రంగా ఉంది సూట్‌కేసులు ఓ మూలగా ఒద్దికగా అమరి ఉన్నాయి టేబుల్‌మీద పుస్తకాలు పోర్టబుల్ టైప్ మిషన్ సర్ది ఉన్నాయి మంచమ్మీద ఇస్త్రీ చేసిన దుప్పటి పరచి ఉంది బీరువా తెరచి చూశాను. హేంగర్లకు వేలాడుతూ బట్టలు కన్పించాయి చిత్రమనిపించింది అగరొత్తులు వెలిగించినట్టున్నారు. గదంతా వాటి ధూమంతోను, వాసనతోనూ నిండి ఉంది తాళం నౌకరుకి ఇవ్వనేలేదుకదా! ఇదెలా సంబవమని కాసేపు ఆలోచించాను. వాడి దగ్గర డూప్లికేట్ కీ ఉండి ఉంటుంది చాలా శ్రమ తీసుకున్నా డనుకున్నాను వచ్చి, బాల్కనీలో నిలిచాను. అప్పుడొచ్చాడు ప్రసాద్

"సారీరా" అన్నాడు

"ముచ్చటకో ఫోటో ను పెళ్ళివారు తీయాలన్నారు. ఒప్పుకున్నాక తప్పుతుందా! అన్ని ముచ్చట్లూ అయ్యేసరికి ఈ వేళయింది" అన్నాడు ఇద్దరమూ గదిలోనికి నడిచాం మంచమ్మీద కూర్చున్నాం

"అదృష్టవంతుడివి గురూ! గొప్ప ఉద్యోగాన్ని

దెయ్యాల కథల పోటీలో సాధారణ ప్రచురణకి ఎంపికైన కథ





ఇంటివాళ్ళదే అయుంటుంది" అన్నాను.

"ఒక్క స్నాప్ తీసుకుంటా గురూ" ప్రాధేయపడ్డాడు.

"తీసుకో" అన్నాను ఒక్క స్నాప్ అని చెప్పి ఫ్లాష్ నుపయోగించి ఆరేడు ఎక్స్పోజ్ చేశాడు ప్రసాద్.

"కంఠాభరణాన్నొకదాన్ని చిత్రీకరిస్తే ఇంకా బాగుండేది! మెడమీద ఏమీ లేకపోవడంతో బొమ్మ బోసిపోయినట్టుగా లేదూ" అడిగాడు.

కొత్తేం కావు! ఈ ఫర్నీచరంతా బ్యాంక్ వాళ్ళదేనా", అడిగాడు ప్రసాద్.

"కామన్ ఫర్నిచరంతా వాళ్ళే సమకూరుస్తారు?" అన్నాను వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు ప్రసాద్ కాళ్ళని టీపాయ్‌మీద ఉంచి, విలాసంగా వొరిగాడు

"పెళ్ళెప్పుడు చేసుకుంటున్నావు" అడిగాడు

"ఇంకో రెండు మూడేళ్ళు ఆగాలి" అన్నాను

"కారణం '

"సిటీ బ్రాంచ్‌కి ట్రాన్స్‌ఫర్ అయ్యేవరకూ పెళ్ళి చేసుకోకూడదనుకుంటున్నాను" అన్నాను

"అంటే, ఇక్కడీ ఊళ్ళో ఉండటం నీ కిష్టం లేదా? ప్రశ్నించాడు

"ఇక్కడ పుట్టి పెరిగావు కాబట్టి నీకీ చుట్టుప్రక్కల ప్రాంతాలంటే ఇష్టం ఉండొచ్చు! నాకెలా ఉంటుంది? బస్తీ బతుక్కి అలవాటయిన వాణ్ణి" అన్నాను

. సంభాషణలా సాగిసాగి కలసి చదువుకున్న కాలేజీ సంగతుల దగ్గర, కలసి ప్రేమించిన రెండు జెళ్ళ సీత దగ్గర, నశ్యాన్ని పీల్చే అలవాటున్న సీత తండ్రి మాటల ప్రమాదం దగ్గర మలుపులు తిరిగి తిరిగి మళ్ళీ మొదటి కొచ్చింది

"ఇక్కడికి వస్తున్నావని తెలిసి, జీవితాంతం తోడుంటావనుకున్నాను గురూ" అన్నాడు ప్రసాద్. కొద్దిగా డీలా చెందాడు

తొమ్మిది కావస్తోంటే, 'వెళ్ళొస్తానని' లేచి నిల్చుని స్థాణువయిపోయాడు గోడమీది తైల వర్ణ చిత్రం చూస్తూ చేష్టలుడిగాడు.

"ఏమిటా వెర్రి చూపులు" అని మనిషిని కుదిపేవరకూ ఈ లోకం లోనికి రాలేక పోయాడు ప్రసాద్

"గొప్ప పెయింటింగ్ గురూ! ఇదీ మీ ఆఫీసువాళ్ళదేనా?" అడిగాడు

"కాదు" అన్నాను

"చూస్తుంటే తెలియడంలే! ఏనాటిదో ఇది!

"తడి గుడ్డతో శుభ్రం చేయించు! గది కిదే అలంకారంగా ఉంటుంది" అని సలహా పారేశాడు. భోజనానికి తనతో పాటు, వాళ్ళ గ్రామం రమ్మన్నాడు కుదరదని ప్రసాద్‌ని ఒప్పించేసరికి కాతలు దిగివచ్చారు.

"ఇక్కడుండేవాణ్ణేగా! తరచూ వస్తాలే" అన్నాను. కూడలి వరకూ ప్రసాద్‌ను దిగవిడిచి అక్కడే ఉన్న `అణా కాఫీ హోటల్లో భోంచేసి వద్దామని బయల్దేరాను. నౌకరు ఎదురు వచ్చాడు.

"కారియర్ తేనా సార్" అడిగాడు వద్దని, తాళం వేసి నడిచాను. పది గంటలకి తిరిగొచ్చాను. గదికి తాళం తీసి, బట్టలు మార్చుకుని లుంగీని

# కన్నీటి శిథిలాలు

ధరించాను. అవసరపడి బాత్రూమ్ దగ్గరగా వెళ్ళాను వేసి ఉన్న తలుపును నెట్టాను. ముందుకు పోలేదది! బలమంతా ఉపయోగించినా లాభం లేకపోయింది లోపల గడియ పెట్టినట్టున్నారు. నీళ్ళ చప్పుడు వినవచ్చింది తలుపుకి చెవొగ్గి వినసాగాను. ఎవరో స్నానం చేస్తున్నట్టున్నారు.

"ఎవరండీ లోపల" గట్టిగా కేకేశాను. క్షణం తర్వాత తలుపు తెరుచుకుంది నన్నెవరో వొరుసుకు వెళ్ళిన స్పర్శ కలిగింది. చూస్తే ఎవరూ లేరు.

బాత్‌రూం మాత్రం అత్తరు వాసనలతో గుబాళిస్తోంది ఎవరో స్నానం చేసిన గుర్తులు స్పష్టంగా కన్పించాయి సబ్బు నురుగు సన్నని పాయకట్టి నిలిచి ఉంది బకెట్టులో నీళ్ళు అడుగంటి ఉన్నాయి. ఆలోచించాలోచించి తల బద్దలు కొట్టుకున్నాను అంతు చిక్కలేదేదీ? ఉన్న నీళ్ళతో నే ముఖం కడుక్కొని వచ్చి కుర్చీలో కూర్చున్నాను టేప్ రికార్డర్‌లో చిట్టిబాబు వీణను వింటూ కళ్ళు మూసుకున్నాను నిద్ర ముంచుకొస్తోంది. రికార్డర్ని ఆఫ్ చేసి తలుపులు వేసి, అప్రయత్నంగా గోడమీది చిత్ర పటాన్ని చూశాను. మట్టి కొట్టుకుపోయున్న చిత్రం, ఇప్పుడు మిలమిలా మెరుస్తూ కన్పించింది.

బూజు లేదు శుభ్రంగా సరికొత్తగా అగుపించింది. అందమయిన యువతి, మరింత అందంగా కాంతులీనుతోంది. మెదడంతా మొద్దుబారు తున్నట్టుంటే, వెళ్ళి మంచమ్మీద బోర్లా పడ్డాను మెలకువ వచ్చేసరికి తెల్లగా తెల్లారింది.

గదిని ఊడ్చేందుకు నౌకరు వచ్చినప్పుడు అడిగాను

"ఈ మేడకట్టి ఎన్నేళ్ళవుతుందంటావు"

"యాభై, అరవైయ్యేళ్ళవుతుంది బాబూ" సమాధాన మిచ్చాడు.

"పూర్వం ఈ గదిలో ఎవరుండేవారు"

"నాయుడుగారుండేవాడు! ఆయన పడక గదిది" అన్నాడు

"నాయుడుగారు చనిపోయి ఎన్నేళ్ళయింది"

"యాభై ఏళ్ళపైనయింది ఆయనుంటే ఈ మేడ నిలా అద్దెల కిచ్చేవాడు కాదు" అన్నాడు నౌకరు

రాత్రి సంఘటనల ననుసరించి నౌకరునలా ప్రశ్నించడం జరిగింది. మూఢ నమ్మకాలు, ఆలోచనలూ లేవు గాని, ఎందుకో వాటిని కొట్టి పారేయాలనిపించడం లేదు గదిలో ఏదో గందరగోళం జరుగుతోందని మనసు పదే పదే చెబుతోంది. భయపడడం మాటలా ఉంచితే, అనేక భ్రమలకు గురికానున్నాననిపించింది.

తర్వాత ఆఫీసు పనిలో పడి అంతా మరచి పోయాను చీకటి పడింది. గదికి చేరి, మంచమ్మీద వెల్లకిలా పడి, విశ్రాంతి తీసుకుందామనుకున్నానో లేదో క్షేమంగా చేరినట్టు నాన్నగారికి, మిత్ర బృందానికీ ఉత్తరాలు రాయలేదని గుర్తొచ్చింది బద్ధకించడం మంచిది కాదనుకున్నాను తల దిమ్ముగా ఉంటే ముఖ ప్రక్షాళన చేసొచ్చి, పనికి ఉపక్రమిద్దామని బాత్‌రూంలోనికి నడిచాను. ఇంతలో టైప్ చేస్తోన్న ధ్వని విన వచ్చింది. గబగబా గదిలోనికి వచ్చి చూశాను. టైప్ మిషన్‌పై పేపర్ ఫీడ్ చేసి ఉంది. పేపర్‌పై 'ఐ లవ్ యు' అని టైప్ చేసి ఉంది పరుగున బాల్కనీలోనికి వచ్చి చూశాను. ఎవరూ కన్పించలేదు. అంతుచిక్కక ఆలోచనలు చేశాను. ఈ దోబూచులాట ఎవరు సాగిస్తున్నారు? నన్నెవరు ప్రేమిస్తున్నారు? అన్న మీమాంసలో పడ్డాను. ఆకలవుతోంటే హోటల్‌కి బయల్దేరాను తిరిగొచ్చి టేప్ రికార్డర్‌లో చిట్టిబాబు వీణను వింటూ నిద్రిద్దామనుకుని ఆన్ చేసేసరికి అందునుంచి వీణలాంటి సన్నని గొంతు విన వచ్చింది.

"నిన్ను నేను ప్రేమిస్తున్నాను! నిన్ను నేను ప్రేమిస్తున్నాను"

పదే పదే అదే మాట కేసెట్‌ను ఎటు తిప్పినా, ఏ మూల నుండి ఆన్ చేసినా ఒకటే మాట! చిట్టిబాబు వీణంతా చిత్రమయిన గొంతులా ఎలా మారిందన్నది అర్థం కాలేదు. పాటలా ప్రతిధ్వని స్తోందా మాట! రాగరంజితంగా ఉంది. ఆశల్ని కలిగిస్తోంది. అనుభూతుల్ని పంచుకోమని ప్రోత్సహిస్తోంది.

గోడమీది చిత్ర పటం వైపు చూశాను. ఎందుకో అందులోని యువతిని స్పృశించాలనిపించింది. వెళ్ళి, ముందుగా ఆమె శిరోజాలను చేతితో తాకాను పట్టుకుచ్చులా తగిలింది. బుగ్గల్ని నిమిరాను. మెత్త మెత్తగా తగిలాయి. పెదవులమీద చూపుడు వేలుంచి, కింది పెదవిని నొక్కాను. పలువరుస కన్పించింది. షాక్ తిన్నాను. చేతిని వెనక్కి లాక్కొని, తీక్షణంగా చూశాను చిత్రపటం మునుపటిలానే కానవచ్చింది ధైర్యం చేసి, మోకాలిపై ఒకదానిపై ఒకటిగా ఉన్న యువతి చేతుల్ని నిమిరి, రెండు చేతుల్తోనూ పట్టి లేపి, ముందుకు లాగాను. కూర్చున్న స్థానం నుంచి లేచి నిల్చుని, ఫ్రేములోంచి నడచి వచ్చిందా యువతి చేష్టలుడిగాను. పెద్దగా కేక లేద్దామనిపించింది గొంతు పెగల్లేదు. నిలువునా వణికి పోయాను నాకు నేనుగా ధైర్యం చెప్పుకునేందుకు కొంత సమయం పట్టింది. తర్వాత గుండె నిబ్బరంతో -

"ఎవరు నువ్వు" అని ప్రశ్నించాను

"సారికని" అందామె బయం భయంగా చూడసాగింది ఆమె భయపడడాన్ని గమనించి, నేను ధైర్యాన్ని పుంజుకున్నాను.

"కూర్చో" అన్నాను కుర్చీలో ముడుచు క్కూర్చుందామె విలపించ సాగింది.

"ఎందు కేడుస్తున్నావు" అడిగాను. వెంటనే జవాబు చెప్పలేదు. రెట్టించి అడిగేసరికి, పెద్దగా రోదించింది. అనునయించ జూశాను. దగ్గరగా నడిచి, ఆమె తల నిమిరాను. నా చేతుల్ని అంది పుచ్చుకుని, వాటిలో తన ముఖాన్నుంచి మరింతగా విలపించింది

"ఏడవకు! నీ బాధేమిటో చెప్పు? గుండె బరువు దించుకో" అన్నాను. ఆశగా చూసింది నన్ను. ఆప్యాయంగా నా చేతుల్ని నొక్కి వదిలింది

"నాయుడుగారి తోటమాలి కూతుర్ని నేను. అమ్మ లేదు. నాన్నే, అమ్మగా నన్ను పెంచుకొచ్చాడు. పువ్వుల మధ్య సీతాకోకలా, మేడమీది పావురాయిలా సరదాగా, చలాకీగా తిరిగే రోజుల్లో నాయుడుగారి పడక గదిని అలంకరించేందుకు ఆయన స్నేహితుడు జేమ్స్, బ్రిటన్ నుంచి వచ్చారు. జేమ్స్ మంచి చిత్రకారుడు. పైప్‌ను పీలుస్తూ, ఇరవై నాలు గ్గంటలూ ఏవేవో బొమ్మలు చిత్రిస్తూ కన్పించే వాడు అర్ధ నగ్నంగా, అందమైన బొమ్మను పడకగదిలో ఏర్పాటు చేయాల్సిందిగా నాయుడు గారి ఆజ్ఞ!

జేమ్స్ ఎన్ని బొమ్మలు గీసినా, ఏ ఒక్కటీ నాయుడుగారికి నచ్చలేదు. ఊహా చిత్రాల్లో జీవం తొణికిసలాడదని ఆయన నమ్మకం! జేమ్స్ చిత్రాలన్నిటినీ కొట్టి పారేశారు. లాభం లేదనుకుని,



జేమ్స్ మోడల్‌గా అందమయిన అమ్మాయిని ఎన్నిక చేయదలిచాడు. ఆ విషయాన్ని నాయుడుగారికి చెప్పాడు ఫలితంగా రాజమండ్రి నుంచి, పెద్దాపురం నుంచి, విజయనగరం నుంచి ఎందరెందరో వేశ్యల్ని రప్పించి, చూశారు. ఏ ఒక్కరూ నాయుడుగారికి నచ్చలేదు వృత్తి రీత్యా చూపుల్లో వెకిలితనానికి అలవాటయిన ఆ స్త్రీల కళ్ళల్లో స్వచ్ఛత లేదని తిప్పి పంపేశారు తోటలో పుట్టి పెరిగినా, నేనెన్నడూ నాయుడుగారి ఎదుట పడలేదు. అలానే జేమ్స్ చూపులకి కూడా అందక, తిరిగేదాన్ని! ఒకానొక రోజు విధి వక్రించింది. నేను ఆ ఇద్దరి కళ్ళకీ కన్పించాల్సి వచ్చింది అంతే! జేమ్స్ కళ్ళల్లో ఉత్సాహాన్ని గమనించాను నాయుడుగారి కళ్ళలో మెరుపును చూశాను భయపడ్డదంతా అయింది. ఆ రాత్రి నాన్నను నాయుడుగారు పిలిచి. జేమ్స్ గీయనున్న చిత్రానికి నన్ను మోడల్‌గా ఎన్నిక చేసినట్టు చెప్పారు కాదనరాదని నాన్నని బెదిరించారు. ఎదురు తిరిగితే పుట్టగతులుండవన్నారు. తప్పని సరయింది కన్నీళ్ళతో. నాన్న అంగీకరించాల్సి వచ్చింది నాకా విషయాన్ని చెప్పలేకే ఎంతగానో దుఃఖించారు నాన్న. చివరికి చెప్పి. తను తండ్రిని కాదన్నాడు తార్పుడుగాణ్ణన్నాడు క్షమించమని వేడుకున్నాడు

నన్ను మోడల్‌గా పెట్టుకుని జేమ్స్ నా చిత్రం గీయడం మొదలు పెట్టిన క్షణం నాన్న ఉరిపోసుకుని మరణించాడు కళ్ళ ముందు నాన్న దహనక్రియలు జరుగుతున్నా కదలగూడదని నిర్దేశించడంతో నిర్బంధించడంతో గుండెల్లోనే రోదనంతా అణచుకుని దుఃఖాన్ని ఉగ్గబట్టుకుని ఉక్కుబొమ్మయ్యాను ఏకాగ్రత చెదరరాదన్న కారణంగా జేమ్స్ అహోరాత్రులూ బొమ్మను గీస్తూ భంగిమను ఏమాత్రం మార్చినా బొమ్మ అభాసు పాలవుతుందని సూచిస్తూ నన్ను కట్టడి చేశారు దాహంతో నోరెండిపోతున్నా నీరును తాగనీయలేదు ఆకలి వేసినా అన్నాన్ని ముట్టనివ్వలేదు గాలినే భోంచేస్తూ గడపాల్సి వచ్చింది అంతులేని ఆవేదన ఒక ప్రక్క! ఆకలి మరో ప్రక్క! వీటితో వారం రోజులు నెట్టుకొచ్చి నెట్టుకొచ్చి చివరికి శ్వాసను పోగొట్టుకున్నాను చనిపోయాను నాటికి బొమ్మ పూర్తయింది జేమ్స్ ఆనందానికి నాయుడుగారి సంతోషానికీ అవధులు లేకపోయాయి ఉప్పొంగిపోయారిద్దరూ ఆత్మగా అక్కడికక్కడే సంచరిస్తోన్న నేను, ఈ మేడను ఆ తోటనూ విడవలేక చిత్రపటాన్ని నీడగా చేసుకున్నాను పటానికి ప్రాణమయ్యాను సూర్యకాంతికి భయం భయంగా బతుకుతూ వెన్నెల కిరణానికి, నక్షత్రకాంతికీ జీవాన్ని పుంజుకుంటూ జీవిస్తూ వస్తున్నాను' అన్నది సారిక ఊపిరి పీల్చుకుంది ఏకధారగా ఏడ్చేడ్చి అలసిపోయింది నా చేత ఆసరాగా తలనాన్చి శ్వాస తీసుకోసాగింది

సారిక కథ విన్న తర్వాత నాయుడుగారి దౌష్ట్యం మీద వారి జమిందారీ దర్పం మీదా ఏహ్యం కోపమూ నాకు పుట్టుకొచ్చాయి తిరుగాడే తూనీగను పట్టి చిద్రుపలు చేసినంత సులువుగా ఓ మానవ జీవనాన్ని ఓ యవ్వనాన్ని మలిచేయడం అమానుషత్వం అన్పించింది ఆగ్రహం పెల్లుబుకింది నాయుణ్ణి ఉద్దేశించి 'ఛుత్' అన్నాను సారికను గుండెలకదుముకున్నాను ఆమె కన్నీళ్ళను కొనగోట తుడిచి సానుభూతి చూపాను ఐ లవ్‌యూ అన్నాను ఆ రాత్రంతా కూర్చుని కబుర్లాడుకున్నాం! తన బాల్యాన్నంతా చెప్పుకొచ్చింది సారిక చిన్ననాటి చిలిపి చేష్టలను అద్భుతాలనిపించే సాధారణ విషయాలను చెప్పి. చెప్పి నవ్వించింది పిల్లిని చూసి భయపడేదట తను! చీకటిని చూసి చెంతితు రాలయ్యేదట! సన్నజాజి గుబురులో దెయ్యమున్నదని ఎవరో చెబితే పగలు కూడా ఆ పూల మొక్క కడకు వెళ్ళేది కాదట! అటువంటిది, తానిప్పుడు ప్రేతాత్మనని, ప్రజలు భయపడే శూన్యాన్నని చెప్పుకుని బాధపడింది తొలి కోడి కూసింది తెల తెలవారనుంది సూర్యకాంతి ప్రసరించిందో లేదో అదృశ్యమయిపోయింది సారిక చిత్రపటంలో చిత్రంగా ఇమిడిపోయింది

గదిలో నేను ఒంటరిని కాదని తెలిసింది మదిలో కూడా ఏకాకిని కాదని తెలుసుకున్నాను తెల్లారితే చీకాకుపడుతూ చీకటిపడితే సంతసిస్తూ, సారికతో సంభాషిస్తూ బతుకును అలంకరించుకోసాగాను ఓసారి, సారికను చుంబించాలనిపించింది ఆమె పెదవులను నా పెదవులతో అందుకోజూశాను దూరంగా జరిగింది సారిక వద్దని వారించింది

'నేను ప్రేతాత్మను! నన్ను ముద్దిడాలని చూసినా అనుభవించాలని చూసినా కోరి కోరి నువ్వు మరణాన్ని కొనితెచ్చుకున్నట్టు! రోజు రోజుకీ క్షీణించి చనిపోతావు అన్నది

స్నేహం తప్ప మనిద్దరి మధ్యా శారీరక సంబంధాలుండకూడదు అన్నది నా ఆవేశాన్ని ఇణచివేసి నా ఆశలను అణగార్చింది

నిండుగా నూరేళ్ళు బతుకు! కావాలని కనుమరుగవకు అని వేడుకుంది

రోజులు గడుస్తున్నకొలదీ సారికను కాదని మనలేననిపించింది ఆమెను స్వంతం చేసుకోక జీవించలేననిపించింది ఆ విషయాన్ని సారికకి తెలియజేసేసరికి, ఆందోళనగా చూసింది నావైపు

నేను ఆత్మహత్య చేసుకుంటాను! నీ తోడుగా వచ్చేస్తాను! వెన్నెల్లో కలసి తిరుగుదాం! వేకువలో కలసి మరణిద్దాం' అన్నాను తన చేతి వేళ్ళతో నా నోటిని సున్నితంగా మూసివేసింది సారిక చెమర్చిన కళ్ళతో నన్ను ఎగాదిగా చూసింది ఉద్రేకంగా నా తలని తన గుండెలకదుముకుని- '

చాలయ్యా! నా జీవితానికిది చాలు! రేపు వేకువలో కరిగిపోతాను' అన్నది సారిక నా ప్రయత్నాన్ని, నిర్ణయాన్నీ నిరోధించే విధానంతో నాకు నచ్చజెప్ప జూసింది జీవిత మధురిమలను గూర్చి వివరించజూసింది అయినా నేను మొండిగా పట్టుబడితే నీ ఇష్టం అంది మౌనం వహించింది

మర్నాటి రాత్రికి పెళ్ళికొడుకుని కాదలచాన్నేను! సంప్రదాయబద్ధంగా సారికను వివాహమాడ దలచాను!

మాంగల్యాన్ని-కొని కుంకుమతో వెన్నెల కిరణం కోసంవేచి చూశాను వెన్నెల కిరణం విచ్చుకుంది సారిక సాక్షాత్కరించింది స్నానం చేసి రమ్మన్నాను స్నానించి, వచ్చి ఎదురుగా నిలిచింది నుదుట

## పత్రికల మీద షబ్నా ఆగ్రహం!



సహజంగా నటీ నటులు సినిమాల్లో ఛాన్సులు రాకపోతే సంఘ సేవ అంటూ ఊరి మీద పడుతుంటారని ప్రతీతి. అమీర్ ఖాన్, సోనువాలియా, సంగీత బిజ్‌లానీలు ఈ కోవలోకే వస్తారట. ఇటీవల జితేంద్ర యింట్లో ఏర్పాటైన సమావేశంలో దిలీప్‌కుమార్, డింపుల్, వినోద్ ఖన్నాలతోపాటు షబ్నా అజ్మీ కూడా పాల్గొన్నది. ఈ సమావేశంలో షబ్నా పత్రికల వారిపై విరుచుకుపడిందట.

రాజకీయాలలో నటీనటుల ప్రవేశంపై వారు అడిగిన ప్రశ్నలకు భారతీయ బాలల చలన చిత్రోత్సవ సొసైటీకి ఛైర్‌పర్సన్‌గా యిటీవల ఎన్నికైన షబ్నా బదులిస్తూ ఏదో మంచి చెయ్యాలనే తాపత్రయంతో మేము ముందుకు వస్తాం. కాని మమ్మల్ని దుయ్యబట్టాలని మీరు చూస్తుంటారు అని కోపగించుకుందట.

# హాస్య నటుడి ఆహ్వాన పత్రం



ME and my OWN family
invite you and your family
to bless the wedding of

**MASOOM ALI** (Made in India)

(Grand son of Late Mumtaz Ali -4th son of alive Mahmood Ali)

with

**DEBBY alias MUMTAZ** (Made in U S A)

(Daughter of Mr & Mrs Robert Lee Sr)

on 20th January 1990

At ALI ESTATE

YELAHANKA—BANGALORE (North)

Get together & dinner

between 5 P M & 9 P M

With Best Compliments from
none of my Relatives
Except
my Horses & Dogs

With Love and Regards
Mahmood



హిందీ హాస్యనటుడు మెహమూద్ తన కొడుకు మసూమ్ ఆలీకి అమెరికా అమ్మాయితో పెళ్లి చేశాడు. ఈ పెళ్లికి సంబంధించిన ఆహ్వాన పత్రం మెహమూద్ సహజ హాస్య రసానికి ఏమాత్రం తీసిపోకుండా వుంధట. ఆ ఆహ్వాన పత్రం మీద తన కుటుంబంలోని వ్యక్తులందరి కారికేచర్లు వున్నాయట. మనం మామూలుగా శుభలేఖ చివరన బంధుమిత్రుల అభినందనలతో అని వేస్తాముకాని మెహమూద్ మాత్రం నా గుర్రం, కుక్క అభినందనలతో అని వేయించాడట తన హాస్యధోరణిని రుజువు చేసేలా!

## కన్నీటి శిథిలాలు

కుంకుమ దిద్ది, మాంగల్యధారణ గావించాను నరనారాయణుల ఆశీస్సులు లభించకున్నా సారిక, నేనూ ఆలుమగలమయ్యాం!

బాల్కనీలో, వెన్నెల్లో సారికతో మమేకమవుతోన్న వేళ, తలుపు చప్పుడయింది సారిక భయం భయంగా పటంలో చిత్తరువై నిలిచింది. విసుక్కుని వెళ్ళి, తలుపు తెరిచాన్నేను ప్రసాద్ వచ్చాడు

"ఏంటి గురూ! అప్పుడే నిద్రా" అడిగాడు. నా వాలకాన్ని నఖశిఖ పర్యంతం పరీక్షించి "ఏంటలా ఉన్నావు" అని ప్రశ్నించాడు జవాబుగా ఏమీ లేదన్నట్టు పెదవులు చిట్లించాను గదిలోనికి నడిచాడు వాడు చిత్రపటాన్ని తేరిపార చూసి ఖంగుతిన్నాడు

"బొమ్మ మెళ్లో మంగళసూత్రాలెక్కడివి" అని అడిగాడు ఆశ్చర్యపోయాడు

"మెడ నిండుగా ఉంటుందని చిత్రించావా? చిత్రింపజేశావా" అని ప్రశ్నించాడు చేత్తో వాటిని తడిమి, సారిక మెడను నిమిరాడు. అంతే! ప్రసాద్ చెంప 'చెళ్'మంది దెబ్బకి 'అబ్బా' అన్నాడు ప్రసాద్ చెంపను నిమురుకుంటూ "కొట్టావా" అనడిగాడు నన్ను సమాధానమేమీ పాలుపోలేదు నిశ్శబ్దంగా నిలిచాను. గదంతటినీ పరిశీలనగా చూడసాగాడు ప్రసాద్ ఏమనుకున్నాడేమో! మరోసారి సారిక మాంగల్యం మీద చేతి నుంచే ప్రయత్నం చేశాడు మళ్లీ వాడి చెంప 'చెళ్'మంధి బెంబేలెత్తిపోయాడు గది బయటకు పరుగెత్తుకెళ్ళాడు. నన్ను పిలిచి-

"దెయ్యాల మేడిది గురూ! పారిపోదాం పద" అన్నాడు.

"నువ్వెళ్ళు! నేను రాను" అన్నాను.

"చస్తావురా" హెచ్చరించాడు. నవ్వాన్నేను.

"నీ కర్మ" అని వడివడిగా వెళ్ళిపోయాడు ప్రసాద్. తలుపులు వేసొచ్చి, నేను, సారికా పగలబడి నవ్వుకున్నాం.

"పాపం" అన్నాను.

"లేకుంటే నా మాంగల్యం మీద చేయి వేస్తాడా" అన్నది సారిక మాంగల్యాన్ని కళ్ళ కద్దుకుంది. మురిసిపోయింది. సారికను అలా గమనిస్తూ, నేనో గొప్ప సాహసాన్ని, సహాయాన్నీ చేసినట్టు అనుభూతి చెందాను చేతులు జాపి, ఆహ్వానించాను. నా ఆవాహనను అందుకుంది సారిక

చల్ల చల్లని వెన్నెల్లో, వెచ్చ వెచ్చగా వేగిపోయాం! కాలం తెలిసి రాలేదు. కోడి కూత వినరాలేదు. సారికను బిగి కౌగిట బంధించి, నిద్రలోనికి జారుకున్నాన్నేను.

మెలకువ వచ్చి చూసేసరికి తెల్లగా తెల్లారిపోయింది. బద్ధకంగా వళ్ళు విరుచుకున్నాను. కాస్తంత నీరసంగా, నలతగా ఉన్నట్టనిపించినా, గడచిన రాత్రిని తలచుకుని బలాన్ని తెచ్చుకున్నాను. గదిలోనికి వచ్చి, గోడ మీది చిత్రపటాన్ని చూసి గగ్గోలెత్తిపోయాను. ఫ్రేములో బొమ్మలేదు తెల్లగా కాన్వాసు కన్పిస్తున్నదంతే!సారిక ఏమయినట్టు? ఆదుర్దా చెందాను. నేల మీదికి దృష్టి సారించాను. ఫ్రేము క్రింద పెచ్చులు పెచ్చులుగా, పొరలు పొరలుగా చిత్రమంతా రాలిపడి, గుట్టగా ఉంది. అందులో మాంగల్యం మెరుస్తూ కన్పించింది. అంటే!? సారిక సూర్యకాంతికి కరిగిపోయిందా? అన్పించింది. వేకువ కేకకి కూడా నా కౌగిలి నుండి విడివడలేదా?మృత్యువును కోరుకుందా? నా కోసం తనువునే త్యజించిందా? త్యాగించిందా అన్పించి, విలపించాను, మోకాళ్ళపై కూర్చుని, నుగ్గు నుగ్గయిన చిత్తరువును, మాంగల్యాన్నీ చేతుల్లోనికి తీసుకున్నాను గుండెకదుముకుని రోదించాను

ఆలోచనలుడిగిపోతోంటే, చిగురంత ఆశగా సారికను ప్రసాద్ ఫోటో తీసిన విషయం గుర్తుకు వచ్చి, పరుగు పరుగున వాడింటికి వెళ్ళాను. ఫోటో ఉంటే చాలు! సారికనలా చూసుకుంటూ జీవితాంతం గడిపేయగలననిపించింది.

ఫిల్మను డెవలప్ చేస్తున్నట్టున్నాడు. ప్రసాద్ డార్క్ రూమ్‌లో ఉన్నాడు. ఆత్రంగా తలుపు తట్టి, పిలిచాను వాణ్ణి. తలుపు తెరుచుకుంది. ఎక్స్పోజ్ ఫిల్మను చేత్తో పట్టుకుని, విచారంగా కన్పించాడు ప్రసాద్. నేను మాట్లాడనుంటుండగా, నన్ను వారించి, వాడే అన్నాడు-

"ఆ మధ్య నీ గదిలోని బొమ్మను ఎక్స్పోజ్ చేశాను చూడూ, దాన్ని డెవలప్ చేసేసరికి, ఏమీ లేకుండా పోయింది. సరిగ్గాఎక్స్పోజ్ కాలేదో ఏమో మరి"

వాడి చేతిలోని ఫిల్మను తీసుకుని ఆత్రంగా చూశాను. అంతా నల్లగా ఉంది. 'గొల్లు'మన్నాను. నా పరిస్థితి అర్థంగాక, నన్ను ఓదార్చేందుకు సిద్ధమయ్యాడు ప్రసాద్. నా భుజాల చుట్టూ చేతులుంచాడు.

నేను నిండుగా నూరేళ్ళు బతికేందుకు సారిక బూడిదయింది. అంతులేని ఆవేదనని నాకు మిగిల్చి, అందని లోకాలకి తాను ఎగిరిపోయింది. ఎక్కడని అన్వేషించను? ఎవరికి నా మొర విన్పించను? సారికా! నా సారికా!!

## యువతా! కవితా!

### మనీషి

రాగ
ద్వేషాలమయం
మనిషి
జీవితం!
రాగాన్ని త్రెంచి
ద్వేషాన్ని పెంచితే
వాడు రాక్షసుడు!
ద్వేషాన్ని త్రుంచి
రాగాన్ని పంచితే
వాడే
మనుషుల్లో
దేవుడు !!

-"సింహం"

### మిన్న

నిన్న మొన్నొచ్చిన'ఆలి'కాదురా మిన్న!
నిన్ను నవమాసాలుమోసి,
ఆలించి, లాలించి, పాలించి,
నీ 'ఆలి'కందించిన తల్లిరా మిన్న!!

-తోట గంగాభవాని

### గుండె కన్నీరు!

ఉండే
పిడికెడు గుండె
సవాలక్ష వెతలను
ఓర్చుకోలేకనే
కడివెడు నీళ్లను
కళ్లద్వారా కసుక్కున
కక్కేస్తున్నది !!

-వి. జయరామిరెడ్డి

### రుక్కులు

పెండ్లికి సమర్పించాలి చెక్కులు
అందుకై చేస్తారు మ్యాజిక్కులు
తరువాత మొదలు ఎన్నోచిక్కులు
అగ్నిమంటల్లో అమ్మాయిదేహపుతొక్కులు
కాలికాలి లేస్తాయి పొక్కులు
చావు వార్త వ్యాపిస్తుంది నలుదిక్కులు
పోరాటం సలపటం మానవహక్కులు
ఇక ఆపలేరు ఆర్తురాంధ్ర వాక్కులు
నేటి సమాజానికివే అసలైన రుక్కులు!

'భావన'

సీరియల్

# వజ్రసంకల్పం

సాతేవాహన

(గత సంచిక తరువాయి)

ఎదురుగా ఓ యువకుడు ఫుల్ సూట్లో నిలబడున్నాడు అతన్ని చూస్తూనే ఆమె కళ్లు వున్నట్టుండి పెద్దవయ్యాయి. చేతులు రెండూ తనకారు టాప్‌మీద వేసి బాగా ముందుకు వంగి విండో గుండా తన వైపే చూస్తున్నాడతను. అతని కళ్ళు తీక్షణంగా వున్నాయి. పింకీ గుటకలు వేసి ఏదో అనబోయింది. గొంతులోంచి మాటలు పెగల్లేదు.

అతను వున్నట్టుండి నిటారుగా అవుతూ తనే బయట్నించి డోర్ నాబ్‌మీద చెయ్యేసి తిప్పాడు. క్లిక్ మంటూ తెరుచుకుంది డోరు. అతను డోరు బార్లా తెరిచిపెట్టి స్వాగతం పలుకుతున్నవాడిలా నిలబడ్డాడు. అతని కళ్ళింకా ఆమెని తీక్షణంగా చూస్తూనే వున్నాయి. పింకీ మళ్లీ ఏదో అనబోయింది. మళ్ళీ నోరు పెగల్లేదు. ఈ సారి నోరు పెగలకపోవడానికి కారణం యాక్సిడెంట్ కాదు- అతను!

పింకీ తన జీవితంలో అంత అద్భుతమైన వ్యక్తిని ఎక్కడా చూడలేదు. ఆరున్నర అడుగులకు పైబడే వుంటాడు. ఎత్తుకు తగిన దృఢమైన శరీరం. అతను ధరించిన ఫుల్ సూటు అతని శరీరదారుఢ్యాన్ని దాచలేకపోతోంది. పచ్చగా బంగారు రంగులో మెరిసిపోతున్న వదనం. వొత్తుగా స్టైల్‌గా వున్న జుట్టు నిర్లక్ష్యంగా గాలికెగుర్తూ అతని నుదుటిమీద అలవోకగా పడుతోంది. తీర్చిదిద్దినట్టున్న గాఢమైన కనుబొమలు. సూటిగా తనకేసి చూస్తున్న విశాలమైన కళ్లు. పొడవాటి ముక్కు. క్రోధంతో బిగుసుకున్న ఎర్రని అద్భుతమైన పెదాలు. నీట్‌గా షేవ్ చేసుకున్న గడ్డం. సన్నని మీసాలు. ఎవరైనా అతన్ని చూస్తూనే అప్రతిభులై కళ్లప్పగించి అలా చూస్తూ వుండిపోవడం ఖాయం. ప్రస్తుతం పింకీ పరిస్థితి కూడా అలాగే వుంది.

అతను కోపంతో రెండడుగులు ముందుకేసి మరోసారి కొద్దిగా ముందుకు వంగి ఆమెకేసి మరింత తీక్షణంగా చూశాడు.

"దిగండి!" కటువుగా అన్నాడు.

ఓహ్! ఇతని గొంతుకూడా ఎంత అద్భుతంగా వుంది. కోపంతో మాట్లాడ్డంతో కంచులా ఖణేల్ ఖణేల్‌మంటోంది.

అతను చెప్పిందేమిటో అర్థంకానట్టు పింకీ అతనికేసి ఇంకా కళ్లప్పగించి చూసింది.

"దిగండి!" మరోసారి ఖంగుమందతని కంఠం.

"ఊ? "

"ఐసే గెట్ డౌన్!"

అతనేం చెబుతున్నాడో అప్పుడర్థమైందామెకి. కాలు బయటపెట్టి నెమ్మదిగా కిందికి దిగింది.

అతను చప్పున ఆమె చెయ్యి పట్టుకున్నాడు. దాదాపు బలవంతంగా ఆమెని రెండడుగులు ముందుకు లాక్కెళ్ళి చూపుడు వేలితో తన కారు వైపు చూపించాడు.

"చూశారా ఏం జరిగిందో?" మీ కారు ముందు భాగం నా కారు వెనక భాగం వచ్చడైపోయాయి.

ఆమె అతని చూపుడు వేలు వెంబడి కళ్ళప్పగించి చూసింది.

నిజమే.

అతని కారు వెనకభాగం తనకారు ముందుభాగం బాగా దెబ్బతిన్నాయి. కళ్ళు తిప్పి మళ్ళీ అతనివైపు అర్థరహితంగా చూసింది.

ఆమె మాట్లాడకపోవడంతో అతని కోపం రెట్టింపైంది.

"చేతిలో స్టీరింగుంటే చాలదు. మెదడులో ఆలోచన కూడా వుండాలి. కారుందికదాని ఎడాపెడా తోలెయ్యడమేనా? బుద్ధుండక్కర్లా? ఇంట్లో చెప్పే వచ్చారా?' '

అతను దులిపేయడం ప్రారంభించడంతో ఆమె తేరుకుని తనని తాను అదుపులోకి తెచ్చుకుంది.

"సారీ!"

ఆమె గొంతులోంచి మాటబయటికి రావడంతో ప్రవాహంలా చెప్పుకుంటూ పోతున్న అతను హఠాత్తుగా ఆగిపోయాడు. అతని కళ్లు ఆపాదమస్తకం ఆమెని పరిశీలనగా చూశాయి.

"సారీ అంటేనే సరిపోతుందా? చూసి కారు నడపక్కర్లేదా? అసలు మీకు డ్రైవింగ్ లైసెన్సుందా? లేక రోడ్డుమీద పోయేవాళ్ళ మీద కారెక్కించడానికి బయల్దేరి వచ్చారా?"

అతనింకా అలా అంటూండగానే పింకీ ఓసారి తన చుట్టూ చూసింది. దగ్గర్లో పోలీసు వాళ్ళెవరూ లేరు. యాక్సిడెంటు జరగడం చూసిన జనం కొంతమంది కొద్దిసేపు అక్కడే నిలబడిపోయి ఎవరికీ దెబ్బలు తగలకపోవడంతో నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారు.

సిటీ!

ఇక్కడేం జరిగినా అంతే. యాక్సిడెంటు జరిగితే ఎవరికీ స్పందనవుండదు. ప్రాణాలుపోతే ఎవరికీ సానుభూతి వుండదు. యాక్సిడెంటు జరిగితే జోక్ కిందికొస్తుంది. బాగా ట్రాఫిక్ వుండే చోట యాక్సిడెంటు జరిగితే ట్రాఫిక్ జామ్ చేసినందుకు యాక్సిడెంటుకు గురైనవాళ్ళమీద తిట్లూ శాపనార్థాలూ వినిపిస్తాయే తప్ప ఎవరి ప్రాణాలైనా పోయాయేమోననే ఆదుర్దా ఎవరూ కనబర్చరు.

సిటీ!

జనారణ్యం!

తమ చుట్టూ ఎవరూ పెద్దగా గుమిగూడకపోవడంతో. అందులోనూ పోలీసు వాళ్ళెవరూ కనుచూపు మేరలో కనిపించకపోవడంతో పింకీకి ధైర్యం వచ్చింది.

**ఇంతవరకూ సాగినకథ -: 25** విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో దొరికిన అపురూప వజ్రాన్ని అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. వజ్రపాణిని దెబ్బతీసేందుకు విశ్వధరవర్మ ఎదురు చూస్తుంటాడు. జైలర్ సత్యం కూతురు పింకీ, ఆమె అనుచరుడు ప్రభు చేస్తున్న మోసాలను కనిపెడుతున్న జూడా, డేవిడ్‌లు తమతో వారిద్దరినీ చేతులు కలపమంటారు. ప్రపంచంలోని ఎన్నో రకాల వజ్రాల గురించి తెలిసిన పింకీ వజ్రపాణి దగ్గరున్న వజ్రం గురించి జూడా ద్వారా తెలుసుకొని మణిపురం కొండల్లో వున్న వజ్రపాణి హవేలీకి ఒంటరిగా పయనమవుతుంది.

"ఏవిటంట పెద్ద మాట్లాడుతున్నారు? సారీ చెప్పినా వినిపించుకోరేం? మీ కారే కాదు-నా కారుకూడా పాడైంది. నేనూ మీలాగే గొంతుచించుకుంటున్నానా? నా కారుకి అడ్డం వచ్చింది చాలక మళ్ళీ మాట్లాడుతున్నారు!" అడ్డంగా దబాయించెయ్యడంతో అతని కళ్ళు హఠాత్తుగా విచ్చుకుని ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాయి.

"ఓహో! మీరా లైన్లో వస్తున్నారా! సరే, తప్పునాదే! పదండి పోలీసు రిపోర్టిద్దురుగాని!"

అతను పోలీసు మాటెత్తడంతో పింకీ చటుక్కున నాలిక్కర్చుకుంది.

"ఏవండీ కదలరు? పదండి పోలీస్ రిపోర్టిద్దురుగాని," రెట్టించాడతను.

పింకీ లొంగిపోదల్చుకోలేదు.

"ఆహా! పదండి. పోలీసులంటే నాకు భయమనుకున్నారేమో! మా మేనమామగారెవరో తెలుసా? డి.ఐ.జీ. ఆఫ్ పోలీస్!" గర్వంగా చూస్తూ అడ్డంగా కోసేసింది.

అతను మరికొద్ది క్షణాలు ఆమె వంక పరిశీలనగా చూశాడు. హఠాత్తుగా అతని మొహంలో క్రోధం తగ్గిపోయి ముడివడిన కనుబొమలు విడిపోయాయి. పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. కళ్ళల్లో ఒక్కక్షణం కొంటె తనం ప్రవేశించి అంతలోనే అదృశ్యమైపోయింది.

"ఓహో! అయితే డి.ఐ.జీ. గారు మీకు మేనమావ అవుతారన్నమాట!" సీరియస్గా అయిపోతూ అన్నాడు.

"అక్షరాలా!"

"మీతో పరిచయం కలిగినందుకు చాలా సంతోషం మేడం. నేనెవర్నో విన్నవించుకోమంటారా?" వినయంగా చూశాడు.

"విన్నవించుకోవచ్చు!"

"ఇన్స్పెక్టర్ చిదానందం! సి.ఐ.డి.! డి.ఐ.జీ.గారు- అదే మీ మేనమామగారు నాకు బాబాయౌతారు. వారే నాకీ వుద్యోగం వేయించారు కూడా! ఇక వెళ్దామా?"

పింకీ రెండు చేతులూ ఎత్తి నెత్తిమీద వేసుకుంది.



"మెగాడ్! మీరు ఇన్స్‌పెక్టర్ చిదానందమా?"

"అక్షరాలా!"

"డి.ఐ.జీ.గారు మీ బాబాయా?"

"అక్షరాలా!"

"వారే మీకు వుద్యోగం యిప్పించారా?"

"అక్షరాలా!"

"సార్ సార్, సారీ సార్! మనం మనం రాజీ అయిపోదాం. ఓకే? మీ అంత పెద్ద సి.ఐ.డి. ఆఫీసరు చిన్న ట్రాఫిక్ కానిస్టేబుల్లా అంతకంటే చిన్న యాక్సిడెంట్లని పట్టించుకోగూడదు సార్! కావలిస్తే మీ కారు డామేజీ అయిన డబ్బు ఎంతౌతుందో నేనిస్తాను. వీలు కాదంటే కొత్త టొయొటో కారే కొనిస్తాను. నన్నొదిలెయ్యండి సార్."

అతని పెదవుల మీద చిరునవ్వు మరింత పెద్దదైంది.

"అలా రా దారికి ఆల్ రైట్, ఇక ముందెప్పుడూ కారుని స్పీడుగా డ్రైవ్ చేయనని మాటిస్తావా?"

"పొరపాటైపోయింది క్షమించండి సార్! ఇకముందెప్పుడూ కారు స్పీడుగా డ్రైవ్ చెయ్యను. ఆ మాటకొస్తే అసలు కారే డ్రైవ్ చెయ్యను. ఇక వదిలేస్తారా సార్?"

"అంత సులువుగా వదుల్తానా? చెవులు పట్టుకో!"

"అలాగేసార్!"

"నావికాదు- నీవి!"

"అలాగేసార్. నాచెవులే పట్టుకున్నాను."

"చెంపలు వాయించుకో- నావి కాదు, నీవి!"

"వాయించుకున్నాను సార్!"

"గట్టిగా!"

"గట్టిగానే సార్!"

"గుడ్! ఇక దయచెయ్!"

"మీ కారు డామేజీ అయిన డబ్బు వద్దాసార్?"

"వద్దులే దయచెయ్!"

"థాంక్యూసార్! థాంక్యూ వెరీమచ్ సార్!"

"అతి వినయం ధూర్తలక్షణం. ఇంక కదులుమరి!"

ఆమె కదల్లేదు.

"ఏం కదలవ్?"

"ఎలా సార్ కదిలేది?"

"ఏం?"

"నా కారు మడ్గార్డు మీ కారు మడ్గార్డులో ఇరుక్కుపోయింది."

"ఐసీ!" అప్పుడే ఆ విషయం గమనిస్తున్న వాడిలా అన్నాడతను.

"ఇప్పుడెలాసార్? మెకానిక్‌ని రప్పించనా? పోనీ, క్రేన్ తెప్పించనా?"

"అలాంటివేమీ వద్దుగానీ, నువ్వెళ్ళి నీ

# మానవనిర్మిత వజ్రం కల్పనకాదు-వాస్తవం!

**క్యూబిక్** జిర్కోనియా ఈ రచయిత వూహాగానం ఎంత మాత్రమూకాదు. వినడానికిది చాలా ఆశ్చర్యంగా అనిపించినా మనిషి ఇప్పుడు వజ్రాలు తయారు చెయ్యగలుగుతున్నాడు. ప్రకృతితో పోటీపడి సృష్టికి ప్రతిసృష్టి చేస్తున్నాడు. ఇది నిజం!

ఈ అద్భుతం సాధించగలిగిన వాళ్లు విదేశీయులు కాదు- మన భారతీయులు. మొట్టమొదట వజ్రాలు మనిషి కూడా తయారు చెయ్యొచ్చుననే వూహ కలిగిన వ్యక్తి రంజిత్‌సింగ్. ఆయనకు మెటలర్జీలో డాక్టరేట్ వుంది. అమెరికాలోని మెసాచుసెట్స్ యూనివర్శిటీ నుంచి తెచ్చుకున్న పట్టా అది. రంజిత్‌సింగ్ తన పరిశోధనల్లో శ్రీనాథ్‌సింగ్ అనే స్నేహితుడ్ని కలుపుకున్నాడు. ఇద్దరూ కలిసి ఈ అద్భుతం సాధించగలిగారు. టెర్రీ ఫియరాన్ అనే అమెరికన్, ఎడ్వర్డ్ అనే మరో భారతీయుడు ఆ ఇద్దరు స్నేహితులకు సాయపడ్డారు. వజ్రసంకల్పం కథానాయకుడికిస్ఫూర్తి రంజిత్‌సింగే. సింగ్ తయారు చేస్తున్న వజ్రాలు ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ఎలిజబెత్ టేలర్ వంటి ప్రపంచ ప్రఖ్యాతి చెందిన నటీమణితో పాటు ఎందరో తమ ఆభరణాల్లో ఉపయోగిస్తున్నారు. ఈ వజ్రం




అభినవ విశ్వామిత్రుడు-రంజిత్‌సింగ్

## వజ్రసంకల్పం

కార్లో కూర్చుని స్టార్ట్‌చెయ్."

"స్టార్ట్ చెయ్యాల్సిన అవసరం లేదు సార్- ఇంజన్ ఆఫ్‌కాలేదు."

"అయితే వెళ్ళి నీ కార్లో కూర్చో!"

"యస్‌సార్!" ఆమె సెల్యూట్‌కొట్టి తన కార్లో వెళ్ళి కూర్చుంది.

అతను రెండుకార్ల మధ్యకు నడిచి ఓసారి పరీక్షగా చూశాడు. ఆమె చెప్పింది నిజమే! ఆమెకారు మడ్గార్డు తనకారు మడ్గార్డులో ఇరుక్కుపోయింది. తలతిప్పి ఆమెవైపు చూశాడు.

స్టీరింగ్ వీల్ ముందు కూర్చున్న ఆమె లోలోపల నవ్వుకుంటూ అతనివైపు అమాయకంగా చూస్తోంది. అతను తనవైపు చూస్తూనే కారు విండోలోంచి తలబయట పెట్టింది.

"లాభం లేదా సార్? జాకీ తియ్యాల్సిందేనంటారా?"

"ముందు నువ్వు కాసేపు కుదురుగా కూర్చో!" ఆజ్ఞాపించాడతను.

ఆమె రకీమని నోరుమూసుకుని తల లోపలకి తీసుకుంది.

అతను పెదవులు బిగబట్టి మరోసారి రెండు మడ్గార్డుల వైపు పరీక్షగా చూశాడు.

అంతే!

ఆ మరుక్షణం అతను చేసిన పనికి పింకీ షాక్‌కొట్టిందాన్లా అయిపోయింది.

అతను ఎడంచేతిని పింకీ కారు మడ్గార్డు కిందికి పోనిచ్చాడు. పింకీ చూస్తూనే వుంది. అతను అమాంతం ఎడంచేత్తో పింకీ కారు పైకెత్తేశాడు. చిన్నగా శబ్దం చేస్తూ అతని కారు మడ్గార్డులో ఇరుక్కున్న ఆమె కారు మడ్గార్డు సునాయాసంగా బైటికొచ్చేసింది. అతను ఎడంచేత్తో పింకీ కారునలా పైకెత్తి పట్టుకునే కుడిచేత్తో తన టొయొటోని ముందుకు తోశాడు. టొయొటో కొంత ముందుకెళ్ళిపోయి నిలబడింది. అతను పింకీ కారు కిందికి దించేసి రెండుకార్ల మధ్యా నిలబడి చేతులు దులుపుకున్నాడు. తర్వాత ఏమీ జరగనట్టుగానే ఆమె కారు వైపు వెళ్ళాడు.

ఆమె కళ్ళప్పగించి అతన్నింకా చూస్తూనే వుంది.

అతను ఆమె మొహం మీద చిటిక వేశాడు.

"కళ్ళు తెరుచుకునే నిద్రపోతున్నావా?"

ఆమె వులిక్కిపడి విస్మయంలోంచి తేరుకుంటూ అతని కళ్ళలోకి చూసింది.

అతను చిన్నగా నవ్వాడు.

"ఆడపిల్లవి గనక నిన్ను తేలిగ్గా వదిలేస్తున్నాను. అదే మగవాడివై వుంటే నా కారు పాడుచేసినందుకు మూడు చెరువుల నీళ్ళు తాగించే వాడిని. దయచేసి మరో యాక్సి

## వజ్రసంకల్పం నేపథ్యంలో

తయారు చేయగలగడానికి సింగ్ పదేళ్లపాటు అష్టకష్టాల కోర్చి రాత్రింబవళ్లూ కష్టపడాల్సొచ్చింది. ఈ ఇద్దరు స్నేహితులూ అమెరికాలోని మోరిన్ అనే టౌను వజ్రాల కార్ఖానాగా మారిపోయేలా చేయగలిగారు.

సింగ్ చెబుతున్న మాటల్లో ఎంత మాత్రం వాస్తవం వున్నదో తెలుసుకోవడానికి అమెరికా టెలివిజన్‌కు చెందిన ఓ ఇన్వెస్టిగేటర్ సింగ్ వజ్రాలు కొన్నింటిని న్యూయార్క్‌లోని ప్రపంచ ప్రఖ్యాతి చెందిన వజ్రాల నిపుణులతో పరీక్ష చేయించాడు. ఆ వజ్రాల నిపుణులు వాటిని జాగ్రత్తగా పరిశీలించి ఇవి అసలైన వజ్రాలేనని తేల్చి చెప్పారు. అవి మానవ నిర్మిత వజ్రాలని వాళ్లు కూడా కనుక్కోలేకపోయారు

'ఇవి డూప్లికేట్ వజ్రాలు కదా' అని ఎవరైనా అంటే సింగ్ ఒప్పుకోవడంలేదు డూప్లికేట్ వజ్రాలనో ఇమిటేషన్ డైమండ్స్ అనో తమ వజ్రాల్ని పిలవడం అన్యాయం అంటాడాయన వాటిని సబ్‌స్టిట్యూట్ డైమండ్స్ అనిగానీ డైమండ్స్ ఎసెన్స్ అని గానీ పిలవాలంటాడు. ఆయన తన వజ్రాలకు డైమండ్ ఎసెన్స్ అనే పేరు పెట్టాడు విశ్వామిత్ర సృష్టి చెయ్యగలిగిన ఈ ఇద్దరు మిత్రుల్ని చూసి మనం భారతీయులుగా గర్వపడాల్సిందెంతో వుంది అదే సమయంలో మన మేధావులు విదేశాలకు తరలిపోతున్నందుకు బాధపడాల్సిన అవసరం కూడా చాలా వుంది ఈ లోపం ఆ మేధావుల్లో లేదు-మన ప్రభుత్వ విధానాల్లో వుంది

ఈ వజ్రాల్ని ఎలా తయారు చేయవచ్చో ముందు ముందు మీరు నవలలో చదువుతారు



చెర్రిఫియరాన్‌తో శ్రీనాథ్‌సింగ్

---

డెంట్ చెయ్యొద్దు ఈసారి యాక్సిడెంట్ చేశావంటే అవతలి వాళ్ళు నేను చూపించినంత జాలి చూపించకపోవచ్చు ఇక నీదారి నీది నాదారి నాది గుడ్‌బై!"

అతను హుందాగా పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ వెళ్ళి తనకారు డ్రైవింగ్ సీట్లో కూర్చోబోతుండగా అక్కడే నిలబడి తమాషా చూస్తున్న ఓ వ్యక్తి ముందుకొచ్చి అతని జబ్బపట్టుకున్నాడు

"ఏం బాడీసార్! ఎడం చేత్తో కారు పైకి లేపగలిగినవాళ్ళని మిమ్మల్నే చూశాను మీరు ఏ బాడీ బిల్డింగ్ ఇన్‌స్టిట్యూట్లో పనిస్తారు సార్! అడ్రసు చెబితే నేనూ అక్కడ చేరతాను"

అతను విసుగ్గా చూసి తన జబ్బ పట్టుకున్న అతని చెయ్యి దులిపేశాడు

'హుసేన్‌సాగర్ మధ్యలో ఒంటిస్తంభం మేడ వుంటుంది- అందులో నా ఇన్‌స్టిట్యూట్ వెళ్ళి చేరు," డ్రైవింగ్ సీట్లో కూచుని దభీమంటూ డోరు మూశాడు

అతను వదల్లేదు జిడ్డులా పట్టుకున్నాడు

- "హుసేన్‌సాగర్ మధ్యలో వుండేది ఒంటి స్తంభం మేడకాదు సార్, గౌతమ బుద్ధుడు అదీ యింకా ఆయన్నక్కడ ప్రతిష్ఠించలేదు"

"ప్రతిష్ఠించాక వెళ్ళి ఆయన్నే ఆశ్రయించు గుడ్‌లక్," అంటూ తన కారు స్టార్ట్‌చేసి ముందుకు పోనిచ్చాడు

ఆ కారు వెళ్ళిపోయేంత వరకూ చూస్తూ నిలబడిపోయిన అతను పింకీ కారు వైపుగా వచ్చాడు

"ఏమండీ! ఆ బాడీ బిల్డర్ అడ్రసు మీకు తెలుసా?"

"ఇన్స్‌పెక్టర్ చిదానందం, సి ఐ డి బ్రాంచాఫీసు, లక్డీకాపూల్," తనకారు ముందుకు పోనిస్తూ అందామె

అతను అర్థంకానట్టు కళ్ళప్పగించి చూస్తూం డిపోయాడు

కారు ముందుకు పోనిస్తున్నదల్లా పింకీ ఆగిపోయి రివర్స్‌గేర్లో మళ్ళీ వెనక్కొచ్చింది.

"అన్నట్టు డి ఐ జి ఆఫ్ పోలీస్ ఆయనకి బాబాయి. వెళ్ళగలిగితే అక్కడికీ వెళ్ళొచ్చు. టాటా!"

ఈసారి స్పీడుగా కారు ముందుకెళ్ళిపోయింది

అతను బుర్రగోక్కుంటూ నిలబడిపోయాడు.

పింకీ కారు కొంచెం స్లోచేసి ముందుకు పోనిస్తోంది ఈసారి మళ్ళీ యాక్సిడెంటు చెయ్యడం ఆమె కిష్టంలేదు' అదృష్టవశాత్తూ కారు ముందుభాగం దెబ్బతిన్నప్పటికీ ఇంజనుకేంకాలేదు యాక్సిడెంటువల్ల ఇంజను కొంచెం పెద్దగా శబ్దం చేస్తున్నప్పటికీ కారు స్మూత్‌గా ముందుకెళ్ళిపోతూనే వుంది

పింకీకింకా ఆ దృశ్యం కళ్ళముందు కదులుతున్నట్టుగానే వుంది

ఎవరైనా ఎడంచేత్తో అంత సునాయాసంగా కారుముందు భాగాన్ని పైకి లేపగలడా? కళ్ళతో చూసిన సంఘటన అబద్ధమెలా అవుతుంది? మహమ్మదలీ రెండు చేతుల్తోనూ అలా కారు పైకెత్తగలడని వింది ఇప్పుడు కళ్ళతో ఇతన్ని చూసింది ఇతను ఖచ్చితంగా ఒలింపిక్ ఛాంపియన్ అయివుండాలి కానీ, ఇండియాకి ఒలింపిక్ ఛాంపియన్లంటూ ప్రస్తుతం ఎవరూ లేరే ఇతను అవుతాడు కోబోలు ఈసారి ఒలింపిక్స్ జరిగినప్పుడు జాగ్రత్తగా ఫాలో కావాలి

హఠాత్తుగా ఆమెకేదో గుర్తుకొచ్చింది.

ఎడంచేత్తో స్టీరింగ్ కంట్రోల్ చేస్తూ కుడిచేత్తో వళ్ళోపడున్న పర్సు పైకెత్తిచూసింది

ఆమె పెదవులమీద అల్లరిగా చిరునవ్వు మెరిసింది అతన్తో మాట్లాడుతున్నప్పుడు అతనికి తెలీకుండా అతని జేబులోంచి కొట్టేసిన పర్సది.

ఆమె ఒక చేత్తో డ్రైవ్‌చేస్తూనే పర్సు తెరిచి చూసింది. పర్సులో వందనోట్లు బొత్తిగా వున్నాయి ఆమెకు ఇంట్రెస్టు కలిగించింది ఆ నోట్లుకావు పర్సులో నోట్లతోపాటు కొన్ని విజిటింగ్‌కార్డులు నీట్‌గా పెట్టి వున్నాయి ఆ విజిటింగ్ కార్డుల్ని

చూస్తునే ఆమె కళ్ళు మెరిశాయి. అతని తాలూకు వివరాలు దొరుకుతాయనే ఆమె ఆ పర్సు కొట్టేసింది- డబ్బుకోసంకాదు!

ఓ విజిటింగ్ కార్డు బైటికి తీసిచూసింది.

వెంటనే ఆమె పెదవులమీద అల్లరిగా మరోసారి చిరునవ్వు మెరిసింది.

దొంగా! ఇన్స్పెక్టర్ చిదానందమా నీపేరు! డి.ఐ.జి. నీకు బాబాయౌతాడా! నాతోపాటు నువ్వూ కోతలుకోస్తున్నావని అర్థం చేసుకోలేనంత అమాయకురాల్నికాదు. అందుకే నీ పర్సు కొట్టేశాను. నువ్వు చెప్పకపోయినంత మాత్రాన నేను తెల్సుకోలే ననుకోకు.

అలా అల్లరిగా నవ్వుకుంటూనే ఆమె మరోసారి ఆ విజిటింగ్ కార్డుపైన రాసున్న అక్షరాలు జాగ్రత్తగా పట్టిపట్టి చదూకుంది. ఆమె పెదవులమీద అతని పేరు అప్రయత్నంగా కదలాడింది.

శ... క్తి.... ధర్....!

శక్తిధర్ - వాటే నేమ్!

మనిషికి తగ్గపేరు.

ఆమె కళ్లు ఆ పేరుకింద రాసివున్న అక్షరాల వెంట పరుగులు తీశాయి.

ఎ. శక్తిధర్,
ఛైర్మన్,
వర్మ క్యూబిక్ జిర్కోనియా ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్,
బ్రాంచ్: హైదరాబాద్.

క్యూబిక్ జిర్కోనియా!

ఆ పేరు చదువుతూనే వులిక్కిపడి ఆ విజిటింగ్ కార్డువైపు కళ్లప్పగించి చూసింది.

క్యూబిక్ జిర్కోనియా!

మైగాడ్!

క్యూబిక్ జిర్కోనియా!

హఠాత్తుగా ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది.

## వజ్రసంకల్పం

## 15

ఆ గది తలుపులు నిశ్శబ్దంగా తెరుచుకున్నాయి. తలుపులు తెరుచుకోవడంతోనే గదివెలుపలి కాంతి కాలసర్పంలా గదిలోపలికి వేగంగా పాక్కుంటూ వెళ్లింది.

గదిలోపల ఓ కుర్చీలో కూర్చుని ఎదురుగావున్న టేబుల్ మీద తలవాల్చి అప్పటివరకూ చీకట్లో కళ్లు తెరిచి పెట్టుకొని కూర్చున్న అమ్మాయి గదిలోపల వెలుతురు వ్యాపించడంతోనే నెమ్మదిగా తలపైకెత్తి చూసింది. అకస్మాత్తుగా గదిలోపల వెలుతురు వ్యాపించడంతో ఆమె కళ్లల్లో సూదులు గుచ్చినట్టుగా అనిపించింది. వెంటనే ఆమె భయవిహ్వలంగా రెండు చేతుల్తోనూ కళ్లు గట్టిగా మూసుకుంది.

"వద్దు! నాకీ వెలుతురొద్దు. తలుపు మూసేయండి. ప్లీజ్ తలుపు మూసేయండి." చిగురాకులా కంపించిపోతూ అరిచిందామె.

సరిగ్గా అదే సమయంలో ఆమెమీద ఎవరిదో నల్లని నీడ గుమ్మం దగ్గర్నుంచి సూటిగా వ్యాపించింది. ఆ వెంటనే ఎవరిదో గొంతు మృదువుగా - చాలా మృదువుగా, చల్లగా చాలా చల్లగా వినిపించింది.

"హుష్! భయపడకు నీలిమా! నేను.....!"

ఆమె నెమ్మదిగా కళ్లకు అడ్డంపెట్టుకున్న చేతులు తొలగించుకుని గుమ్మంవైపు బెదురుకళ్లతో వెర్రిదానిలా చూసింది.

గుమ్మంలో నిలబడి వుందొక నల్లని ఆకారం. కాంతి ఆ ఆకారం మీదికి నేరుగా ప్రసరించకపోవడంతో ఆ ఆకారం ఎవరిదో స్పష్టంగా గోచరించడంలేదు. కనీసం ఆ ఆకారం స్త్రీదో పురుషుడిదోకూడా తెలియడంలేదు.

"ఎ... ఎ... ఎవరు?" తడబడుతున్న గొంతుతో భయం భయంగా ప్రశ్నించిందా అమ్మాయి.

"నేను...!"

"నేనంటే ఎవరు?"

సమాధానంగా ఆ ఆకారం ముందుకు కదిలింది. అప్పటివరకూ గుమ్మానికి అడ్డంగా వున్న ఆ ఆకారం గుమ్మందగ్గర్నుంచి తొలగిపోవడంతో మళ్లీ ఆ గదిలో వెలుతురు నలుమూలలా వ్యాపించింది. దాంతో గదిలోపలికి ప్రవేశిస్తున్న ఆ ఆకారం ఎవరిదో స్పష్టంగా గోచరించసాగింది.

ఈసారి ఆ అమ్మాయి కళ్లల్లో గుచ్చుకుంటున్న వెలుతుర్ని పట్టించుకోలేదు. కళ్లప్పగించి ఆ వ్యక్తివైపే చూస్తూ వుండిపోయింది.

ఆ ఆకారం ఒక యువతిది!

గదిలోపలికి ప్రవేశిస్తూనే ఆ యువతి ఆమె భుజంమీద మృదువుగా చెయ్యివేసింది. ఆమె కళ్లలో అంతులేని సానుభూతి గోచరిస్తోంది.

"నేను నీలిమా! నన్ను గుర్తుపట్టలేదా?" జాలీ వాత్సల్యం వుట్టిపడుతున్న కంఠస్వరంతో అందా యువతి.

నీలిమ ఇంకా కళ్లప్పగించి ఆమెని చూస్తూనే వుంది.

"నేను నీలిమా! గుర్తుపట్టలేదా?"

అప్పటికీ సమాధానంలేదు.

ఆమె కళ్లల్లో శూన్యమూ కొద్దిగా భయమూ తప్ప వేరే భావంలేదు.

"నేను నీలిమా నేను....! పింకీని....! నీ పింకీని నీలిమా! మాట్లాడు నీలిమా...!"

సరిగ్గా అదే సమయంలో తెల్లని దుస్తుల్లో వున్న మరో యువతి ఆ గదిలో ప్రవేశించింది.

"దయచేసి ఆమెని డిస్టర్బ్ చేయకండి. ఇప్పటికీ ఆమె ఎవర్నీ గుర్తుపట్టగలిగే స్థితిలో లేదు!" అందామె.

"కానీ సిస్టర్, ఎన్నాళ్లు? ఇంకా ఎన్నాళ్లిలా...? ఇంకా ఎన్నాళ్లీ చీకట్లో..."

"ప్లీజ్! ఆవేశపడకండి." మృదువుగా అందానర్స్, "ఆమెని మామూలు మనిషిని చేయడానికి డాక్టర్స్ శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తూనే వున్నారు. ఇప్పటికీ ఆమెకు వెలుతుర్ని చూస్తే భయం. మనుషుల్ని చూస్తే భయం. ఆ భయం మాత్రం పోగొట్టలేకుండా వున్నారు. ఆమెచేత మీరు మాట్లాడించడానికి ప్రయత్నించేకొద్దీ ఆమె మరింతగా డిస్టర్బ్ అవుతుంది. ఆమెలోనే భయం మరింతగా పెరుగుతుంది. ప్రస్తుతానికి ఆమెనలా ఒంటరిగా చీకట్లో వదిలేయడం మంచిది."

పింకీ చిన్నగా నిట్టూర్చింది. ఆమె



కళ్లలో కన్నీళ్లు తళుక్కున మెరిశాయి. ఆ కన్నీళ్లు దాచుకోవడానికి ఎలాంటి ప్రయత్నమూ చెయ్యలేదామె. ఆ అమ్మాయి చేతిమీద చెయ్యివేసి బుగ్గమీద మృదువుగా ముద్దుపెట్టింది.

"భయంలేదు నీలిమా! భయం లేదు! నీకు నేనున్నాను. నీకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం చెయ్యడానికి నేనున్నాను. ఆ వజ్రపాణి కోరలు తియ్యందే నేను నిద్రపోను. ప్రామిస్!" ఆ అమ్మాయికి మాత్రమే వినిపించేలా గుసగుసగా అందామె.

నీలిమ మాట్లాడలేదు. కళ్లు పెద్దవిచేసి భయవిహ్వలంగా పింకీకేసి చూస్తోందామె. ఆ చూపుల్లో ఎదురుగావున్న మనిషిని గుర్తుపట్టాలన్న ప్రయత్నం ఎంత మాత్రమూ లేదు. కేవలం అర్థరహితమైన వెర్రిచూపులవి.

పింకీ ఆమెని మరోసారి ముద్దుపెట్టుకుని లేచింది.

నర్సుతో కలిసి పింకీ బైటికొచ్చి గది తలుపులు మళ్లీ మూసేంతవరకూ ఆమెవైపు అలా అర్థరహితంగా చూస్తూనేవున్న నీలిమకు గదితలుపులు మూసుకుని మళ్ళీ చీకటి వ్యాపిస్తూనే మనసులో అంతులేని ప్రశాంతత ఆవరించింది. ఎదురుగా వున్న టేబుల్ మీదికి నెమ్మదిగా మరోసారి తలవాల్చి కళ్ళు తెరచి పెట్టుకుని అలా చీకట్లోకి నిర్విరామంగా చూస్తూ వుండిపోయిందామె.

తలుపులు మూసేముందు ఓసారి గుమ్మం దగ్గరే నిలబడి ఆమెని రెండుక్షణాలు తేరిపారా చూసి మరోసారి నిట్టూరుస్తూ తలుపులు మూసేసి నర్సువైపు తిరిగింది పింకీ.

"ఆమె కండిషన్లో ఎలాంటి మార్పు లేదా?" నిస్పృహగా అడిగింది.

"లేదు. డాక్టర్స్ మాత్రం ట్రైచేస్తూనే వున్నారు. రండి," అంటూ కారిడార్లో ముందుకు దారితీసింది నర్సు. పింకీ ఆమెని అనుసరించింది. మొసాయిక్ ఫ్లోరింగ్ మీద పింకీ హైహీల్స్ టకటకా శబ్దం చేస్తున్నాయి.

"ఒక్క విషయంలో మాత్రం మీరు చాలా అదృష్టవంతులు", చకచకా ముందుకు నడుస్తూనే అంది నర్స్.

"చెప్పండి సిస్టర్!" పింకీ కళ్ళలో ఆశ తొంగిచూసింది.

"డాక్టర్ మార్గరెట్ డిసిల్వా జర్మనీ నుంచి ఇండియాకి తిరిగొచ్చారు. మా ఇన్‌స్టిట్యూట్‌కి తమ సేవలందించడానికి అంగీకరించారు. నీలిమ కేసు ఆవిడ్ని ప్రత్యేకంగా ఆకర్షించింది. నీలిమని ఆవిడ చాలా శ్రద్ధగా స్టడీ చేస్తున్నారు."

డాక్టర్ మార్గరెట్ డిసిల్వా!

ఆ పేరు వింటూనే పింకీ టక్కునాగిపోయింది.

## మరీ పదునైన సెన్సార్ కత్తెర

కొన్ని చిత్రాల విషయంలో ఒక్కొక్కప్పుడు సెన్సార్ బోర్డు వారే ఫలానా సంఘటనలు కథలో కలపాలని సలహాలిస్తుంటారు. కాని యిటీవల నిక్కచ్చిగా వ్యవహరిస్తున్నారట. దురదృష్ట వశాత్తు 'అమావాస్‌కి రాత్' సెన్సార్ కత్తెర్లకు భారీగా గురైందట. నిర్మాత జ్యోతిన్ గోయల్‌ను తిరిగి మళ్లీ నిర్మించమని అడగకపోగా చిత్రాన్నే నిషేధించారట. ఈ చిత్రంలో చిత్రీకరించబడిన దారుణ హత్యలు, హింసాకాండ సెన్సార్ వారిని కలవరపెట్టి వుంటాయి. అంతేగాక ఈ చిత్రం తాంత్రిక శక్తులను ప్రతిబింబింప చేయటమే కాకుండా, ద్వంద్వార్థం వచ్చే సంభాషణలు, అశ్లీల నృత్యాలు చోటు చేసుకున్నాయని బోర్డు అభిప్రాయ పడిందట. పాపం ఈ పరిస్థితి గోయల్ విషయంలో 'పిటీ' నే! ప్చ్...!

డాక్టర్ మార్గరెట్ డిసిల్వా ప్రపంచ ప్రఖ్యాతి చెందిన సైకియాట్రిస్టు. ఆవిడ సైకియాట్రీ మీద డాక్టర్లకి పనికొచ్చే సిద్ధాంత గ్రంథాలేకాదు, సామాన్యులకు పనికొచ్చే పుస్తకాలుకూడా చాలా రాసింది. ఆమె ఇంగ్లీషులో రాసిన ఆ పుస్తకాలు ప్రపంచ వ్యాప్తంగా మిలియన్లకొద్దీ కాపీలు అమ్ముడుపోయాయి. ఢిల్లీ ఆమె నివాస స్థలం అయినప్పటికీ ఆమె ప్రపంచమంతా తిరుగుతూ మానసిక రోగులకు తన అమూల్యమైన సేవలు అందిస్తూ వుంటుంది. నీలిమ కేసు ఆవిడ స్టడీ చేస్తున్నదంటే............!

పింకీ గుండె ఆశతో రెప రెపలాడింది.

"ఏం అక్కడే నిలబడిపోయారు?" ఆమెవైపు చూస్తూ ప్రశ్నించింది నర్స్.

పింకీ వెంటనే రెండడుగులు ముందుకేసి ఆమె చెయ్యి పట్టుకుంది.

"డాక్టర్ మార్గరెట్ డిసిల్వాని కలుసుకోవడానికి వీలౌతుందా?" ఆత్రంగా ప్రశ్నించింది.

నర్స్ పెదవి విరిచింది.

"కష్టం. ముందుగా అ పాయింట్‌మెంట్ లేకుండా........"

ప్లీజ్! నీలిమ కేసు గురించి నేనావిడకు చాలా వివరాలు చెప్పగలను. నా రిక్వెస్ట్ ఆవిడ కాదనలేకపోవచ్చు.

"ఆల్‌రైట్. డాక్టర్ జోసెఫ్ ఆవిడకి అసిస్టెంటు. డాక్టర్ జోసెఫ్ నడుగుదాం. అరుగో డాక్టర్ జోసెఫ్ మాటల్లోనే ఎదురయ్యారు. మీరాయన్ని అడగొచ్చు.

డాక్టర్! వీరేదో మిమ్మల్ని అడగాలనుకుంటున్నారు. అడగండి మిస్ పింకీ!" అంటూ ముందికెళ్ళిపోయింది నర్స్.

పింకీ డాక్టర్ జోసెఫ్ కళ్ళల్లోకి చూసింది.

డాక్టర్ జోసెఫ్‌కి నలభై అయిదేళ్ళుంటాయి. తెల్లగా వున్నాడు. బట్టతల. కళ్ళద్దాల వెనకనుంచి ఆయన కళ్ళు సునిశితంగా చూస్తున్నాయి.

"యస్! వాట్ డూయూ వాంట్ ప్లీజ్?" చాలామర్యాదగా అడిగాడు డాక్టర్ జోసెఫ్.

పింకీ ఆయనకు తన రిక్వెస్టు వివరించి చెప్పింది.

"డాక్టర్ మార్గరెట్ డిసిల్వా చాలా బిజీగా వుంటారు. అయినా అడుగుతాను. మీరు కాసేపు వెయిట్ చెయ్యండి" అంటూ డాక్టర్ మార్గరెట్ డిసిల్వా కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గదివైపు నడిచి స్వింగ్ డోర్స్ తెరుచుకుని నేరుగా లోపలి కెళ్ళిపోయాడు. పింకీ కొద్ది క్షణాలు అక్కడే నిలబడింది.

డాక్టర్ జోసెఫ్ ఎక్కువసేపు ఆలస్యం చెయ్యలేదు. గదిలోంచి బయటికొస్తూనే ఆయన చిరునవ్వుతో పింకీవైపు చూసి, "యస్, డాక్టర్ డిసిల్వా మిమ్మల్ని చూస్తారు. లోపలికెళ్ళండి," అన్నాడు.

"థాంక్యూ డాక్టర్! థాంక్యూ వెరీ మచ్," అంటూ పింకీ స్వింగ్ డోర్స్ తోసుకుంటూ డాక్టర్ మార్గరెట్ డిసిల్వా గదిలోకి ప్రవేశించింది.

డాక్టర్ మార్గరెట్ డిసిల్వాకి కనీసం యాభై అయిదేళ్ళుంటాయి. అయినప్పటికీ ఆమె మొహంలో వృద్ధాప్య లక్షణాలు కనిపించడంలేదు. సన్నగా పొడుగ్గా ఆరోగ్యంగా వుంది. తల వెంట్రుకలు పాయలుగా నెరిశాయి. అచ్చమైన భారతీయ వనితలా మధ్య పాపిడి తీసి సింపుల్‌గా తల వెనక్కి దువ్వుకుంది. ఆమె కళ్ళల్లో తెలివితేటలూ, దయా, కారుణ్యమూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. చూస్తూనే గౌరవించాలనిపించే వ్యక్తి.

"నమస్తే డాక్టర్!" నమ్రతగా రెండు

చేతులూ జోడించి ఆవిడ నమస్కరించింది పింకీ.

ఆమె ఆక్షణంలో జూడాకు ఎదురైన పులిపిల్లకాదు. అతి సాధారణమైన ఆడ పిల్ల. అందులోనూ డాక్టర్ డిసిల్వా ముందు మరింత నమ్రతగా ఒదిగి పోయింది.

"నమస్తే నమస్తే! ప్లీజ్ బీ సీటెడ్!" అందావిడ.

"థాంక్యూ డాక్టర్!" పింకీ కూర్చుంది.

"నీలిమ కేసు గురించి మాట్లాడాలన్నావట. నీలిమ నీకేం కావాలి?" ఇంగ్లీషులో అడిగింది డాక్టర్ మార్గరెట్.

"ఒక ఆత్మీయురాల్ని డాక్టర్!"

"ఆత్మీయురాలు అంటే? స్పెసిఫిక్‌గా చెప్పాలి."

"ఆమె స్నేహితురాల్ని డాక్టర్. ప్రాణ స్నేహితురాల్ని!"

"ఐసీ! చూడమ్మాయ్, ఒక పేషెంటు మంచి చెడ్డలు ఆ పేషెంటు దగ్గరి బంధువులతో తప్ప - అంటే భర్తతోనో భార్యతోనో తల్లిదండ్రులతోనో అన్న చెల్లెళ్ళతోనో తప్ప ఇతరులతో చర్చించడం డాక్టర్‌గా నా వృత్తి ధర్మానికి విరుద్ధం."

"తెలుసు డాక్టర్! కానీ, నీలిమకు దగ్గరి బంధువులంటూ నేను తప్ప మరెవరూ లేరు.



ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్ - నీలిమని ఇక్కడే చేర్పించిందాన్ని నేనే!"

"ఐసీ!" ఆమె చెప్పిన మాటల్లోని మంచిచెడ్డలు బేరీజు వేసుకుంటున్న దానా అంది డాక్టర్ మార్గరెట్. "ఆల్‌రైట్! అలాంటి పరిస్థితుల్లో కేసు గురించి నీతో డిస్కస్ చెయ్యడానికి నా కెలాంటి అభ్యంతరం లేదు."

"థాంక్యూ డాక్టర్!"

డాక్టర్ మార్గరెట్ ఆమె చెబుతున్నది పట్టించుకోనట్టే చెప్పుకుంటూ వెళ్ళింది -

"నీలిమ కేసు హిస్టరీ నేను చాలా జాగ్రత్తగా స్టడీ చేశాను. ఈ కేసులో నన్నాకర్షించిన విచిత్రమైన విషయం ఒక్కటే. నీలిమ చీకటిని ప్రేమిస్తుంది. వెలుతుర్ని అసహ్యించుకుంటుంది. ఇరవై నాలుగ్గంటలూ చీకట్లోనే వుండిపోవడానికి ఇష్టపడుతుంది. ఎవర్నీ గుర్తుపట్టదు. మనుషుల్ని చూసే భయపడుతుంది. ఇలాంటి కేసులు చాలా తక్కువ. అఫ్‌కోర్స్, సైకియాట్రీలో చిత్రమైన కేసులకు కొదవేం లేదు. అయినా ఈ కేసు నన్ను చాలా ఆకర్షించింది. నీలిమ కేసుఫైలంతా జాగ్రత్తగా చదివాను. అయినా నువ్వు చెప్పేదేమిటో నేను వింటాను. ఇలాంటి క్లిష్టమైన కేసుల్లో చిన్న క్లూ దొరికినా చాలు. అందుకే అపాయింట్‌మెంట్ లేకపోయినా నిన్ను లోపలికి రావడానికి అనుమతించాను. నువ్వు చెప్పదల్చుకున్నదేదో చెప్పవచ్చు."

"యస్ డాక్టర్! నాకు తెలిసిందంతా టూకీగా చెబుతాను. మీ టైం ఎంత విలువైందో నాకు తెలుసు. మీ టైం ఎక్కువగా వేస్ట్ చెయ్యను."

డాక్టర్ మార్గరెట్ దయగా నవ్వింది.

"నా టైం గురించి నువ్వు చింతిచాల్సిన అవసరంలేదు. పేషెంట్లకంటే నాకు టైం ఎక్కువ విలువైందేంకాదు. నీకు తెలిసిందంతా విపులంగా నాతో చెప్పవచ్చు. నీలిమ కేసు హిస్టరీ నాకు తెలుసునన్న విషయం మర్చిపో. ఈ కేసు గురించి నాకేమీ తెలియదనుకుని మొదట్నుంచీ చెప్పు. నీ కథలో ఏ చిన్న క్లూ దొరికినా నీలిమని బాగు చేయడానికి ప్రయత్నిస్తాను. ఓకే, ప్రొసీడ్!"

"అది చాలా భయంకరమైన కథ డాక్టర్!"

"భయంకరమైన కథకాబట్టే నీలిమ మనస్సుమీద అంతగా ప్రభావంచూపించింది. ఫర్వాలేదు చెప్పు" అంది డాక్టర్ మార్గరెట్

పింకీ గొంతు సవరించుకొంది.

(ఇంకావుంది)

# వైవాహిక వికాస సంరక్షణలో ఎవరి బాధ్యత ఎంత?



ఇద్దరు భాగస్వాముల మధ్య జరుపబడే ఔదార్యపు పోటీ అని వివాహాన్ని సుందరంగా నిర్వచించారు ప్రేమ, సంరక్షణ అనే పునాదులపై నిర్మింపబడిన భవనంలో ఉద్రేకాలను పంచుకుంటూ, ఒకరినిఒకరు అర్థం చేసుకుని, సంరక్షించుకుంటూ సహజీవనం చేయడానికి స్త్రీ, పురుషుని మధ్య ఏర్పరిచిన శాశ్వత బంధమే వివాహం ఈ ఔదార్యానికి వాస్తవమైన ఆనందాలతో పనిలేదు కేవలం అనుభూతులతో కూడుకున్నది ఇచ్చిపుచ్చుకోవడంతోనే వివాహం సఫలీకృతమౌతుంది

వివాహంతో పురుషునికి బాధ్యతలు పెరుగుతాయి అనడంలో సందేహం లేదు కానీ అదే సమయంలోఅతని జీవితానికి ఒక తోడు ఏర్పడుతుంది స్త్రీకి వివాహంతో ఒక నూతన జీవితం వస్తుంది నూతన వధువు కోటి ఊహలతో, కోర్కెలతో, ఆశలతో నూతన గృహప్రవేశం చేస్తుంది పురుషుడు తన భార్య తన కుటుంబ సభ్యుల పట్ల ప్రేమాభిమానాలు, గౌరవం చూపించాలని ఆశిస్తాడో అదే విధమైన గౌరవం, ప్రేమాభిమానాలు ఆమె కుటుంబ సభ్యుల పట్ల చూపించగల విశాల హృదయం కలిగివుండాలి అప్పుడే భార్యకి మానసికానందం చేకూరుతుంది

సాధారణంగా భారత స్త్రీ తన ఇంటి నాలుగుగోడల మధ్య తనకు తానే బంది అవుతుంది అయితే ఆమె ఇంటిలో కూర్చునే ఎన్నో గొప్ప కార్యాలు నెరవేర్చవచ్చు దానికి భర్త ప్రోత్సాహంవుండాలి భర్త ప్రోత్సాహం కరువైనప్పుడు ఆమెలో నిబిడీకృతమై వున్న నేర్పరితనం ఆమెలోనే అణగారిపోయే అవకాశం వుంది భార్యతోచేరి పెళ్లిరోజుని, భార్య పుట్టిన రోజు పండుగనీ జరుపుకోవడంలో పాలుపంచుకుంటే ఆమె ఎంతో ఆనందిస్తుంది అది ఇరువురిలో కూడా నూతనోత్సాహాన్ని కలుగజేస్తుంది

పెద్ద పెద్ద పట్టణాలలో నివసించే గృహిణులు ఉద్యోగం చేయడం నేడు సర్వసాధారణం అయింది ఈ అదనపు బాధ్యతను నెరవేర్చడంలో భర్త అండ భార్యకెంతో అవసరం చాలా మంది భర్తలు భార్యకి ఇంటి పనులలో సహాయం చేస్తే తమపరువుపోతుంది అని భయపడతారు అది ఒక అపోహ నిజానికిపిల్లల పెంపకంలో తల్లితోపాటు తండ్రి బాధ్యత వహిస్తే పిల్లలు ఆరోగ్యకరంగా భావిపౌరులుగా రాణిస్తారు గృహకృత్యాలలో భార్యకెంత బాధ్యత వుందో భర్తకీ అంతే బాధ్యత వుందనేది నగ్నసత్యం ఏదో ఇంత సంపాదించి భార్యచేతిలో పోయడంతో అతని బాధ్యత తీరదు

అలా అని వైవాహిక జీవితం మూడు పువ్వులు, ఆరుకాయలుగా వెల్లవిరియడానికి పురుషుడు ఒక్కడే బాధ్యుడు అనడానికి లేదు నిజానికి గృహజీవితం నరకప్రాయమవడానికైనా, నందనవనం అవడానికైనా స్త్రీయే మూల కారణం

స్త్రీకి కొంత అణకువ ముఖ్యం అత్తవారింటి కుటుంబ సభ్యులతో ప్రేమగా, గౌరవంగా మెలగడం ఎంతో ముఖ్యం ఆ ఇంటికి తను కొత్త సభ్యురాలు కాబట్టి వారు కొంత చిన్నచూపుతో చూస్తారు అది సహజం అత్తగారు అడపాతడపా విసిరే సూటిపోటి మాటలను లెక్కచేయక, సహనంతో వ్యవహరిస్తే, కుటుంబ కలహాలను కొంతవరకు అరి కట్టవచ్చు తద్వారా భర్తకి భార్య పట్ల మమకారం పెరుగుతుంది క్రమేణా అత్తింటి వారికి ఆమె అంటే ప్రేమ, అభిమానం ఏర్పడుతాయి

నూతన వధువు, తమ పెళ్లికి ముందు అనుభవించిన విలాసజీవితానికి స్వస్తి చెప్పడం ఉత్తమం భర్త వరుంబడికి మించి ఖర్చు చేయకుండా, రాబడికి తగ్గట్లు పొదుపుగా ఖర్చు పెట్టడం అలవర్చుకోవాలి లేకపోతే భర్త భార్య అవసరాలు తీర్చడానికి అవినీతి సంపాదనకు పాల్పడే పరిస్థితి వస్తుంది గృహిణిగా కొంత త్యాగగుణం అలవర్చుకుంటే భవిష్యత్తులో శాశ్వతమైన ఆనందాలుపొందవచ్చు

భార్య తన భర్త చేసే పనులలో పుత్సాహం చూపాలి ఒకరిపై ఒకరికి పూర్తి విశ్వాసం వుండాలి

అసలుసిసలైన భారత స్త్రీలకి ఓ దుర్గుణం వుంది పెళ్లి అయిన తరువాత అలంకరణ పట్ల శ్రద్ధ వహించరు పెళ్లికి ముందు గంటల తరబడి అద్దం ముందు నిలబడి అందానికి మెరుగులు దిద్దుకునే అమ్మాయిలు పెళ్లి అవడమే అక్కడికి తమ అధ్యాయం పూర్తి అయినట్లు అలంకరణ పట్ల అశ్రద్ధ వహిస్తారు అది భర్త ఎదురుచూడని పరిణామం అతను భార్యలో ఈ హఠాత్ మార్పుకి తట్టుకోలేడు మొదటి రోజు భర్తకెదురైనప్పుడు ఆకర్షణీయంగా కనపడాలని ఎలాగైతే తాపత్రయపడ్డారో ఆ తాపత్రయం అంతో ఇంతో కడదాకా వుండాలి

కలలను వాస్తవాలు చేసుకోవాలంటే సమిష్టి కృషి అవసరం అప్పుడే వారి వైవాహిక జీవితం తీరని కల కాక తీయని కల అవుతుంది తక్కువ పుచ్చుకుని ఎక్కువ ఇవ్వడంలోనే వైవాహిక జీవితానందం దాగి వుందని కలలో కూడా మరువకూడదు జంటలు!

—షి



# కర్తవ్యానికి గండి

**దేవతార్చన ముగించి దేవుడి గదిలోంచి బయట కొచ్చాడు రమణయ్య.**

"అబ్బాయి బై.పి. గ్రూపు దొరుకుతేనే చదువుతానంటున్నాడు" అన్నది జానకమ్మ అతడి చేతిలోంచి హారతిపళ్లెం అందుకుంటూ.

భార్య కళ్లల్లోకి ఒకమారు సూటిగా చూసి మౌనంగా వుండిపోయాడు రమణయ్య.

భర్త నోటినుండి ఏమాటా రాకపోవడంతో, "మీరోమారు కాలేజీకి వెళ్లరాదూ" అన్నది మళ్లీ.

"తగిన మార్కులుంటే తప్పకుండా వాడి కా గ్రూపు" దొరుకుతుంది. సీటుకోసం ఎవర్నీ ప్రాధేయపడలేను చిరాగ్గా కనుబొమ్మలు చిట్లించాడు రమణయ్య.

జానకమ్మ ఓ క్షణం ఆగి, "మిమ్మల్ని ప్రాధేయపడమనడంలేదు ఒకమారు అబ్బాయితో కాలేజీకి వెళితేచాలు. మీరు ఎవరైందీ వాళ్లకు తెలుస్తుంది. వాడికి సీటూ వస్తుంది." అంది భర్త నయనాలలోకి ఆశగా చూస్తూ.

భార్య మాట కొట్టిపారేయలేక. "సరే, ఆ లాల్చీ ఇలా పారేయ్" అన్నాడు పంచె సరిచేసుకుంటూ.

తండ్రి నోటినుండి ఆ మాట రావడంతోనే పరమానందభరితుడై దరఖాస్తుఫారం, సర్టిఫికెట్లు ఫైల్లో సర్దుకున్నాడు మురళి.

ఐదో పదిలో కొనసాగుతున్న సగటు మనిషి రమణయ్య తను సముపార్జించిన విజ్ఞానాన్ని పదిమందికీ పంచుతూ, ప్రతిఫలంగా లభించినదానితో తృప్తిగా సంసారం ఈడ్చుకొస్తున్నాడు. అతడికి ముగ్గురు సంతానం. పెద్దవాడు మోహన్ బి.ఎ.పాసై వైజాగులో ఒక ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నా[illegible]. నెల నెలా తండ్రికి రెండొందలు పం[illegible]ావుంటాడు. తరువాతది సుందరి. [illegible]దిగి కూర్చుంది. ఆఖరివాడు మురళి. [illegible] ఏడే పాసుమార్కులతో టెన్త్ అ[illegible]ందనిపించాడు.

రమణయ్య కాలేజీలో అడుగుపెట్టేసరికి ఎన్నెన్నో జ్ఞాపకాల నీడలు కళ్లముందు నర్తించగా భారంగా నిట్టూర్చాడు. అడ్మిషన్ల సమయమవడంవలన ఆఫీసుముందు రద్దీగా వుంది.

'పి. శంకర్రావ్, ఎమ్.ఎ., పిహెచ్.డి., ప్రిన్సిపాల్' బోర్డుచూసి లోపలకెళ్లాడు రమణయ్య.

"నమస్కారం."

"కూర్చోండి" కుర్చీ చూపించాడు శంకర్రావు చేతులు జోడిస్తూ.

"వీడు మా అబ్బాయి మురళి, ఇంటర్లో చేరాలనుకుంటున్నాడు" దరఖాస్తు అందించాడు రమణయ్య.

కొన్ని క్షణాలు వారి మధ్య నిశ్శబ్దం.

"నేనెవరో గుర్తుపట్టారా మాష్టారూ" ప్రశ్నించాడు శంకర్రావు.

"నాకు చూపుసరిగ్గా ఆనదు బాబూ" అంటూ జేబులోంచి అద్దాలు తీసి కళ్లకు తగిలించుకున్నాడు రమణయ్య.

"మీరు కాలేజీ ప్రిన్సిపాలుగా వుండే రోజులలో నేను మీ స్టూడెంటుని."

శంకర్రావు మాటలు తుపాకీ తూటాల్లాగ రమణయ్య గుండెల్ని దూసుకున్నాయి. అంతే, తటాలున లేచి వెనుదిరిగాడు.

"మాష్టారూ!" శంకర్రావు పిలుపు అతడి కర్ణభేరికి చేరిందో లేదో చెప్పడం



కష్టమే.

తండ్రి వింత ప్రవర్తనకు నోరు వెళ్లబెట్టాడు మురళి.

రమణయ్యకు ఎవరూ కనిపించడం లేదు.

గేటుదాటి రోడ్డుమీదకొచ్చాడు. గతస్మృతులు అతడిని ఉక్కిరి బిక్కిరి చేయసాగాయి. ఉన్న పళంగా అతడి ఆలోచనలు పదిహేను సంవత్సరాలు వెనక్కుమళ్లాయి.

* * * *

రమణయ్య యలమంచిలి ప్రభుత్వ జూనియర్ కాలేజీ ప్రిన్సిపాలు. అతనిపాలనలో అవినీతికి అణుమాత్రం తావులేదు.

క్రమశిక్షణ ఆయన ఆరోప్రాణం.

పంక్చువాలిటి అతని ఊపిరి.

రికమండేషన్లు ఆయనముందు బలాదూర్.

అతని సారధ్యంలో కళాశాల ప్రతిష్ఠ వెయ్యిరెట్లు ఇనుమడించిందన్నది స్థానికుల స్థిరమైన అభిప్రాయం.

ప్రముఖ రాజకీయ నాయకుడు శేషాద్రి గారబ్బాయి శంకర్రావు ఆ కాలేజీలో ఇంటర్మీడియేట్ చదువుతున్నాడు. అతడు స్ఫురద్రూపి, మాటకారి, ఐశ్వర్యవంతుడు కావడంతో విద్యార్థులందర్నీ అవలీలగా ఆకట్టుకోగలిగాడు. ఎన్నికల్లో ఏకగ్రీవంగా ఎన్నికై విద్యార్థి సంఘనాయకుడయ్యాడు.

శంకర్రావుకి బుక్సుకంటె డ్రస్సులంటేనే ఇష్టం.

క్లాసులకంటె మ్యాట్నీషోలంటేనే మక్కువ.

ఆకతాయి కుర్రాళ్లను వెంటేసుకుని ఆడపిల్లల్ని అల్లరిచేయడం అతడి హాబి.

లెక్చరర్సుతో గొడవపడటం సరదా.

ప్రిన్సిపాలుగారికి అతడొక క్వశ్చెన్ మార్కు అయిపోయాడు.

శంకర్రావు కాండక్టుమీద కంప్లైంటు చెయ్యని లెక్చరరు లేడు.

రమణయ్యగారు అనేక పర్యాయాలు శంకర్రావుని పిలిపించి గట్టిగా మందలించడం జరిగింది. ఐనా అతడిలో ఆశించిన మార్పు రాలేదు.

ఆ రోజు విద్యార్థులు క్లాసులకు వెళ్లకుండా గేటువద్ద ఔటర్సుతో ఘర్షణపడుతున్నారు. వాతావరణం బాగా వేడిగా వుంది. పేరెంటెవరో శంకర్రావు ఫిల్టు పట్టుకుని హెచ్చరిస్తున్నాడు. పెద్ద గొడవ జరిగేటట్లుంది.

లెక్చరర్సు దూరంనుండి ఆ దృశ్యాన్ని తిలకిస్తున్నారు. ఏ ఒక్కరూ అందులో కలుగజేసుకోవడానికి సాహసించడంలేదు.

రమణయ్యగారు రంగప్రవేశంచేసి స్టూడెంట్సందర్నీ డిస్పర్సు చేసారు. లెక్చరర్లను క్లాసులకు వెళ్లమన్నారు. విద్యార్థులతో ఘర్షణపడుతున్న వ్యక్తిని ఆఫీసురూములోకి రప్పించుకుని తగవు కారణమడిగారు.

"క్షమించండి మీ కాలేజీలో మాలాంటి వాళ్లం ఆడపిల్లల్ని చదివించుకోలేం" వ్యధిత హృదయంతో పలికాడావ్యక్తి.

అతని పలుకులు ములుకుల్లా గ్రుచ్చుకు న్నాయి రమణయ్యగారి హృదయంలో.

"ఇంతకు మీకొచ్చిన ఇబ్బంది ఏమిటో సెలవిచ్చారుకాదు."

"చెప్పడం వలన ప్రయోజనం ఉంటుందనుకోను."

"అలా ఎందుకనుకుంటున్నారో నాకు బోధపడటంలేదు. నా గురించి మీకు పూర్తిగా తెలిసినట్లులేదు. తప్పేదైనా దాన్ని ఖండించడం నా అభిమతం."

"మీ రామాట అన్నారుగనుక చెప్తున్నాను. ఈ కాలేజీ విద్యార్థి శంకర్రావు ఆగడాలకు హద్దులేకుండాపోయింది. ఈ రోజు మా అమ్మాయిని పదిమందిలో ముద్దుపెట్టుకుని పరాభవించాడు. రేపు ఇంకేంచేసినా ఆశ్చర్యపోనవసరంలేదు. పలుకుబడివున్న రాజకీయనాయకుని కొడుకని మిన్నకుంటారో లేక అతడు చేసిన తప్పుకు శిక్షవేసి సంస్థపేరు ప్రతిష్ఠల్ని కాపాడుతారో చూడాలి మరి."

రమణయ్యగారిని సవాలుచేస్తున్నట్లున్నాయి అతని మాటలు.

"మా కాలేజీ విద్యార్థివలన మీకింత పరాభవం జరిగినందుకు క్షంతవ్యుణ్ణి. నా దృష్టిలో స్టూడెంట్సు అంతా సమానమే. ఎవరు తప్పు చేసినా దండించడం నా కర్తవ్యం. లోపం ఎక్కడున్నా సరిదిద్దడం నా బాధ్యత. ఇంత అల్లరికి కారకుడైన శంకర్రావుని కాలేజీనుండి బహిష్కరిస్తున్నాను" గుమస్తాను పిలిచి టి.సి. తయారుచేయమని పురమాయించారు రమణయ్యగారు.

ప్రిన్సిపాలుగారు తగిన సమయంలో తగిన చర్య తీసుకున్నందుకు అంతా హర్షం వెలిబుచ్చారు.

వారం రోజులు గడిచాయి.

ఉరుకులు పరుగులతో కాలేజీకి వచ్చాడు శంకర్రావు తండ్రి శేషాద్రి.

కోపంలో అతడి ముఖం నిప్పుకణికలా వుంది.

శేషాద్రిగారి రాకతో విద్యార్థులంతా ఏం జరుగుతుందోనని వరండాల మీద కొచ్చారు.

లెక్చరర్సు స్టాఫ్ రూము వదలి ప్రిన్సిపాలు గది ముందుకొచ్చారు.

"మీరేనా ఈ కాలేజీ ప్రిన్సిపాలు" అధికార దర్పాలు అతడి స్వరంలో మూర్తీభవిస్తున్నాయి.

"అనేకదా నా దగ్గర కొచ్చారు" రమణయ్యగారి [illegible]ంలో ప్రశాంతత ఏ మాత్రం చెక్కు[illegible].

"పేరెంటు అప్లికేషను లేకుండా శంకర్రావుకి టి.సి. ఎలా ఇచ్చారు?" ముక్కుపుటాలెగరేస్తూ రూలు తీసాడు శేషాద్రి.

"డిసిప్లినరీ యాక్షన్ క్రింద టి.సి. ఇష్యు చేసేటప్పుడు పేరెంటు దరఖాస్తు అవసరం లేదు" తాపీగా సమాదనమిచ్చారు ప్రిన్సిపాలుగారు.

"మావాడు చేసిన నేరం"

"మీకు తెలియదా"

"తెలిసుంటే అడగవలసిన అవసరం ఉండదనుకుంటాను"




దూరి వెంకటరావు

"సరే, మీరడిగేరు గనుక చెప్తున్నాను. మీవాడి కాండక్టు బాగులేదు. ఆ విషయం తెలియపరుస్తూ గతంలో మీకు ఉత్తరం వ్రాయడం జరిగింది. వాడికి అనునిత్యం లెక్చరర్సుతో ఘర్షణపడటం అలవాటు. ఆడపిల్లల్ని టీజ్ చెయ్యడం అతడి నైజం. ఇటువంటి లక్షణాలున్న వ్యక్తి కాలేజీలో చదవటానికి అనర్హుడు. అందుకే టి.సి. ఇచ్చి పంపించేసాను. పంతాలకు, పౌరుషాలకు పోయి మీవాడిని సమర్థిస్తే భవిష్యత్తులో వాడు మరిన్ని తప్పులు చేసే అవకాశముంది. మీవాడంటే నాకు ద్వేషం లేదు. వాడు బాగుపడాలంటే ఈ శిక్ష అనుభవించడం అనివార్యం. వాడిలో పరివర్తన వస్తే వచ్చే ఏడు తప్పకుండా మా కాలేజీకి ఆహ్వానిస్తాను" నచ్చ చెప్పే ధోరణిలో విషయమంతా విపులీకరించారు రమణయ్యగారు.

ఆవేశంలో వున్న శేషాద్రికి ఆయన చెప్పే మాటలేవీ తలకెక్కినట్లు లేదు.

"వచ్చే సంవత్సరంకాదు. ఈ క్షణంలో వాడిని మళ్ళీ జాయిన్ చేసుకోవాలి" పట్టు బట్టాడు శేషాద్రి.

"క్షమించండి అది జరగని పని" సున్నితంగా తిరస్కరించారు రమణయ్యగారు.

"మీరు ఆమాట అంటారనే జిల్లా విద్యాశాఖాధికారి వారి నుండి ఉత్తర్వు తీసుకొచ్చాను" జేబులోంచి కాగితం తీసి ప్రిన్సిపాలు బల్లమీద వుంచాడు శేషాద్రి.

డి.ఇ.ఓ.గారి ఆర్డర్ని సాంతం పదిమార్లైనా చదివుంటారు రమణయ్యగారు.

రూములో భరించలేనంత నిశ్శబ్దం.

ఆయన ఏం చేస్తారా అని అంతా ఆదుర్దాగా చూస్తున్నారు.

నువ్వు నన్నేమీ చెయ్యలేవన్నట్లు కిటికీ

## కర్తవ్యానికి గండి

లోంచి వెకిలిగా చూస్తున్నాడు శంకర్రావు.

కొన్ని క్షణాల అనంతరం కాగితం తీసి ఏదో వ్రాసి హిస్టరీ లెక్చరర్ గారిని పిలుచుకురమ్మని అటెండర్ని ఆదేశించారు రమణయ్యగారు.

"మాష్టారూ! నేను ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నాను. ప్రభుత్వం వారు మరొకరిని నియమించేవరకు మీరే ఇన్ ఛార్జిగా వ్యవహరిస్తారు. సంతకం పెట్టండి" అంటూ సీట్లోంచి లేచారు రమణయ్యగారు.

ప్రిన్సిపాలు చర్యను వీక్షిస్తూ ప్రతిమలా వుండిపోయాడు శేషాద్రి.

"నిదానంగా ఆలోచించండి మాష్టారూ మీరు తొందరపడుతున్నారేమోననిపిస్తోంది" అన్నారు హిస్టరీ లెక్చరరు హరగోపాల్ రావు గారు.

"లేదు మాష్టారు. నేనీ స్థితిలో ప్రిన్సిపాలుగా కొనసాగలేను. నా మూలంగా సంస్థ నాశనమవకూడదు. ఇక నాకు సెలవిప్పించండి" రెండు చేతులు జోడిస్తూ గుమ్మం దాటారు రమణయ్యగారు.

*** *** ***

"మురళి కాలేజీలో చేరాడా" గుమ్మంలో కాలుపెడుతూనే అడిగింది జానకమ్మ.

"లేదు" తృంచినట్లు సమాధానమిచ్చారు రమణయ్యగారు.

"అదేమండి మీరు వెళ్ళినా వాడికి సీటు ఇవ్వనన్నారా?" నిలదీసింది జానకమ్మ.

"ఏ కుర్రాడి వలన నేను పదిమందిలో పరాభవం పొందానో, ఏ అబ్బాయి కారణంగా నేను ఉద్యోగానికి రాజీనామా చేయవలసి వచ్చిందో ఆ కుర్రాడే నేడు కాలేజీ ప్రిన్సిపాలు. మురళి చదువుకోకపోయినా సంతోషంగా అంగీకరిస్తానేమోగాని, ఆ కాలేజీలో వాడు చేరడం నేను భరించలేను జానకీ".

భర్త మాటలకు అవాక్కైపోయింది జానకమ్మ. కొన్ని క్షణాలవరకు ఆమె పెదాలు విడలేదు. తరువాత కాస్త తేరుకుని అంది "ప్రిన్సిపాలు ఎవరైతే మనకేం? మనకుకావలసింది అబ్బాయి చదువు. వాడిని ఇక్కడ కాదని మరో ఊళ్ళో వుంచి చదివించడానికి మనకు స్తోమత ఎక్కడుంది? ఆలోచించండి. ఒకమారు మీరిదే పట్టుదలతో ఉద్యోగాన్ని త్యజించారు. ఇప్పుడు వాడి భవిష్యత్తునే మంటగలపాలనుకుంటున్నారు. దీనికి నేను ససేమిరా అంగీకరించలేను.

"కాను మాష్టారూ నా మూలంగా మీకెంతో అన్యాయం జరిగింది" అంటూ లోపల కొస్తున్న శంకర్రావుని చూసి ఆశ్చర్యపోతూ "ఎవరూ? శంకర్రావా?" అన్నారు రమణయ్యగారు.

"మీరు జీవితంలో చీకటిని నింపుకుని నా బ్రతుకులో వెలుగులు పండించారు. మీరు ఉద్యోగం వదిలేసి వెళ్ళిపోయిన మరుక్షణం నాకు కనువిప్పైంది. నేను చేసిన తప్పేమిటో తెలుసుకున్నాను. నన్ను మనస్ఫూర్తిగా క్షమించమని మీ పాదాలమీద పడాలనుకున్నాను. అప్పటికే మీరు ఊరు విడిచి వెళ్ళిపోయారు. నా తప్పును సమర్థించి మిమ్మల్ని పరాభవించిన పాపానికి మా నాన్న రాజకీయ సన్యాసం పుచ్చుకోవలసిన దుస్థితి వచ్చింది. ఒక మంచి వ్యక్తికి అపకారం చేస్తే దాని ప్రభావం మనమీద తప్పకుండా వుంటుందని అనుభవ పూర్వకంగా తెలుసుకున్నారు. నా మూలంగా మురళి చదువు పాడవకూడదని అతడు కోరుకున్న బై.పి. గ్రూపుతో ఫీజు కట్టేసి ఎడ్మిట్ చేసుకున్నాను. ఇదిగో రసీదు..."

ఎంతో నమ్రతగా వున్నాయి అతడి పలుకులు.

వివేకం ఉట్టిపడుతోందతడి మాటల్లో.

రమణయ్య జవాబు చెప్పలేక భార్యవంక చూసాడు.

పట్టుదలలు మాని అబ్బాయి చదువుకి సహకరించమని వేడుకొంటునట్లున్నాయి ఆమె నయనాలు.

మరుక్షణం కొడుకు ముఖంలోకి దృష్టి సారించాడు.

"నాన్నా! చేసిన తప్పుకు పశ్చాత్తాప పడుతున్న శంకర్రావుగారిని మన్నించండి. నన్నా కళాశాలలో చదువుకోనివ్వండి" అంటున్నాయి మురళి చూపులు. ●



# సినిమా కార్టూన్లు


పూలరంగడు
డబ్బుంది కదా అని మరీ అంత విచ్చల విడిగా ఖర్చు పెట్టకు అని చెప్పాను వింటేగా


మంచివారు మావారు
ఇప్పటి వరకూ మీరేదో మంచి వారనుకున్నాను పాపం.


అన్నదమ్ముల సవాల్
అమ్మా నాన్నల్ని నేను పోషించను గాక పోషించను కావలిస్తే నువ్ చూడు


సుందరాంగుడు
బాగా డబ్బున్న వాడిని పెళ్ళి చేసుకున్నావని విన్నాను కరక్టేనన్న మాట.


దొంగలకు దొంగ
నిన్న జరిగిన దొంగ తనంలో మన వాటా రాలేదా. అయితే ఆ గంగులు గాడిని లాక్కొచ్చి సెల్ లో పడెయ్యి
పోలీస్ స్టేషన్


సమరం
ఏమిటీ మనం దెబ్బలాడుకోబోతున్నామా ?!



సీరియల్

# సూపర్ హీరో



మన్నెం శారద

## 12

(గతసంచిక తరువాయి)

పీయూషకి మతి పోయినట్లుగా వుంది.

ఇండియావచ్చి ఇరవైనాలుగ్గంటలు దాటినా విజయ్‌ని కలిసి మనసారా మాట్లాడటానికి కుదరలేదు. విజయ్‌కూడ తానొక నెల ఫారిన్ ట్రిప్ వెళ్లగానే మరచి పోయేడా!' అని మనసులో చాల బాధ పడింది.

బయటకి వెళ్దామని ప్రయత్నించగానే తండ్రి పెద్దపులిలా ఎదురొచ్చి "ఇప్పుడే వచ్చేవు, అప్పుడే ఎక్కడికి?" అని గద్దించేడు.

"అలా... వెళ్లి ఫ్రెండ్స్‌ని చూసొస్తాను" అంది పీయూష నసిగినట్లుగా.

"నీ ఎత్తులు నాకు తెలుసు. అలా చెప్పి విజయేంద్ర ఇంటికి ఉడాయించాలనేగా!"

తన మనసు తండ్రి కనిపెట్టేయగానే నిస్సహాయంగా చూసింది పీయూష.

"అది కాదు..."

"ఏది కాదు! ఇందాక నీ వేషం చూసి - నన్ను నేను ఎంతగానో టాలరేట్ చేసుకున్నాను. ఒక నడివీధిలో పోలీస్ కమీషనర్ కూతురువై వుండి భయభక్తులు లేకుండా షూటింగ్‌లోకి కారు దిగి పరిగెత్తావంటే అది నీ పెరుగుదలలో లోపమో లేక నా పెంపకంలో లోపమో లేక నీ కన్నతల్లి నిన్నంత అందంగా పెంచుతుందో నాకర్థంకాలేదు" అన్నాడాయన అప్పుడే అక్కడకొచ్చి గుమ్మంపట్టుకొని నిలబడ్డ సుందరమ్మకేసి, క్రీగంటచూస్తూ.

సుందరమ్మ తప్పుచేసిన దానిలా తల దించుకొంది.

"ఇండియావచ్చి ఫ్రెండ్స్‌ని చూశానన్న సంతోషంలో అలా ప్రవర్తించేను. సారీ డేడీ!" అంది పీయూష మెల్లిగా జాలికొలిపేలా కంఠాన్ని పలికిస్తూ.

"ఊ! సారీలు చెబితే క్షమించేయడానికి నువ్వు చిన్న పిల్లవికావు. ఆఖరి పిల్లవని నీ తెలివి, చురుకు చూసి నిన్ను గారంగా పెంచినందుకు శ్రుతిమించి పోతున్నావు. అయినా నీకా సినిమావాళ్లతో ఏం పని? ఈ స్నేహం ఎంతదాక వెళ్తుందో ఆలోచించేవా?" అన్నాడతను గాంభీర్యం ఉట్టిపడుతున్న కంఠంతో

పీయూష మౌనం వహించింది.

పెళ్లి విషయం తల్లిదండ్రులతో తేల్చుకోమని నిఖిల ఆంటీ ఫోనులోచేసిన హెచ్చరిక గుర్తొచ్చిందామ్మాయికి.

కాని... ఇది టైముకాదు. తండ్రి హాట్ హాట్‌గా ఎగిరిపడుతున్నాడు.

అందుకే తలదించుకొని అమాయికతని ప్రదర్శిస్తూ నిలబడింది.

మోహనదాస్ కరంచంద్‌గాంధీ అంటే స్టేట్ అంతా హడలిపోతుంది.

సిన్సియారిటీకి, క్రమశిక్షణకి పోలీసు డిపార్టుమెంటులో అతనికి మంచి పేరుంది. ఆరడుగుల పొడవు, ఎత్తుకు తగిన కండరాలు తిరిగిన శరీరంతో, వత్తుమీసాలతో హిట్లర్‌లా వుండే భర్తనిచూస్తే సుందరమ్మకిప్పటికికూడ దడా, వణుకు పుట్టుకొస్తాయి. నిజానికి అతనితో కాపురం చేసి పిల్లల్ని తనే కన్నదా అని హడలిపోతుంది ఆలోచిస్తే. పడకగదిలోకూడ అతనితో చనువుగా మాట్లాడటానికి ధైర్యం చాలేదికాదు!

'సుందరీ!' అని అతను మెత్తగా పిలిచినా కొరడా ఝళిపించినట్లు దడదడలాడేది. ఈ పాతికేళ్ల జీవితంలో నీడయినా ఒక్కోటైములో మనిషినిమించి పొడవుగా సాగుతూందేమోగాని సుందరమ్మ మాత్రం అతని ప్రతి మాటని ఆజ్ఞగా పాటిస్తూ మధ్యాహ్నపు నీడలా అతని పాదాలక్రింద బ్రతికింది. అందుకే ఆ సంసారంలో నేటివరకు పొరపొచ్చాలు ఎరుగవు. గడబిడగాని గొంతుహెచ్చించి వాగ్యుద్ధం చేయడంకాని తెలియవు.

మిగతా పిల్లలుకూడ అతనింటికి వస్తున్నాడంటే ఎవరిగదుల్లో వారు గప్‌చిప్. ఇంటా బయటాకూడ తండ్రి రూపాన్ని కనుసన్నల్లో పెట్టుకొని అతనికి ఏవిధమైన తలవంపు, ఇబ్బందిరాకుండా చూసుకొని మెలిగేరు.

ఒక్క పీయూషకి మాత్రమే ఆ యింట్లో పూర్తి స్వేచ్ఛ, ధైర్యం ఉన్నాయి. కారణం పీయూష పుట్టగానే సుందరమ్మకి తీవ్రంగా జబ్బు చేసింది. తల్లిపాలు ఇవ్వకూడదన్నారు. ఆ సమయంలో పీయూష తండ్రికి చేరికయింది. ఆయావున్నా ఆమెను ఎత్తుకొని లాలించడానికి కొంత కాలాన్ని కేటాయించుకున్నాడతను. పీయూష అందం, చిలిపిదనం, ముద్దు ముద్దు మాటలు అతన్ని ఆకర్షించేయి. కొంత కాలం శెలవు పెట్టి పీయూషని దగ్గరుండి పెంచేడు. పీయూష పుట్టగానే రెండుసార్లు వెనువెంటనే ప్రమోషన్స్ రావడంకూడ కొంత మానసికంగా ఆమెపట్ల మిగతా పిల్లలకన్నా ఎక్కువ వాత్సల్యం పెంచుకోవడానికి కారణమయ్యేయి.

దాంతో ఆమెకు తండ్రి దగ్గర కొంత చొరవ ఏర్పడింది. అందువలనే గాంధీ ఆమెను కఠినంగా శిక్షించలేక పోతున్నాడు.

"ఇక నువ్వతన్ని కలవడానికి వీల్లేదు. మళ్లీ ఆ పరిస్థితిలో చూడాల్సివస్తే ఊరు

**ఇంతవరకూ సాగినకథ -: 7** కాంట్రాక్టరు గోపాలరావుతో వివాహమై మనస్పర్థలు కారణంగా విడిపోయిన ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నిఖిలేశ్వరి అనతి కాలంలోనే బిజీ హీరో అయిన తన కొడుకు విజయేంద్ర విజయాలను చూసి మురిసిపోతుంటుంది. కుటుంబపోషణా భారం మీదపడిన దమయంతికి చంద్రకాంత్ తన పిక్చర్లో అవకాశం కల్పిస్తాడు. చిన్ననాటి స్నేహితుడు కరుణాకర్‌ను వీడియో స్టూడియో పెట్టుకొనేందుకు విజయేంద్ర డబ్బిస్తాడు. దమయంతి అభిమాని సుధీర్ తనకు సినిమా ఛాన్సు యిప్పించమని అడుగుతాడు.

కోను."

"డేడీ!"

"నో ఫర్దర్ ఆర్గుమెంట్. ఇప్పటికే శ్రుతి మించేవు. ఇంకొంత కాలం ఉపేక్షిస్తే నువ్వేం చెబుతావో తెలుసు నాకు! ఈ విషయాన్ని ఇంతటితో త్రుంచడం మంచిది" అంటూ భార్యవైపు తిరిగి "పిల్లలు ఎక్కడికి వెళ్లి ఎలా ప్రవర్తిస్తున్నారో తెలుసుకోవడం తల్లి బాధ్యత! కమ్మగా వండిపెట్టడమే కాదు - ఒక కంట వాళ్లని గమనించడం నేర్చుకో!" అంటూ చకచక బూట్లు చప్పుడు చేసుకొంటూ వెళ్లిపోయేడాయన.

ఆయన వెళ్లినట్లు కారుశబ్దం దూరంకాగానే పీయూష చేతులు జోడించి "మమ్మీ, డేడీ కేమయింది?" అంది.

"అంతా విన్నావుగా. ఇంకేం అడుగుతావు. నీ విషయంలో నాన్నగారు చాల ఆందోళన చెందుతున్నారు. పిచ్చిపిచ్చి స్నేహాలు మాని ఇంటి పట్టున కూర్చో, కాలేజి తీసేవరకు" అంది సుందరమ్మ.

"నీకుకూడ ఆయన పైత్యం తలకెక్కింది. ఇంట్లోనే వుండటం నావలనకాదు. ఫ్రెండ్స్‌ని చూసి ఎంతకాలమైంది. నా ఫ్రెండ్ రజని దగ్గరకయినా వెళ్లనీ!" అంది గోముగా తల్లి భుజాలమీద చేతులేసి తలాన్చి.

"వెళ్లు. నిన్నేం గృహ నిర్బంధంలో పెట్టలేదు. కాని జాగ్రత్త! నువ్వేం చేసినా అది నా నెత్తికి చుట్టుకొంటుందని మరచిపోకు" అంది.



"మా అమ్మ మంచిది." అంది పీయూష తల్లి బుగ్గమీద ముద్దు పెట్టుకొని.

"పొగడ్తలు వద్దు. వేగిరం వచ్చేయాలి!"

"అలాగే" అంటూ కారుని తీసి డ్రైవ్ చేస్తూ బయట పడింది పీయూష.

* * * *

విజయేంద్రకిక షూటింగ్‌మీద మనసు లగ్నంకావడంలేదు. పీయూష వచ్చేసింది. తన కసలు గుర్తులేదా? అమ్మ చెప్పినట్లు లేచే! పీయూషతో ఒంటరిగా మాట్లాడాలి! ఎన్ని రోజులయింది తనని చూసి అంటూ పీయూష ఆలోచనలతో కొట్టుకుపోతోంది.

ఆకస్మాత్తుగా ఆకాశం మబ్బులు కమ్మి సన్నగా జల్లు పడసాగింది.

విజయేంద్ర మనసు సంతోషంతో పొంగిపోయింది.

ఇక ఈ రోజుకి షూటింగ్ కాన్సిల్ కాక తప్పదు.

వెంటనే అర్జెంటుగా ఇంటికెళ్లిపోవాలి! పీయూష ఈ పాటికి ఇంటికి వచ్చే వుంటుంది.

అతను వెంటనే ఇంటికి బయల్దేరేడు.

## తారాపథానికి నిచ్చెనలు!

# లాయర్ అవుదామనుకుని యాక్టర్ అయిన జూడీ డేవీస్

చాలామంది యాక్టర్లు ఎందుచేతనో మరి ముందుగా డాక్టర్లవుదామనుకుంటారు. ఇందుకు భిన్నంగా ప్రముఖ ఆస్ట్రేలియా నటి జూడీ డేవీస్ లాయర్ అవుదామనుకుని యాక్టర్ అయ్యింది. యాక్టర్ అయి ప్రపంచ ప్రఖ్యాతిని గాంచింది.

చిన్నతనంలో జూడీ డేవీస్ స్కూలు పిల్లల్నందర్నీ చేర్చి రక రకాల దుస్తులు తయారు చేసి నాటకాలు వేసేది. కొంతకాలానికి నటనపట్ల తన కెంతో ఆసక్తి వున్నట్లుగా తెలుసుకుని నటిగా ప్రయత్నాలు ప్రారంభించింది.

"నటి అవుదామనుకుని ఎంతో ఉత్సాహంగా ప్రయత్నాలు ప్రారంభించినా, నైతిక విలువలు లేకుండా దిగజారాలని తెలిసినప్పుడు ఎంతో నిరుత్సాహం కలిగేది అయితే అదృష్టవశాత్తూ నా కలాంటి ఆపద ఏదీ రాలేదు" అంది జూడీ



పాసేజ్ టు ఇండియాలో జూడీ డేవీస్.

పాటలు బాగా పాడగలిగిన జూడీ డేవీస్‌కు ఓ రోజు హాంకాంగ్‌లో ఓ మ్యూజిక్ గ్రూప్‌తో కలిసి పాటలు పాడే అవకాశం లభించింది తరువాత లిటరేచర్ చదివింది సిడ్నీలోని "నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డ్రమెటిక్ ఆర్ట్స్" నుంచి డిగ్రీ తీసుకున్నది అక్కడే ఆమెకు నటుడు కాలిన్ ఫ్రైల్స్‌తో పరిచయమేర్పడ్డది ఆ పరిచయం వారిరువురి వివాహానికి దారి తీసింది

"ఎందుకనో జీవితంలో చాలాకాలం ఒంటరిగా గడిపినట్టుగా అనిపించింది అందుకే పెళ్ళి చేసుకున్నాను వివాహానికి ముందు ఎంతో డిసిప్లిన్‌తో వుండేదాన్ని నాకు' నేను ఎన్నో నియమాలు పెట్టుకున్నాను వివాహానంతరం అవన్నీ పోయాయి, అంది జూడీ

వివాహానంతరం నటునిగా భర్త ఎదుగుదలతో పాటు నటిగా తన ఎదుగుదలను గురించి కూడా పట్టించుకుంది జూడీ "మైబ్రిలియంట్ కెరియర్" చిత్రం తరువాత హాలీవుడ్ నుంచి అనేక ఆఫర్లు వచ్చాయి అప్పటికి ఆమె వయస్సు 24 ఏళ్ళు నటనలో తాను ఇంకా నేర్చుకోవలసినది ఎంతో వుందనీ,

---

మనసంతా రెక్కలు విచ్చుకొని పీయూష చెంతకి పరిగెడుతోంది!

"పీయూ, మైడార్లింగ్" అనుకొన్నాడు పరవశంగా.

కారు ఇల్లు చేరగానే అతను ఒక్క ఉరుకులో ఇంట్లోకి వెళ్లేడు. వంటమనిషి ఎదురొచ్చేడు.

"అమ్మ లేదా?" అనడిగేడు ఆత్రంగా.

"సైట్‌కి వెళ్లేరండి" అన్నాడతను.

"నాకోసం... నాకోసం... ఎవరూ రాలేదా?"

"ఎవరూ రాలేదండి."

విజయేంద్ర మొహం నిరాశగా మారడం పి.ఏ. ప్రసాద్ గమనిస్తూనే వున్నాడు.

అతను చిన్నగా సకిలించి "రేపు షూటింగ్ శారదాలో వుంది. గణేశన్‌గారి సినిమా.

'ఎల్లుండినుండి మద్రాసులో చంద్రకాంతన్‌గారి పిక్చర్ షూటింగ్ ప్రారంభమవుతుంది ప్రయాణానికి ఏర్పాట్లు... అవీ చూసుకోవాలి. మీ కొకసారి గుర్తు చేద్దామని' అన్నాడు.

ఆ మాట వినగానే విజయేంద్ర మొహంలో రంగులు మారేయి.

"మద్రాసులోనా?" అన్నాడు కొంత నిరుత్సాహంగా.

"మీకిదివరకే చెప్పేను సర్! మద్రాసు వద్దని. చంద్రకాంతన్ గారిక్కూడ చెప్పేను - మీరు అమ్మగారిని వదలి వుండలేరని!" అంటూ అమ్మగారన్న పదం నొక్కి పలికేడు ప్రసాద్ భావయుక్తంగా.

విజయేంద్ర కాస్సేపు జవాబు చెప్పలేదు

పీయూష ఇన్ని రోజులకి స్టేట్స్‌నుండి తిరిగొచ్చింది. కనీసం ఒకసారి కలిసి మాట్లాడకుండానే ప్రయాణం అయితే... తనకి ఎంత బాధగా వుంటుంది. వచ్చి ఇన్ని గంటలయినా తనని కలవకుండా ఏం చేస్తోంది! అతనికి మతి చెడిపోతోంది.

"కాస్సేపు రెస్టు తీసుకుంటాను" అంటూ అతను బెడ్‌రూమ్‌కెళ్లి తలుపేసుకున్నాడు

మంచమ్మీద పడుకొన్నా మనసునిండా పీయూషే!

కవ్విస్తూ, నవ్విస్తూ చిలిపిగా పలుకరించే ఆమె రూపం అతని మస్తిష్కమంతా నిండి పోతోంది!

అతను మంచమ్మీదనుండి జంప్ చేసినట్లు లేచి వార్డ్‌రోబ్ తెరచి అందులో బట్టల వెనుకదాచిన పీయూష ఫొటో అందుకొని తని వితీరా చూశాడు.

"ఏయ్ మొద్దూ! ఊళ్ళోకి వచ్చి కూడా ఫొటోతో సరిపెట్టుకో మంటున్నావు నిన్ను పట్టుకొని రెండు బుగ్గలూ కొరకాలి!" అనుకొంటూ ఫొటోని గాఢంగా ముద్దుపెట్టుకొన్నాడు

సరిగ్గా అప్పుడే ఫోను రింగయింది

అతను ఒక్క గెంతులో ఫోనందుకొని

అందువల్ల మరికొంతకాలం నాటకాల్లోనే నటిస్తానని హాలీవుడ్ నుంచి వచ్చిన అవకాశాల్ని తిరస్కరించి ఆస్ట్రేలియాలోనే వుండిపోయింది జూడీ "కెరియర్" చిత్రంలో జూడీ నటన ఆమెకు అత్యుత్తమ కొత్త నటి అవార్డును, రెండు బ్రిటిష్ అకాడమీ అవార్డుల్నీ తెచ్చి పెట్టింది అమెరికన్ టెలివిజన్ చిత్రం "ఏ ఉమన్ కాల్డ్ గోల్డా" చిత్రం కోసం డేవీస్ ఇజ్రాయెల్ వెళ్ళింది ఇన్‌గ్రిడ్‌బెర్గ్‌మన్‌తో కలిసి ఈ చిత్రంలో నటించింది అప్పటికే కేన్సర్ వ్యాధితో మరణానికి దగ్గరవుతున్న



నటుడయిన భర్త కాలిన్ ఫ్రెయిల్స్

ఇన్‌గ్రిడ్‌బెర్గ్‌మన్ జీవితాన్ని ఎంత ధైర్యంగా సాగిస్తోందో చూసి ఆశ్చర్య



మేకప్‌లేని స్వచ్ఛమైన జూడీ డేవీస్

పోయింది డేవీస్.

"చిన్నతనంలో తెలియక ఎన్నో తప్పులు చేస్తాం. అంతమాత్రంచేత మన జీవితం ఆగిపోదు. ప్రపంచం విరిగి మనమీద పడిపోదు. ఒక తప్పు చేస్తే దానివల్ల సంభవించే నష్టంవల్ల మనం ఒక గుణపాఠాన్ని నేర్చుకుంటాం. ముందు ముందు ఈ గుణపాఠం మన కెంతో ఉపయోగిస్తుంది" అంటుంది డేవీస్.

డేవీస్‌కి ఇంట్లోనే భర్త నటునిగా కాంపిటీషన్‌గా వున్నాడు. ఈ విషయాన్ని ప్రస్తావించగా "మేమిద్దరం ఒకరి అభివృద్ధిని మరొకరు మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాం. అందువల్ల మాలో ఎలాంటి పొరపొచ్చాలకూ తావు లేదు రాదు కూడా" అంది

నటిగా మారినా సంగీతాన్ని మరచిపోని డేవీస్ "ఐరిష్" టిన్ విజిల్" "పియానో", "వయొలిన్"లను అద్భుతంగా వాయిస్తుంది

జూడీ డేవీస్ స్వచ్ఛమైన శాకాహారి అంటే అంతా ఆశ్చర్యపోతారు "మాంసాహారాన్ని జీవితంలో ఎప్పుడూ



అంతర్జాతీయ ఖ్యాతి నార్జించి పెట్టిన "మైబ్రిలియంట్ కెరియర్" చిత్రంలో శామ్ నెయిల్‌తో జూడీ

ముట్టరాదన్న నియమాన్ని జీవితాంతం పాటిస్తాను" అంది జూడీ

"హాయ్" అన్నాడు.

"నేను బాబూ అమ్మని! షూటింగ్ కాన్సిలయిందట కదూ! ఇంటి కొచ్చేసేవా" అంది నిఖిలేశ్వరి.

"హాయ్ మమ్మీ! నేనెంత ఆత్రుతగా వచ్చేసేనో తెలుసా?"

"తెలుస్తానే వుంది ఊళ్ళోకి పీయూష వచ్చినట్లుంది"

విజయేంద్ర వెంటనే కంగుతిని "అదేం కాదమ్మా! తనొస్తుందని నీకు తెలుసా?"

"తెలుసు!"

"మరి చెప్పలేదేం?"

"విజయ్! ఆ సంగతులన్నీ ఇంటికొచ్చేక మాట్లాడుకొందాం నువ్వు ముందు ఫోంచేయ్! నేను ఇన్స్‌పెక్షన్‌లో వున్నాను ఎన్నింటికొస్తానో చెప్పలేను" అంది నిఖిలేశ్వరి

విజయేంద్ర బుద్ధిగా "సరే అమ్మా" అని రిసీవర్ క్రెడిల్ చేసి తిరిగి ఫొటో అందు

## సూపర్ హీరో

కున్నాడు.

అతని ఆలోచనల్నీ పీయూషచుట్టే తిరుగుతున్నాయి

ఆ అమ్మాయి ఒక సెలయేరు లాంటిది!

తన జీవితంలోకి ఒక జలపాతంలా ప్రవేశించింది

ఈ సినిమా నటుడి గ్లామర్ తనని అడ్డుకోక పోతే తానీ పాటికి పీయూష దగ్గరకి పరిగెత్తేవాడు ఇద్దరూ చెట్టాపట్టాలేసుకొని పార్కుల్లో బీచ్‌లో ఒక చోటేమిటి ఎక్కడంటే అక్కడే డ్యూయట్లు పాడుకొనేవారు రోడ్లమీద పరిగెత్తేవారు ఇప్పుడు తానొక బందీ. స్వేచ్ఛగా ప్రవర్తించడానికి ఏ మాత్రం వీలులేని ఖైదీ అదే తన చదువు పూర్తి చేసుకొని ఏ ఉద్యోగం సంపాదించుకొన్నా పీయూషతో ఎక్కడంటే అక్కడ కలిసి మాట్లాడే స్వేచ్ఛ ఉండేది! ఈ రంగులవలలోకి తమాషాగా వచ్చిపడ్డాడు తను! తలచుకొంటేనే విచిత్రం!

తారా పథంలోకి రావాలని నటుడైపోవాలని ఎంతో మంది కలలు కంటుంటారు దానికోసం శ్రమిస్తారు కాని తను బి కామ్ పాసయి సి ఏ చేస్తుండగా ఒకరోజు ఇంటికి వస్తుండగా జరిగిందా సంఘటన

రోడ్డుమీద షూటింగ్ జరుగుతోంది

జనం గుమికూడి వున్నారు

విజయేంద్రని చూసి పిలిచేడొక ఫ్రెండ్

'ఇక్కడ కరాటే ఫైటింగ్ జరుగుతోంది రా!' అని

అంతే !

ఆ పేరు వినగానే ఆగిపోయాడు

కారణం అతనికి మార్షల్ ఆర్ట్స్‌లో ప్రావీణ్యత ఉండటమే!

జనాన్ని తప్పించుకొని లోనికి వెళ్ళేడు

అక్కడ హీరోకి, విలన్‌కి ఫైటింగ్ జరుగుతోంది స్టంట్ మాస్టర్ కరాటే పేరు చెప్పి ఏవేవో చేయిస్తుంటే విజయేంద్ర ఫక్కున నవ్వేసేడు

డైరక్టర్ అతనివైపు గుర్రుగా చూశాడు

"ఏమది? చుమ్మా ఉండలేరా? ఇది యెన్నా? షూటింగయి పూడ్చిందే!" అన్నాడు కోపంగా

"షూటింగయ్యే పూడ్చింది కరాటే పేరుతో ఘోరంగా ఫైటింగ్ సీన్స్ తీస్తున్నారు" అన్నాడు విజయేంద్ర వెక్కిరింపుగా

హీరో అతని వైపు కోపంగా చూశాడు

డైరక్టర్ మాత్రం కోపంగా చూడలేదు

"నీ పెయిరెన్నా?" అన్నాడు ఆసక్తిగా

"విజయేంద్ర"

"వేషమిస్తే వేసి పూడుస్తావా?"

"పూడ్చను"

"నీకు కరాటే తెరియు మా?"

"ఊ"

"ఈ ఐస్‌ని పగల కొడుదువా?"

"బ్రహ్మాండంగా!"

"పగలకొట్టి పూడ్చు"

"నేను పగలకొడ్తాను మీరు పూడ్చుకోండి" అని విజయేంద్ర చెయ్యి అడ్డం తిప్పి ఒక్కదెబ్బకి రెండు ముక్కలుచేసేరు

డైరక్టర్‌తోపాటు చుట్టూ జనం కరతాళ ధ్వనులు చేసేరు

హీరో మొహం నల్లగా మాడిపోయింది

కోపంతో షూటింగ్ కాన్సిల్ చేసుకొని కార్లో వెళ్ళిపోతున్న హీరోని చూసి కోపమొచ్చింది డైరక్టర్‌కి

వెంటనే విజయేంద్ర వైపు తిరిగి "నువ్వే నా సినిమాలో హీరోవి!" అన్నాడు

అతనే డైరక్టర్‌కమ్ ప్రొడ్యూసర్ గణేశన్

## సూపర్ హీరో

"నేనా?" ఆశ్చర్యపోతూ అడిగేడు విజయేంద్ర

"ఆమ! నీకు అందందా వుంది మంచి పర్సనాలిటీ కరాటేదా వచ్చు! ఇంకేం కావాలి?"

వెంటనే విజయేంద్ర స్నేహితులు అతను వారిస్తున్నా వినకుండా అతన్ని రెండు చేతుల్తో పైకెత్తేసేరు

"మా అమ్మగారి నడగాలి నాకు నటనంటే ఏంటో తెలీదు" అన్నాడు గాభరాగా

"ఇప్పుడు వేషాలు పూడుస్తున్న వారికిదా తెలిస్తేకదా! పద మీ అమ్మగారి నడుగుదాం!" అంటూ విజయేంద్రని కారెక్కించుకున్నాడు గణేశన్

గణేశన్ మాట విని ఆశ్చర్యపోయింది నిఖిలేశ్వరి

"వాడు చదువుకొంటున్నాడు సినీ పరిశ్రమ గురించి మాకేం తెలియదు" అంది అయోమయంగా

"దిగితేనే దేని సంగతన్నా తెలిసి పూడ్చేది. మీ పిల్లవాడుదా రొంబ అందంగా, పర్సనాలిటీగా వున్నాడు కరాటేదా తెలుసు ఇనుమంటి హీరో కుర్రాళ్ళు రాక పాత వాళ్ళుదా పాతుకుపోయి పాచిపట్టిపోయేరు అందుకే నేను పని మానుకొని మీ వీటి (ఇల్లు) కొస్తిని కాదనవద్దు పిల్లవాడికి ఇండస్ట్రీలో మంచి పేరుదా వచ్చును పణం సరే సరి! నేనుదా తీసుకొస్తినని అందరూ నన్ను పైకెత్తి పూడుస్తురు" అన్నాడు గణేశన్.

నిఖిలేశ్వరికి కాదనడానికి కారణాలు కన్పడలేదు

ముఖ్యంగా విజయేంద్ర స్నేహితులు విజయేంద్రని- నిఖిలని ఒప్పుకోమని ఒకటే వత్తిడి




ఢిల్లీలోని ఆంధ్రప్రదేశ్ భవన్‌లో జరిగిన 'సరస నవరస' వార్షికోత్సవాలలో ఆకాశవాణి నిలయ విద్వాంసులు శ్రీ కె. లక్ష్మీనారాయణ వయొలిన్ కచేరి చేస్తున్న చిత్రం. శ్రీ పి. గోపాలకృష్ణ మృదంగంతోను. మాస్టర్ జి రామచంద్ర తాళంతోను సహకరించారు

చేసేరు

అలా అతను చాల యాదృచ్ఛికంగా సినీరంగంలో ప్రవేశించడం మొదటి పిక్చర్ బంపర్ హిట్ కావడంతో పరిశ్రమ దృష్టి అతని మీద పడటం ఒకదాని వెంట మరొకటి శరవేగంగా జరిగిపోయేయి

ఒక రోజు సినిమా షూటింగ్‌లో వుండగా షూటింగ్ చూడటానికి కాలేజి అమ్మాయిలొచ్చేరు వాళ్ళు షూటింగ్ కాగానే ఆటోగ్రాఫ్‌కోసం అతని దగ్గరకొచ్చేరు ఒకరివెనుక మరొకరు పోటీపడుతున్నారమ్మాయిలు గబగబ సైన్ చేస్తున్నాడతను

"పట్టి సంతకం వద్దు ఏదైనా రాయండి"

ఆ మాట విని తలెత్తి చూశాడతను

ఎదురుగా గులాబీరంగు బుగ్గలతో మెరిసే కళ్ళతో బాబ్డ్ హెయిర్‌తో తళతళలాడే పెదవుల్ని కదిలిస్తూ నిలబడ్డ ఆ అమ్మాయిని చూడగానే మనసు గాలం వేసిలాగి నట్లయింది విజయేంద్రకి

"మీ పేరు?"

"పీయూష!"

"అంటే అమృతమన్నమాట!"

"అవును దేవతలు క్షీరసాగర మథనంలో దోచుకుపోయింది"

"అబ్బా, తెలుగు బాగా వచ్చే!"

"పడిపోయేరు నాకీ పేరెందుకు పెట్టేరని విసుక్కుంటుంటే మా మమ్మీ చెప్పింది ఇంతకీ దేవతలంటే ఇంద్రుడు సబార్డినేట్సాండీ!" అందా అమ్మాయి అమాయికంగా మొహంపెట్టి

"దేవేంద్రుడు దేవతలకి రాజు"

"అంటే మీరు కూడా ఆయనకి చుట్టమా!"

"అవును ఈలోకంలో ఉండే అమృతాన్ని నన్ను తాగమని పంపించేడు" అన్నాడు విజయేంద్ర ఆ అమ్మాయికి ఆటోగ్రాఫ్ తిరిగిస్తూ.

పీయూష ఆటోగ్రాఫ్ చూసుకొంది.

"అమృతం ఇంద్రుడి స్వంతం" అని రాసుంది.

ఆమె బుగ్గలు ఎర్రబడ్డాయి. గబగబా ఫ్రెండ్స్ చూపించమన్నా చూపించకుండా ఆటోగ్రాఫ్ పుస్తకం తీసుకొని పరిగెత్తింది.

నాల్గు రోజుల తర్వాత విజయేంద్ర వున్న సెట్స్ మీద పీయూషని చూసి ఆశ్చర్యపోయేడు.

ఆ అమ్మాయి గబగబ అతని దగ్గరకొచ్చి "మీకోసం ఇది తెచ్చేను" అంది చేతిలోని కారియర్ చూపిస్తూ.

"ఇదంటే?"

"చికెన్ బిరియాని, ప్రాన్స్ కట్‌లెట్స్"

# ప్రకటనలకు యాక్టర్ల రేట్లు



సినిమా నటులు యిటీవల అడ్వర్‌టైజ్ మెంట్లలో మోడెల్స్‌గా నటిస్తూ బాగానే డబ్బు గడిస్తున్నారు. వారిలో వినోద్‌ఖన్నా, మిథున్‌చక్రవర్తి, జితేంద్ర తరచుగా ప్రేక్షకులకు కనిపిస్తుంటారు.

సింథాల్ సబ్బు అడ్వర్‌టైజ్ మెంట్‌లో నటించిన వినోద్‌ఖన్నా రేటు ఆరులక్షలట. కాగా నేషనల్ పేనసోనిక్ అడ్వర్‌టైజ్ మెంట్‌లో కనిపించిన మిథున్ నాలుగు లక్షలు వసూలు చేస్తున్నాడట. ఇప్పుడు జితేంద్ర శక్తివంతమైన ఒక క్యాప్సుల్‌కు మోడల్‌గా వున్నాడట. మరి ఎంత పుచ్చుకుంటున్నాడో చెప్పటంలేదు. కాని సినిమాలకంటే యిదే వీళ్లకు గిట్టుబాటుగా వున్నట్లుంది. వుండదామరి!

---

"ఎవరు చెప్పేరు తెమ్మని"

"మొన్న సినిమా వాణిలో మీరు చెప్పేరుగా!" అంది సిన్సియర్‌గా పీయూష.

"నాకు ఇష్టం అని చెబితే తెమ్మని అర్థమా?"

"మరి ప్రియమైన పాఠకులకి మీ అభిరుచులు చెప్పడం రుచి చూపించడం కోసమేగా!"

"నేనలా తీసుకోను"

"మరెలా తీసుకుంటారు!"

"అభిమానులు చేత్తో తినిపించాలి!"

"అయితే కూర్చోండి!"

"ఇప్పుడా, షూటింగ్ సమయం!"

"అయితే నటించి వచ్చేయండి!"

"సరే!" అని లోలోపల నవ్వుకొంటూ సెట్లోకి వెళ్ళిపోయేడు విజయేంద్ర. ఒక టిపికల్ సీన్ నటించి వచ్చేటప్పటికి రెండు గంటలు దాటింది.

వచ్చిరాగానే పీయూషని చూసి "అరె! నువ్వింకా ఇక్కడే వున్నావా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"తినిపించాలన్నారుగా!" అంటూ అమాయికంగా అడిగింది పీయూష.

"అంటే నిజంగా తినిపించాలనేనా?"

"మరి!"

"అంత పని చెయ్యకు తల్లీ! రేపే పేపర్లో రాసేస్తారు" అన్నాడు భుజాలెగరేసి నవ్వుతూ.

"అయితే తినండి."

విజయేంద్ర కాదనలేకపోయేడు. తనకింటినుండి వచ్చిన కారేజి మరెవరికో ఇచ్చేసి ఆ అమ్మాయి తెచ్చిన భోజనం తింటుంటే పి. ఏ. వచ్చి "అమ్మగారు కోప్పడతారేమో సార్! ఇలా వేరే భోజనాలు చెయ్యనివ్వద్దని చెప్పేరిదివరకు చాలాసార్లు" అన్నాడు.

"ఒక్క రోజుకేం కాదులే!"

"మా భోజనానికి మీ అయ్యగారేం జబ్బున పడరులే! మా నాయర్‌కూడా చాలా జాగ్రత్తగానే వంట చేస్తాడు. లేకపోతే మానాన్నగారూరు కొంటారా?" అంది పీయూష కాస్త కోపంగా.

"మీ నాన్నగారి పేరేంటి?"

"మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ. మన దేశానికి స్వాతంత్ర్యం తెచ్చింది మాత్రం ఆయన కాదు."

"ఈ పేరు ఎక్కడో విన్నానే!"

"అందరూ అమాటే అంటుంటారు లెండి."

"అదికాదు....ఈ మధ్య....పేపర్లో...."

"అవును. డ్రగ్సో, స్మగ్లర్సో పట్టుకోగానే ఆయన పేపరెక్కుతారు."

"అంటే....?"

"సింపుల్! ఆయన కమిషనర్ ఆఫ్ పోలీస్!"

"మై గుడ్‌నెస్! నువ్విలా కారియర్లు మోస్తున్నావని తెలిస్తే....."

"నేనేం మొయ్యలేదు. వెనుక జీప్‌లో ఆర్డర్లీ ఉన్నాడు. ఇంటి దగ్గర నాయర్ వండేడు" అంది పీయూష.

"సరే! చాలా బాగున్నాయి డిషెస్. ఇక ఇంటికెళ్ళు. ఇక మళ్ళీ ఇలా ఏం తీసుకు రావద్దు. బావుండదు!" అన్నాడు విజయేంద్ర.

"ఏం బావుండదు?"

"చూసేవాళ్ళకి!"

"వాళ్ళందరికీ ఎందుకు బాగుండాలి! నేను మీ ఫాన్‌ని. నా కిష్టమైన పని నేను చేస్తాను. చూసే వాళ్ళందరికీ బాగుండే పని మనం చేయాలంటే....బ్రతకలేమని మా బామ్మ చెప్పింది!" అంది.

"మీ బామ్మకి నా జోహార్లు చెప్పు!"

"ఆవిడ చచ్చిపోయింది!"

"అయితే నా సంతాపం."

"పోయి పదేళ్ళయింది" మొండిగా అంది పీయూష.

"అయితే దశాబ్ద సంతాపం" అన్నాడు అంతకంటే మొండిగా విజయేంద్ర.

తర్వాత పీయూష అప్పుడప్పుడూ రావడము మానలేదు. తనకి తెలియకుండానే విజయేంద్ర మనసు ఆమెకి అంకితమైపోయింది. గత ఆరు నెలలుగా ఎక్కడ పత్రికలు పసికట్టి స్కాండల్స్ ప్రచారమవుతాయోనన్న భయంతో తమ స్నేహాన్ని అతి జాగ్రత్తగా రహస్యంగా దాస్తున్నాడు.

ఈరోజు షూటింగ్‌లో పీయూష చేసిన ఆగడం ఏవిధంగా రచ్చకెక్కుతుందోనని భయమున్నా....ఆడపిల్ల అందులోనూ తనకికాబోయే భార్యకున్నపాటి ధైర్యం, చొరవ తనకి లేకపోతే నిజజీవితంలో హీరో కాలేడని సరిపుచ్చుకున్నాడు.

అతని ఆలోచనా స్రవంతికి ఫోనురింగు అడ్డుకట్టయింది.

అతను రిసీవర్ అందుకొన్నాడు.

ఈసారి 'హాయ్' అనకుండా జాగ్రత్తగా 'హలో' అన్నాడు.

"హలో! నేను పీయూషని."

విజయేంద్ర "ఇప్పుడా, ఫోను చెయ్యడం! నేను నీతో మాట్లాడను" అన్నాడు కోపం నటిస్తూ.

"నీ అలకతో దొరికిన కాస్త కాలాన్ని దుర్వినియోగం చెయ్యకు. నీకు ఫోను చెయ్యడానికి రజని ఇంటికి రావాల్సొచ్చింది."

"ఎందుకని మీ డేడి రాజీనామా చేస్తే గవర్నమెంటు ఫోను ఎత్తేసేరా ఇంట్లోంచి!" అన్నాడు విజయేంద్ర కొంటెగా.

"ఛ! నీకన్నీ అలాంటి ఆలోచనలే వస్తాయి. మా డేడీ అకస్మాత్తుగా సినిమాలో విలనయిపోయి 'ఆ సినిమావాడితో కలిసేవంటే డొక్కచించిడోలు కట్టేస్తానన్న' స్టయిల్‌లో లెక్చరిచ్చేసేరు. మా మమ్మీకి టోపీ పెట్టి ఇక్కణ్ణుంచి ఫోను చేస్తున్నా!"

"నేను అనుకుంటూనే వున్నాను, పొద్దుట నడిరోడ్డు మీద అలాలాంగ్‌జంప్ చేస్తూ షూటింగ్ మధ్యకి వచ్చినప్పుడే మీ నాన్న విలనయిపోతాడని. ఎలాగూ కళ్ళుకప్పి బయటకి వచ్చేవుకదా, ఇంటికి రాకూడదూ!"

"అలానే అనుకున్నాను కాని మా డేడీకి

సరి "కొత్త" శీర్షిక

# హల్లో డాక్టర్! నేనేం చెయ్యాలి?

డా. కొత్త రవీంద్రబాబు



**కె. వెంకట్రావు, తెనాలి**

స్త్రీలో అండం ఎప్పుడు విడుదల అవుతుంది.

ఋతుస్రావం తర్వాత పన్నెండు నుండి పధ్నాలుగు రోజులలో అండం విడుదలకావచ్చు.

**సి. హెచ్. అనుదీప్, రేపల్లె**

గడ్డం, మీసం సరిగ్గా రాలేదు బరువు పెరగాలి.

పురుష హార్మోన్లు తక్కువయినందు వలన అలా వుండవచ్చు. డాక్టరుగారికి చూపించుకోండి. లేదా తెనాలిరండి - చూచి చెబుతా.

**డి. శ్రీనివాస్, కడప**

భయం, బెరుకు, బాధ, చదువులో వెనకబడ్డాను.

డెప్సొనిల్ 25 మిల్లీ గ్రాముల బిళ్ల రోజుకొకటి చొప్పన రెండు నెలలు వాడండి.

**జి. సుధ, మల్లేశ్వరం చిత్తూరు**

కాళ్లు పగుల్తున్నాయి. 18 సంవత్సరాలు.

ఏరోవిట్ రోజు 2 బిళ్లలు వాడి, డిప్సాలిక్ మందు రాత్రి రాసుకోండి (పగుళ్లమీద)

**శివరామ్**

21 సంవత్సరాలు వృద్ధునిలా కనపడతాను.

జెబెక్స్ రోజుకోబిళ్ల వినోఫిట్ జింసింగ్ రోజుకో గొట్టం ఆరు నెలలపాటు వాడండి. మధుమేహం వుందేమో డాక్టరుగార్ని సంప్రదించండి.

**కె.ఎస్. రావు, మల్లాపురం**

కంట్లో తెల్ల మచ్చలున్నాయి. విటమిన్ ఏలోపమన్నారు.

ఏరోవిట్ బిళ్లలు రోజు ఉదయం సాయంత్రం వాడండి.

**హెచ్. రాజశేఖరరెడ్డి**

కీళ్లవాపు, జ్వరం వుంది.

200 మిల్లీగ్రాముల జోలాన్ డిన్ రోజు మూడు పూటల మూడు బిళ్ళలు వాడి వారానికోసారి పెనిడ్యూర్ 6 లక్షల యింజక్షన్ చేయించండి.

**ఎస్.జె.రావు, ఫరీదుపేట**

పది సంవత్సరముల క్రింద వాసెక్టమీ చేయించుకున్నాను. ఇప్పుడు నడుంనొప్పి.

నడుంనొప్పికి వాసెక్టమీకి సంబంధం లేదు. డాక్టరుగార్ని సంప్రదించండి.

**పి. వెంకటాచారి, బోడుప్పల్**

ప్లాస్టిక్ సర్జరీవలన అందంవస్తుందా ఎక్కువసేపు నిలబడలేక పోతున్నా.

ప్లాస్టిక్ సర్జరీ విజయవంతమైనప్పుడు అందం వస్తుంది. స్టాంబాబిళ్ల రోజుకొకటి వాడండి.

ఁ

ఊరంతా కళ్ళు చెవులే! ఈ కోపమంతా మా మమ్మీమీద చూపిస్తారు."

"అయితే అనుభవించు. రేపు నేను మద్రాసు వెళ్తున్నాను."

"ఎందుకు?" ఆత్రుతగా అడిగింది పీయూష.

"నేను సినిమాల వాడిని. నటించడానికి."

"సారీ డియర్! కోపమొచ్చిందా, మా డేడీ భాషలో చెప్పేనుగాని నా ఉద్దేశ్యం అది కానేకాదు."

"కోపం కాదు బాధ! సినిమా వాళ్ళు సెట్‌లో నటిస్తే మిగతావాళ్ళు మేకప్ లేకుండా నిజజీవితంలో నటిస్తూనే వుంటారు. ఆ మాత్రానికి సినిమావాళ్ళని చులకనగా మాట్లాడటం దేనికి? మేము ఎంటర్ టెయిన్ చేస్తుంటేనేకదా మీరు థియేటర్స్ చుట్టూ, వి. సి. ఆర్.ల చుట్టూ ప్రదక్షిణాలు చేసేది!" అతని మాటల్లో కోపం ధ్వనించింది.

"అబ్బా! మా డేడీమీద కోపం నామీద చూపిస్తున్నావు.

ఆయన తరపున, నా తరపున నీ కిదే నా క్షమాపణలు! ఇక ఆ టాపిక్ వదిలేయ్. నీకోసం స్టేట్స్ నుండి ఏం తెచ్చేనో తెలుసా!" అంది పీయూష. గోముగా.

## సూపర్ హీరో

"నీ హృదయం!"

"అదసలు పట్టి కెళ్తేకదా తిరిగి తేవడానికి. నీ కోసం స్టేట్సంతా గాలించినా ఏమీ దొరకలేదు. అక్కడ ఏది తీసుకుందామన్నా అవన్నీ ఆల్ రెడీ నీ దగ్గర ఉన్నవే! అందుకే చాలా కష్టమయింది సెలెక్ట్ చేయడం!"

"ఇంతకీ ఏమిటో అది!"

"చెప్పను. చూపిస్తాను."

"నా కభ్యంతరం లేదు."

"యూ నాటీ! చంపేస్తాను."

"రా మరి!"

"అబ్బా! ఆశ! ఆంటీ లేదా ఇంట్లో!"

"లేదు. అందుకోసమే ఎంత ఎదురు చూశానో తెలుసా? వస్తే నీ బహుమతి మాటే మయినా నేను ఇచ్చేవాణ్ణి తియ్యని బహుమతి!"

"అందుకే రాలేదు డార్లింగ్! ఇప్పుడే నీ ప్రతాపం వి. సి. ఆర్.లో చూసేను."

"ఏం సినిమా?"

"డార్లింగ్ డార్లింగ్. ఆ పిల్ల కొత్తదా, నీ మీద అలా ఎగబడిపోయింది!" అక్కసుగా అడిగింది పీయూష.

"నీవు లేని లోటు భర్తీ చేస్తావంటే సరే అన్నాను" అన్నాడు విజయేంద్ర పీయూషని ఏడిపించాలని.

అటునుండి ఫోను కట్టయిన శబ్దం!

(ఇంకా ఉంది)

## గమ్యం

విలువైనది జీవితం
చేసుకోకు విషాదం
అనుభూతికి అది సొంతం
అనుభవించు ఆసాంతం.
ప్రేమిస్తే ప్రేమమయం
ద్వేషిస్తే ద్వేషమయం
నింపుకోకు అజ్ఞానం
పెంచుకో వివేకం
కావాలోయ్ నీ హృదయం
సముద్రమంత విశాలం
మనసే ఒక మందిరం
చేయకు దానిని కలుషితం.
ప్రతినిత్యం బాధామయం
అయినా ఆపకు నీ పోరాటం
తెచ్చుకుంటేనే సహనం
చేరుకుంటావు నీ గమ్యం!

-ఎ.వి.జి.ఎస్. మూర్తి

# బిట్ ఫర్ టాట్-43 ఫలితాలు!

## "ఎన్.టి.ఆర్. పవర్ కట్ చేసేసినాం!"

* రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

"కొత్తరకం జనరేటర్ వాడతారేమో ఆయనగారు! ఓ కంట కనిపెట్టండి!"

-ఎ.వి.ఆర్.ప్రసాద్ (నెల్లూరు)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

"ఇంటింటికో 'మినీ జనరేటర్ పథకం' పోగొట్టుకున్నారు ఆంధ్రులు పాపం!"

-సి.శ్రీనివాసమూర్తి (హిందూపురం)

మరి కొన్ని వాగ్బాణాలు

"అంతేనా? మీరుకూడా ఆరుకోట్ల ప్రజలను అంధకారంలో ముంచేయగలరే !"

-వి. కృష్ణమోహన్ రెడ్డి (నెల్లూరు)

"ఏ.పి.లో 'పవర్ కట్'ని 'రద్దు' చేయండి చూద్దాం!"

-వి. ఎల్. కందుకూరి (పిఠాపురం)

"విశ్వామిత్రను కట్ చేయలేరుగా!"

-బి. ఈశ్వరయ్య (కడప) ఓగిరాల శ్రీశాస్త్రి (చాగల్లు) -డి. వెంకటేశ్వరరావు (గుడివాడ)

"అయినా తప్పటంలేదు
మనకి ఈ పవర్‌కట్!"

-పి. సూర్యనారాయణమూర్తి (శ్రీకాకుళం)

-పి. జానకిరామ్ (గుంటూరు)

-జి. శ్రీధర్ (పెళ్లల్ల)

-కాకి కృష్ణారావు (క్రొత్త మంగళగిరి)

-పానుగంటి గోపాలకృష్ణ (చెన్నూరు)

-ఎస్.వి. సాయి ప్రసాద్ (తాడికొండ)

"చింతచచ్చినా....
పులుపు మాత్రం చావలేదు!"

-పి. శ్రీనివాసులు (అనంతపురం)

-కంకటి శంకర్‌రావు (సిర్పూర్ కాగజ్ నగర్)




లక్కీ పేర్లు కె.వి.లక్ష్మణరావు (మానేపల్లి), కె. వెంకటేశ్వరరావు (ఏలూరు), బి. రామకృష్ణ (చినఓగిరాల), కె.ఎన్. రాజవర్మ (విజయనగరం), ఎస్. శ్రీనివాసరావు (గుడ్లవల్లేరు), సాయిజ్వాల (నూజివీడు), కె.ఎ.ఎల్. సత్యవతి (మహబూబ్‌నగర్), ఎం. సీతామహాలక్ష్మి (జగన్నాధపురం), పద్మశ్రీ (ఒంగోలు), టి. నిరంజన్ (పీలేరు), మహ్మద్ అరిఫ్ (చిట్రగుంట), ఉదయ్ (పాలకొల్లు), గుబ్బల భూషణ్ బాబు (బరూచ్), సిహెచ్. సునీత (తణుకు), టి. కృష్ణమోహన్ (నల్గొండ).

# ఈవారంలో మీ యోగం

**9-3-1990 శుక్రవారం మొదలు**
**15-3-1990 గురువారం వరకు**

**మేషం:** క్రమంగా 'గురుడు' అనుకూలుడు కాగలడు. వృత్తియందు పెంపు చెప్పదగిన సమయం. వారమంతా, పత్రికా రంగాన శ్రమించువారికి, గనులందు, కార్ఖానాలందు శ్రమించు వారికి అనుకూలం. స్త్రీలకు: లాభదాయకం, వృత్తియందు పెంపు.

**వృషభం:** విద్యావేత్తల సహాయమున్నది. రాజకీయవాదుల పరిచయం మీ అధికార పెంపుకు ఆస్కారం. ఉత్తముల పరిచయం లాభప్రదం. గ్రహోను గ్రహంగల సమయం, గ్రహించాలి. స్త్రీలకు: యత్నకార్యానుకూలం, నూతన వ్యాపారాలనుకూలం, ప్రజారంగాన సిద్ధి, గ్రహించాలి.

**మిథునం:** సుప్రసిద్ధుల పరిచయం. రాజకీయంగా అనుకూలం. ఇంట శుభకార్యాలోచనలు. పనులందు శ్రద్ధాసక్తుల వసరం. వృత్తి పెంపునకు ఆస్కారం. రాజకీయ వాదులతో పరిచయం యోగాధ్యం. స్త్రీలకు: ఆరోగ్యమందు పెంపు, నాట్యనాటక, చిత్రరంగాన శ్రమించు వారికి అధికావకాశాలు.

**కర్కాటకం:** శుభ సమయం, ఆదాయమున్నది. యోగదాయకం. వృత్తియందు అభివృద్ధికరమైన మార్పు రానున్నది. ఇష్టబంధు సమాగమం, ఆట పాటల్లో ప్రావీణ్యమున్న వారికి, 'లాటరీ స్పెక్యులేషన్' లందు కొందరకు యోగమున్నది. స్త్రీలకు: ధనయోగం, ధనవృద్ధి, శుభసమయమే.

**సింహం:** స్వప్రయోజనం కొరకు, ధన సేకరణకు బాగా శ్రమించవలసిన సమయం. వృత్తియందు అభివృద్ధి ఉన్నా వ్యయరాశి స్థితుడైన 'కేతు' గ్రహం అధికంగా ఖర్చు పెట్టిస్తాడు. ఏమైనా వస్తువులు పోగొట్టుకొంటారేమో జాగ్రత్త. 'రోడ్డు' ప్రమాదానికి గురి కాకుండా చూచుకోండి. స్త్రీలకు: వృత్తి పెంపు, 'ప్రమోషన్'కు ఆస్కారం.

**కన్య:** అవసరాలకు డబ్బు అందటం వార ఫల గ్రహ విశేషమే. క్రమంగా 'శని' అనుకూలుడు కానున్నాడు. పదిమందిలో ప్రసిద్ధి ఏర్పడుతుంది. రాబడి క్రమాభివృద్ధి నందనున్నది, యిది వ్యాపార సంబంధం. వృత్తియందు ఏదో మార్పు రానున్నది. స్త్రీలకు: ధనయోగానుకూలం. బంధుమిత్ర సమాగమం.

**తుల:** రాజకీయంగా అనుకూలమున్నది. వ్యాపార రంగాన అభివృద్ధి యున్నది. స్థితిగతులందు పెంపున్నది. కృషియందు రాణింపు గల వారం. స్త్రీలకు: వాహనసౌఖ్యం, కుటుంబానందం. 'శని' గ్రహానుకూలత, కళారంగ ప్రీతి.

**వృశ్చికం:** అప్పులున్నాయిగా! వసూలు కాంది గండి. 'శుక్ర, శని' వారాలు బహు లాభదాయకాలు. ధన విషయంలో ఏ మాత్రం లోపంరాదు. కృషి యందు మేలున్నది. మాటకు మన్నన. పంపిణీదారులకు, ఛాయా గ్రాహకులకు మేలు. స్త్రీలకు: గాయనీవర్గానికి మేలు, ధనలబ్ధి.

**ధనుస్సు:** వారమంతా యోగదాయకం గాదు. ద్వితీయ రంగాన అభివృద్ధి, వ్యాపార లాభం, వస్తు వాహన సేకరణకు ఆస్కారం. కళారంగాన గుర్తింపు, ఒకానొక వ్యవహారాన మేలున్నది. గమనించండి. స్త్రీలకు: ఉద్యోగమందు అనుకూలత, ఆదాయవృద్ధి చెప్పవచ్చు.

**మకరం:** ఏ వ్యవహారమయినా అనుకూలమే. పదిమందిలో పేరుప్రతిష్ఠలు అబ్బుతాయి. నూతన మిత్ర సమాగమం. వ్యాపార రంగానుకూలత. శుభదాయక వారంగా గుర్తించండి. స్త్రీలకు: ధన రీత్యా లోపం లేదు. వృత్తియందు పెంపున్నది. ఆరోగ్యవృద్ధి, గమనించాలి.

**కుంభం:** పదిమందిలో ప్రతిష్ఠ యున్నది. ఆట పాటల్లో ప్రావీణ్యత యున్నది. కళాసాహితీరంగాన మేలున్నది. మాటకు ఆదరణయున్నది. అభీష్టసిద్ధి, వృత్తిరీత్యా అనుకూలం. యోగప్రదాయకం. స్త్రీలకు: సభా మర్యాద, వృత్తియందు పెంపు.

**మీనం:** పరుగుతో పందానికి దిగవలసిన వారం. ధనయోగమున్నది. 'గురు శుక్రులు' అనుకూలురు. రాజకీయాలందు ఎంతగా శ్రమిస్తే అంతమేలు. అతిథి అభ్యాగతులను ఆదరించవలసిన సమయం. స్త్రీలకు: వృత్తియందు అనుకూలత.కొందరకు ఆశించిన రీతి 'ప్రమోషన్' లభ్యం.

-విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

## ఉతుప్!

ఈ వారం ఆంధ్రసచిత్రవారపత్రిక అమల ముఖచిత్రంతో బహుహృద్యంగా వెలువడి ముచ్చట గొలిపింది. ముఖ్యంగా మధ్య పేజిలో (పాప్ సింగర్) ఉషా గురించి చాలా విషయాలు తెలుసుకున్నాము. "హల్లో డాక్టర్ నేనేం చేయాలి" 'కొత్త' శీర్షిక చాలా ఉపయోగకరంగా ఉందనడంలో సందేహంలేదు.

**బి. వెంకట్‌రాజు**
సుందర్‌నగర్.

## నాగరం

కథల కాణాచి "నాగరం" శ్రీ సోమయాజుల వెంకటరామమూర్తిగారి కథ చాలా బాగుంది. 1927వ సంవత్సరం సంచికలోని కథ ప్రచురించినందులకు నా మనఃపూర్వకాభినందనలు. ఇలాంటివే పాత సంచికలలోని పాత కథలను ప్రతివారం మా అభిమాన పత్రికలో ప్రచురించగలరని ఆశిస్తూ.

**తురగా సీతారామయ్య**
దానవాయిపేట.

## అమల

అసలు పత్రికకి చాలా అందాన్ని కల్గించేవి ముఖచిత్రాలే అంటే నిజమంటారుమీరు. ముఖ్యంగా ఈ వారం అమల ముఖచిత్రం చాలా అందంగా వుంది. చేప పిల్లకి ఈత ఎవరు నేర్పారు పదవిలో వున్న వ్యక్తికి రాజకీయాలు ఎవరు నేర్పారు? పసివాడికిమాటలు ఎవరు నేర్పారు? ఈ పత్రికనే చదవాలని పాఠకులకు ఎవరు నేర్పారు. నువ్వింత వాడవవుతావని ఎవరు చెప్పారు. ఇలా చెప్పుకుపోతే ఎవరికి ఎవరు ఏది నేర్పారు? ఈ ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోతుంది. కాబట్టి ఆంధ్రపత్రికనే చదవండి అని ఎవరు చెప్పక్కర్లేదు. ఆ సంచికనే చూస్తే చాలు దాని గొప్పతనం చాటి చెప్తోంది. ఇప్పుడర్థమైందా?

**చోడవరపు నాగేశ్వరరావు**
సికింద్రాబాదు.

## అన్నీ

16-02-90 అమల ముఖచిత్రముతో వెలువడిన మీ (మా) పత్రిక చాలా బాగుంది. "లవ్ గేమ్" చాలా ఇంట్రెస్టింగ్‌గా సాగుతోంది. అదే విధంగా సూపర్ హీరో కూడా! ఆ సంచికలోని కథలు ఒక కథ అని కాదు అన్ని కథలు బాగుగా వున్నాయి. కథలు ఎన్నుకోవడంలో అన్ని పత్రికల కంటే "ఆంధ్ర పత్రిక"యే నాకు మంచిగా అన్పిస్తుంది. ఈ మధ్య రెగ్యులర్‌గా వస్తున్నందుకు నాకు చాలా ఆనందముగా వుంది.

**అప్పె అంజనేయశర్మ**, వరంగల్




### – ఎయిర్ బస్సెక్కుదాం, హనీమూన్ తిరుగుదాం!

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి– ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలే గాని బాధించకూడదు. రసభరితంగా వుండాలే గాని అశ్లీలం కొట్టవచ్చి నట్టుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదేతుది నిర్ణయం.

### 12-3-'90లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!

# వీక్లీ పోస్ట్

(4 వ పేజీ తరువాయి....)

## సంపాదకీయం

16-2-90 సంచికలో 'నల్ల సూర్యోదయానికి నాంది' సంపాదకీయం ద్వారా చాలా చాలా విషయాలు తెల్సుకోడానికి వీలుకలిగింది. దక్షిణాఫ్రికా విమోచన పోరాటాన్ని నడిపించిన నేరానికి నెల్సన్ మండేలాను శ్వేతజాతి ప్రభుత్వం (తెల్ల ప్రభుత్వం) కటకటాలలో పడేసి బంధించింది. మండేలా అహింసా మార్గాన్ని విడనాడినప్పటికీ ఎటువంటి పరిస్థితులలోనూ తెల్లవారిపై ద్వేషం చూపలేదు. మండేలా తన జీవితమంతా ఆఫ్రికన్ ప్రజల పోరాటానికే అంకితం చేసాడు. సామరస్యంగా, సమాన హక్కులతో ప్రజలందరూ కలిసి మెలసి జీవించగల స్వేచ్ఛాయుత ప్రజాస్వామిక సమాజ స్థాపన ఆదర్శంగా తీసుకున్నాడు. జైల్లో ఉన్నప్పుడు మండేలా నరకయాతనపడ్డాడు. అయినా తన వాళ్లకోసం ఎన్నో కష్టాలను ఓర్చుకున్నాడు. ఆఫ్రికన్లకు దేవుడు మండేలా. జైలు గోడల నుండి బయట ప్రపంచంలోకి, స్వేచ్ఛా ప్రపంచంలోకి కాలుపెట్టిన మండేలా ఒక గొప్ప నాయకుడు. ఆంధ్రసచిత్రవారపత్రికలలోని సంపాదకీయాలు చాలా బాగుంటున్నాయి. నిజంగా ఆణిముత్యాలే. 'తాజాకాలమ్'లో వి.పి. సింగ్‌గారి టోపీ గురించి బహు చక్కగా రాశారు. 'తాజాకాలమ్' ద్వారా విజ్ఞానదాయకమైన విషయాలు ప్రతివారం అందిస్తున్నారు. ప్రముఖ గాయని ఉషా ఉతుప్ గురించి వ్యాసం బాగుంది. ప్రముఖ రచయిత చల్లా సుబ్రహ్మణ్యంగారి సీరియల్ 'లవ్ గేమ్' ఇంటరెస్టుతో నడుస్తున్నది. ఆంధ్రసచిత్రవారపత్రికను ఆంధ్రులకు ఇష్టమైన వారపత్రికగా ప్రతివారం తీర్చిదిద్ది కొన్ని లక్షల చేతులకు అందిస్తున్నందుకు సంపాదకవర్గాన్ని అభినందించలేకుండా ఉండలే(ను)ము.

**న్యాయపతి రమేష్‌బాబు**
హైదరాబాదు.

## రుద్రాక్ష మోక్షం

23-2-90 సంచికలో ప్రచురించిన "మోక్షానికి ద్రాక్ష రుద్రాక్ష" వ్యాసం ఎంతగానో నచ్చింది. అందులో రచయిత రుద్రాక్ష పుట్టుపూర్వోత్తరాలు, వానిని పరీక్షించు విధానాలు, ఒక్కొక్క దాని లాభాలు చాలా బాగా వివరించారు. కాశీగారి చిత్రాలు చాలా బాగుంటున్నాయి. వారికి మా అభినందనలు.

**బి. గిరిధర్**
కర్నూలు.

## అన్నీ బాగున్నాయి

ఆంధ్ర సచిత్రవారపత్రికలో తనకు తానే సాటి. మరిలేదు పోటీ. సీరియల్స్, కథలు సూపర్. టిట్‌ఫర్‌టాట్, వ్యాఖ్య పోటీలు ఫెంటాస్టిక్. 16-2-90 వీక్లీలో కలిమిశ్రీ గారి గురకబాబులు పేజి కార్టూన్ బాగుంది.

**ఓగిరాల శ్రీశాస్త్రి,**
(చాగల్లు.)

○

# అవీ-ఇవీ-అన్నీ



గూడవల్లి సిసీ కళాసాగర్ వారు కొసరాజు రాఘవయ్యచౌదరి స్మారక అవార్డు కొగంటి గోపాలకృష్ణయ్య గారికి జనవరి 28న ఇచ్చినప్పటి చిత్రం శ్రీయుతులు మిక్కిలినేని, గుమ్మడి అధ్యక్ష, కార్యదర్శులు ముమ్మనేని సుబ్బారావు యాద్దనపూడి లక్ష్మణరావులు చిత్రంలో వున్నారు



## జాతీయ సెమినార్‌కి జాగృతి కిరణ్

భువనేశ్వర్‌లో డిసెంబర్ 89న నాల్గవ ఇండియన్ ఇంజనీరింగ్ కాంగ్రెస్ జరిగింది ఇందులో భాగంగా డిస్టెన్స్ ఎడ్యుకేషన్ పై జరిగిన జాతీయ సెమినార్‌కి శ్రీ జాగృతి కిరణ్ వ్రాసిన టెక్నికల్ పేపర్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్ - కంట్రీ వైడ్ క్లాస్ రూమ్ ఎన్నికయినది ఈ సెమినార్‌లో శ్రీ జాగృతి కిరణ్ ప్రసంగించారు ఆయన ప్రసంగాన్ని సెమినార్‌కి ముఖ్య అతిధిగా వచ్చిన లోక్‌సభ స్పీకర్ రబిరాయ్ అభినందించారు ○




## సినిమా... సినిమా...

### కృష్ణ, నాగేంద్రబాబులతో "విష్ణు"

ప్రముఖ నటుడు, దర్శక నిర్మాత ఎం. బాలయ్యగారు సమకూర్చిన రసవత్తరమైన కథకు పరుచూరి సోదరులు భావగర్భితమైన సంభాషణలు రాశారు. సెంటిమెంట్‌తో పాటు హాస్యం కూడా మిళితమైన కథ అన్నారు ఎ. బి. ఎల్. ఎ. ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో బి.. బి. లక్ష్మి నిర్మించే శ్రీ విజయలక్ష్మి సినీ చిత్ర వారి "విష్ణు"లో కృష్ణ సరసన సితార నాయిక. ఇంకా నాగేంద్రబాబు, కె. ఆర్. విజయ, ఆహుతి ప్రసాద్, నర్రా, జుట్టు నరసింహం, నరేంద్ర వగైరా నటవర్గం. రాజ్-కోటి సంగీతం, వేటూరి, డి. నారాయణవర్మ గీతాలు, కబీర్‌లాల్ ఛాయ, సాయికుమార్ శిల్పం, రాజు సాహసాలు, ఎస్. శేషు సంయుక్త దర్శకత్వం, ఎం. ఎ. సత్యనారాయణ సహకార దర్శకత్వం, మురళి-రామయ్య కూర్పుతో ఎం. వెంకటేశ్వరరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

# "సినిమా ఆఫ్ ది వరల్డ్"లో చూపించిన వాటిలో కొన్ని గుర్తుంచుకోదగ్గ చిత్రాల కథాకథన

## లాండ్ స్కేప్ ఇన్ ది మిస్ట్ (గ్రీక్ చిత్రం)

ndscape in the
by Theo Angelopou

చిన్నతవం మంచి తల్లిపీడవ పెరి
గిన ఇద్దరు పిల్లలకి, అంతవరకు
చూడలేకపోయిన తమ తండ్రిని
చూసి తీరాలన్న కోరిక బలంగా
పెరిగినా అతని వివరాలు తెలి
యక, అమ్మనడిగినా వాటిని రాబ
ట్టలేక, చివరికి ఓమాట చెప్పా
పెట్టకుండా ఇంట్లోంచి పారి
పోయి ఓ పడమటి రైలెక్కే
స్తారు. చేతిలో చిల్లిగవ్వగానీ,
భుజాన చిన్ని సంచీగానీ లేకుండా
ఎలా వుంటాడోకూడా తెలీని తమ
తండ్రిని గాలిస్తూ చేసిన ఆ
విచిత్ర ప్రయాణంలో 14 ఏళ్ళ
లోపు ఆ అక్కా తమ్ముళ్ళ జీవితా
నికి మారేళ్ళ జీవితానుభవం కల
గడాన్ని థియో ఏంజిలో పౌలస్
అనన్య సామాన్యంగా తెరకె
క్కించి చూపారు. దార్లో వాళ్ళ
కొక మామయ్యలాంటి అపరిచిత
వ్యక్తి కలిసినపుడు తనకి చెత్తలో
దొరికిన ఓ చెడిపోయిన ఫిలింనె
గటివ్ పిల్లలకి చూపించి "ఇందులో
ఏవన్నా కనిపిస్తోందా- ఇంకొస్త
జాగ్రత్తగా చూస్తే మబ్బుగావున్న



దాన్లో దూరంగా ఓ పెద్ద
చెట్టు కనబడుతుంది చూడండి"
అంటూ జోక్ చేస్తాడు నిజా
నికి దాన్లో ఏమీ కనబడదుగానీ,
తమ ప్రయాణంలోని ఓ దశలో
వాళ్లు "నాన్న ఇంకా కనబడ్డేం!"
అని ఉసూరు మనుకుంటున్న
ప్పుడు, తమ కెదురుగా దట్ట
మైన పొగమంచుతో నిండిపోయిన
మైదానంలో దూరంగా మసక
మసగ్గా ఓ పెద్ద చెట్టు కనబడు
తుంది పరుగు పరుగున వెళ్ళి
వాళ్ళిద్దరూ తమ తండ్రిని కావ
లించుకున్నంత ఆనందంగా దాన్ని
కావలించు కుంటారు తమకి
ఆశాభావాన్ని కలిగించిన ఆ అను
భవంలోనే ఆనందాన్ని పంచు
కుంటుండగా తెరపడుతుంది. ఆ
పిల్లలు చూడవల్సి వచ్చిన నిర్దా
క్షిణ్య మానవ ప్రవృత్తి, చావునే
పద్యంలో సంబర జీవితం, కళ్ళు
మూయించి పైశాచిక కామానికి
వయోవృద్ధుణ్ణే ప్రేరేపించిన వ్యసన
ప్రభావం మొదలైనవన్నీ పెద్ద
పెద్ద సింగిల్ టేక్స్‌లో చిత్రీక
రించిన ఏంజిలోపౌలస్ చాతుర్యం
మహత్తరమనిపిస్తుంది. ఇది
ఫిలిం ఫెస్టివల్ ప్రారంభచిత్రంగా
ఎన్నిక చేయడం ఫెస్టివల్ విలువని
పెంచిందనడంలో సందేహంలేదు.

'ది లాండ్ స్కేప్ యిన్ ది మిస్ట్' గ్రీక్ చిత్రంలో ఒకదృశ్యం.

## "మైనెట్స్ ఆర్ మోర్ బ్యూటిఫుల్ దేన్ యువర్ డేస్": (ఫ్రాన్స్ చిత్రం)

శృంగార ప్రధాన చిత్రాన్ని, అసభ్యం



## శ్రీ చైతన్య ఆర్ట్ ప్రొడక్షన్స్‌లో రాజేంద్రప్రసాద్, రవిరాజా

చిత్రాలలో నవ్యత కోరే సగటు ప్రేక్షకుడి అభిరుచి స్థాయి నేడు మరింత ఎదిగింది దమ్మున్న కథ కన్నా కథనంలో కథనం మించి సన్నివేశాల రూపకల్పనలో, అన్నిటినీ మించి అద్భుతమైన టెక్నిక్‌ను ప్రేక్షకులు ఆశిస్తున్నారన్న విషయం అందరూ ఎరిగినదే ఉత్తమాభిరుచి ఉన్నతమైన ఆశయాలు గల యువకులు శ్రీ చైతన్య ఆర్ట్ ప్రొడక్షన్స్ బానర్‌లో ప్రేక్షకులు ఆశించే సాంకేతిక సృజనాత్మకతకు పట్టం కట్టే చిత్రాన్ని నిర్మించడానికి పూనుకున్నారు కథ ఎన్నుకోవటం దగ్గర నుంచి అత్యంత శ్రద్ధాసక్తులతో వీరు చేసే కృషికి తోడుగా ఎవర్ రైజింగ్ హీరో రాజేంద్రప్రసాద్, ఉత్తర భారతంలో త్వరలో విజయ పతాకాన్ని ఎగరవేయబోతున్న క్రియేటివ్- కమ్- కమర్షియల్ డైరెక్టర్ రవిరాజా పినిశెట్టి "ముత్యమంత ముద్దు" చిత్రం తర్వాత కలిసి పనిచేయటం మరో విశేషం. శ్రీ చైతన్య ఆర్ట్ ప్రొడక్షన్స్ విజయపరంపరలకు పునాది త్వరలో వేయబడుతోంది

## ఉగాదికి "సాహస పుత్రుడు

సోషల్ పాంటసీ నావల్టీ గల సబ్జెక్ట్ , అన్నారు రవిరాజా పినిశెట్టి ఈయన ఈచ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కె ఎస్ ఎన్ మూర్తి నిర్మించిన పి ఎన్ ఆర్ మూవీస్ 'సాహసపుత్రుడు చిత్రంలో సుమన్ రజని, హిందీ నటుడు అంజాద్‌ఖాన్ గొల్లపూడి మారుతీరావు అల్లు రామలింగయ్య నళినీకాంత్ శివాజీరాజా రమణ దివ్య బాగ్య అన్నపూర్ణ నటించారు సత్యానంద్ సంభాషణలు రాజ్-కోటి సంగీతం లోక్‌సింగ్ ఛాయ చంటి శిల్పం సాహుల్

## విధానం బెట్టిదనిన...

"రొమేరో" అనే అమెరికన్ చిత్రంలో ఒక దృశ్యం!

మమ్మక్తైనా తోచని విధంగా, కంటికింపుగాను, వీనుల విందుగాను రూపొందించగల ఆంద్రీజ లౌస్కీ దర్శక ప్రజ్ఞను ఈ చిత్రంలో చూడ గలుగుతాం ప్రముఖ నగరాల్లోని పెద్ద పెద్ద స్టార్ హోటళ్లలో బస చేసే వి ఐ పి ల కాల క్షేపం కోసం ప్రదర్శనలిచ్చే టూరింగ్ టీమ్‌లో 'బ్లాంచ్' అనే అపురూప సౌందర్యరాశి విష్య వాణిని వర్లించే ఐటమ్‌ని ప్రదర్శిస్తుంటుంది. ఐశ్వర్యానికి లోటులేకపోయినా ఆయుష్షు కరువైపోతున్న లూకాస్ బ్లాంచ్ సౌందర్యానికి బానిసఐపోతాడు ఆమె వెంటే తిరుగుతూ, ఆమె బస చేసిన హోటళ్ళలో బసచేస్తూ ఆమె నారా రోజంతా పగటి కలలు కంటూ ఆమె నారా దిస్తుంటే,, రాత్రిపూట తన ప్రదర్శనల్తో ఖరీదయిన ప్రేక్షకుల్ని ఆనందింపజేస్తూ తనను ప్రేమించే లూకాస్‌ని అన్నివిధాలా సంతుష్టుణ్ణి చేస్తుంది. లూకాస్ ఆమె పొందులో స్వర్గ సుఖాన్ని, మాతృప్రేమని, కసిని, దైన్యాన్ని కలగలుపుగా చవి చూస్తాడు. ఇలా వెయ్యేళ్లు గడిపేయాలను కుంటున్నంతలో అకస్మాత్తుగా ప్రాణం విడుస్తాడు. ఈ చిత్రంలో చాలా భాగం బాలే టెక్నిక్‌కీ, ట్రీకెన్స్ టెక్నిక్‌కీ షిఫ్ట్ అవుతూ, తరచుగా ఫ్లాష్ బాక్స్ పండినా ప్రేక్షకుడికి ఎక్కడా వినుగనిపించడం కానీ, అయోమయ పరిస్థితి ఎదురవడం కానీ జరగవు. ఈ చిత్ర దర్శకుడు, బ్లాంచ్ పాత్రధారి కథానాయకి సోఫీమర్సావూ ఈ ఫిలిం ఫెస్టివల్‌కి అతిథులుగా రావడం కలకత్తాలో పెద్ద [illegible]రణ అయింది.

'మైనేట్స్ ఆర్ మోర్ బ్యూటిఫుల్ దేన్ యువర్ డేస్' అనే ఫ్రాన్స్ చిత్రంలో ఒక దృశ్యం

## రొమేరో (అమెరికన్ చిత్రం)

నియంతృత్వపాలనలో మగ్గిపోతున్న ఎల్ సాల్వడార్ ప్రజల విముక్తికి పోరాడిన యోధానయోధుల కథ ఒక ఎత్తైతే, ఆర్చిబిషప్ ఆస్కార్ రొమేరో కథ మరొక ఎత్తు. ఈయన తన మానానతావాక క్రైస్తవ ఫాదరీగా వుండక విముక్తి పోరాటానికి కట్టిన ప్రజా ఉద్యమ నాయకుడిగా "నేను చంపబడితే, నారక్తమే ఈ ప్రజాస్వాతంత్ర్య పోరాట బీజంగా మారుతుంది - అది చిగురించి ఫలిస్తుంది!" అని చాటి, విప్లవాన్ని రేపి 1980లో ఓ ఆదివారం మాస్ జరుపుతుండగా పైశాచికంగా హత్యచేయబడ్డం చరిత్రకెక్కిన యదార్థం. ఈ కథని ఒళ్లు గగుర్పొడిచేలా చిత్రీకరించిన ఘనత ఆస్ట్రేలియన్ దర్శకుడు జాన్ దూగాన్‌దైతే, రొమేరో పాత్రకు అద్భుతంగా ప్రాణం పోసిన కీర్తి నటుడు రావుల్ జూలియాదే. ఈ చిత్రంలోని కొన్ని సన్నివేశాలు చూస్తున్నపుడు సీట్లోంచి ఎగిరి గంతేయించినంతపని చేస్తాయి. ముఖ్యంగా చర్చిలో నిశ్శబ్దంగా ప్రార్థనలు చేసుకుంటున్న ఎల్ సాల్వడర్ ప్రజలమీద దాడి చేసిన ప్రభుత్వదళాలు నిర్దాక్షిణ్యంగా కాల్పులు జరుపుతూ అక్కడున్న పెద్ద హోలీక్రాస్‌ని కాల్చి కిందపడగొడ్తారు. ఇదేం ఖర్మరా దేవుడా అనుకుంటుండగా, ఆపైఎత్తున శిలువమీదున్న జీసస్ క్రైస్ట్ విలువెత్తు విగ్రహాన్ని గుండెల్లో కాల్చి తునాతునకలుగా పేల్చిపారేస్తారు. (ఫెస్టివల్ చిత్రాలు సెన్సార్ చేయబడవు. గనుకనే అప్పుడప్పుడు ఇటువంటి సన్నివేశాలు తెరమీద చూడగలుగుతుంటాం.) రొమేరో హత్యకూడా అంత ఘోరంగా వుంటుంది. ఐతే, ఇదంతా ఆనాటి దమనకాండని దర్పణంపట్టిన హీనగర్హనగానే తీసుకోవాల్సివుంటుంది. విచిత్రమేమంటే - అక్కడి పోరాటం ఇంకా అలానే కొనసాగుతోంది ఈ రోజు కూడా - దీన్ని టొరంటో, లండన్ ఫెస్టివల్స్‌లో చూసినవాళ్లుకూడా 'షేమ్' అంటూ ముక్కున వేలేసుకుని ప్రశంసించినట్లు వార్తలొచ్చాయి.

— శంకు

---

సాహసాలు శోభప్రసాద్ సంయుక్త దర్శకత్వం ఎస్ వెంకటేశ్వరరావు ప్రొడక్షన్‌తో పింజల నాగేశ్వరరావు సమర్పణ

## బాలకృష్ణ "లారీ డ్రైవర్"

మేలో షూటింగ్ ముగుస్తుంది అన్నారు ఎస్ జయరామారావు ఈయన నిర్మాతగా రావుగోపాలరావు సమర్పించే జయా ప్రొడక్షన్స్ లారీ డ్రైవర్ చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, ఊర్వశి శారద రామిరెడ్డి, విజయకుమార్, బ్రహ్మానందం వినోద్, దేవదాస్ కనకాల, రాజాకృష్ణమూర్తి తనికెళ్ళ భరణి, అంజు, మాస్టర్ హరి బాబూ మోహన్, దినేష్ ఆదిగాగల వారు పాల్గొంటున్నారు పరుచూరి సోదరుల రచన జొన్నవిత్తుల గీతాలు చక్రవర్తి సంగీతం వి ఎస్ ఆర్ స్వామి ఛాయ రాజు శిల్పం రఘురాం-సుందరం నృత్యాలు, గోగినేని నరసింహారావు సంయుక్త దర్శకత్వం రాజు సాహసాలు కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో బి గోపాల్ దర్శకుడు

## "న్యాయపోరాటం"

చిరంజీవి పెదనాన్న కొడుకు దుర్గబాబును హీరోగా పరిచయం చేస్తున్నాం. విజయశాంతి సోదరి విజయరేఖ, షావుకారు జానకి మనుమరాలు వైష్ణవి నాయికలుగా నటిస్తున్నారు", అన్నారు నాయుడు బండారు. ఈయన దర్శకత్వంలో భాస్కరరాజా నిర్మించే వాసు ప్రొడక్షన్స్ "న్యాయపోరాటం" చిత్రంలో ఎ. ఎస్. పి. గా చంద్రమోహన్ నటిస్తున్నారు ఇంకాఅలేఖ్య చిన్న షావుకారు జానకి హేమసుందర్ టెలిఫోన్ సత్యనారాయణ ఏచూరి నాయుడు గోపి వేముల మోహనరావు నటిస్తున్నారు ఎస్ కె బ్రదర్స్ బాబూ గణేష్ సుధాకరరెడ్డి సత్యం రంగారావు కృష్ణ చంద్రశేఖర్ వెంకట్ మోహన్ ప్రభృత సాంకేతిక వర్గంతో టి పి దాసు శ్రీరంగనాద్ సహ నిర్మాతలు



"ఆడది"తో శారద, యమున

## మార్చి 15న "మగాడు"

"హీరో రాజశేఖర్ మార్చి మొదటి వారంలో మా చిత్రంలో మిగిలిన భాగాలను పూర్తి చేస్తారు. మార్చి 15న విడుదల చేయాలనుకుంటున్నాం", అన్నారు జీవిత. ఈమె సమర్పించే శ్రీ నవనేత్ర ప్రొడక్షన్స్ "మగాడు" చిత్రంలో • రాజశేఖర్, మురళీమోహన్, దేవదాసు కనకాల, త్యాగరాజన్, బాబూ ఆంథోని, రమణారెడ్డి, బాలాజీ, రాజేష్, ఏ. జె. శర్మ, రవిబాబు, కె. కె. శర్మ, హరిబాబు, హేమసుందర్, ప్రతాపచంద్రన్, ఆలీ, బాబూ మోహన్‌తో పాటు నవనటుడు అర్జున్ పాత్రధారులు. ఎస్. ఎన్. స్వామి, కె. ఎల్. ప్రసాద్, రాజ్-కోటి, విపిన్‌దాస్, వేటూరి, రాజన్, త్యాగరాజన్, గుణశేఖర్, సాయిరత్న, ఎం. వెంకటరమణ, ప్రభృత సాంకేతిక వర్గంతో మురళి శ్రీనివాస్, బాబూ గణేష్ సహ నిర్మాతలు. అర్జున్, బి. దేవరాజ్ నిర్మాతలు. కె. మధు దర్శకుడు.

## "రాముడు కాదు రాక్షసుడు"

"ఫిబ్రవరి షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయినట్లే" అన్నారు అట్లూరి రాధాకృష్ణమూర్తి. ఈయన నిర్మిస్తూ, గృహశాఖామాత్యుల పాత్ర నిర్వహించే ప్రభావతి ప్రొడక్షన్స్ "రాముడు కాదు రా చిత్రంలో సుమన్, రాధ, భానుప్రియ, రామిరెడ్డి, శుభలేఖ సుధాకర్, రాజా, రాళ్ళపల్లి మహేష్, ఆనంద్, పి. జె. శర్మ, బాబూ మోహన్, నగే బాబు, మాగంటి సుధాకర్, హేమా చౌదరి, నిర్మల, అనూరాధ, ఒక కీలకమైన పాత్రలో జగ్గయ్య నటిస్తున్నారు. రాజ్-కోటి, వి. ఎస్. ఆర్. స్వామి, పేకేటి రంగా, విజయన్, తార, బి. కృష్ణంరాజు, అక్కినేని వినయ్, కె. ఎస్. ప్రకాష్, ధవళ చిన్నారావు, రెడ్డి ప్రభృత సాంకేతిక వర్గంతో కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వం : దాసరి.

-జీ.వి.జీ.

Editorial Adviser: *S. RADHAKRISHNA*, Editor: *VEERAJI*,
Printed and Published by *S. NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003.
Phones: Editorial: 75667, Business: 61247, 61248.